# మనవి

ఏదేశ రాజ్యాంగ విధానమైనను ఆ దేశీయులచే ఎన్నుకొనబడిన ప్రతినిధులచే ఏర్పరుపబడి, వారికి బాధ్యతవహించు ప్రజాపరిషత్తు చేతనే తయారుచేయబడవలెను. అట్లు రచింపబడిన రాజ్యాంగ విధానానుసారం ఏర్పడిన ప్రభుత్వముమాత్రమే ఆ దేశీయుల గౌరవమున కర్హమైన ప్రజా ప్రభుత్వము కాగలదు. భారతజాతీయవాదులందరు చిరకాలముగ చాటుచున్న ఈ సత్యము, చేయుచున్న ఈ ఆందోళనము నేటికి కొంత ఫలించినది.

భారత రాజ్యాంగ ప్రజాపరిషత్తునకు ఎన్నికలు పూర్తి అయినవి. స్వతంత్ర భారత రాజ్యాంగ దివ్యసౌధనిర్మాణము త్వరలో ప్రారంభము కాబోవుచున్నది. దశ దిశల నాశారేఖలు కాన్పించుచున్నవి. దాస్య భారతి స్వతంత్ర భారతియై, సకల ప్రాచ్య రాజ్య రత్నహారమునకు నాయకమణియై, మహోన్నతమైన తన ప్రాచీన గౌరవస్థానమును అచిర కాలములోనే తిరిగి ప్రతిష్ఠాపించుకొనగలదని స్వాతంత్ర్యానురక్తమైన భారత ప్రజాహృదయ మానందముతో నాశించుచున్నది.

ఆశావహమైన ఈ శుభసమయమున రాజ్యాంగ పరిషత్తును గురించియు, దాని పుట్టు పూర్వోత్తరములను గురించియు, సంపూర్ణముగ సవిమర్శముగ వివరించు నిట్టి యమూల్య గ్రంథమును ప్రచురించు నవకాశమున్ను మాకు కలిగించినందులకు గ్రంథకర్త మాన్యశ్రీ వెంకటరంగయ్య గారికినీ, ఈ గ్రంథమునకేగాక తాము ప్రకటించు ఇతర ఆంగ్ల మాతృకలకన్నింటికి నాంధ్రానువాద స్వామ్యము మాకొసంగిన 'హింద్ కితాబ్సు' వారికిని, అనువాదముచేసి యిచ్చిన శ్రీ అంజనేయులు గారికిని నా హృదయపూర్వక వందనములు.

రాజకీయ విజ్ఞానార్థులైన ఆంధ్ర యువతీ యువకులకు, ఇతర జాతీయవాదులకు ఈ గ్రంథము విశేషముగ నుపకరించగలదని విశ్వసించుచున్నాను.

ఇట్లు,

8-8-46, మాగంటి బాపినీడు,

ఏలూరు. ప్రధాన సంపాదకుడు.

# విషయసూచిక







# ప్రజా పరిషత్తు



## 1. తొలిపలుకు

భావి భారత రాజ్యాంగ యంత్రం యేవిధంగా ఉండాలి అనే విషయం కొంతకాలంనుండి ప్రజల దృష్టిని ఆకర్షిస్తూన్నది. నూతన రాజ్యాంగ నిర్మాణ విధాన సందర్భంలో హిందూ మహమ్మదీయులకున్నూ తక్కిన అన్ని ముఖ్యముతాలకున్నూ (Important elements) సిద్ధాంత రీత్యా ఒడంబడిక కుదిరి తేనే తప్ప యుద్ధకాలంలో పని చేయవలసిన తాత్కాలిక జాతీయ ప్రభుత్వ సంస్థాపనము కూడా సాధ్యపడదని రాజ ప్రతినిధి షరతు పెట్టినాడు. ఈ విషయంలో ఇంతవరకూ ఒడంబడిక కుదరక పోవడమే దేశంలోని నేటి రాజకీయ ప్రతిష్టంభనమునకు పూర్తిగా కాకపోయినా, కొంతవరకైనా కారణం. ఈ సందర్భంలో కుదిరిన ఒడంబడికను, ఒక విధంగా భావి రాజ్యాంగ నిర్మాణమునుగూర్చి కుదిరిన తాత్కాలికపు టొడంబడిక అనికూడా అనుకోవచ్చును. రాజ్యాంగశాసనమును నిర్మాణముచేసే సంస్థయొక్క స్వరూపము పైననే ఆ చట్టముయొక్క గుణ దోషములు చాలావరకు ఆధారపడి ఉండును గనుక ఆలా అనుకోవడం అసమంజసంకాదు. కాబట్టి దేశంలోని రాజ

కీయ చైతన్యంగల అన్ని వర్ణాలూ అంగీకరించతగిన రాజ్యాంగ నిర్మాణ యంత్రమును మనం కనిపెట్టవలసిన ముఖ్యావసరం ఎంతో కనబడుతూన్నది.

సూచించబడిన విధానాలు :

ఇందుకుగాను అనేక పద్ధతు లిదివరకే సూచింపబడినవి. వాటి గుణదోష విచారణలనుగూర్చి చర్చలు కూడా జరుగుతూన్నవి. యుక్తవయస్సు వచ్చిన స్త్రీ పురుషులచే ఎన్నుకోబడిన రాజ్యాంగ నిర్మాణ సభయే, భావి భారత రాజ్యాంగ శాసనమును రచించవలెనని భారత జాతీయ మహాసభవారు సూచించారు. బ్రిటిష్ ఇండియా రాష్ట్రములలోని శాసనసభలు ఎన్నుకొన్నవారు కొంత మందిన్నీ స్వదేశసంస్థానాలచే నియమింపబడినవారు కొంత మందిన్నీకలసి ఈ రాజ్యాంగ నిర్మాణమును చేయవలెనని సర్ స్టాఫర్డ్ క్రిప్సు ప్రతిపాదించాడు. కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా, దేశాల రాజ్యాంగములను తయారుచేసిన సంస్థవంటి, చిన్న చిన్న ప్రతినిధి సభలుమాత్రమే ఈ పని చేయతగినవని సర్ మారిస్ గయర్ గారు వాదిస్తూన్నారు. ఆయన ఈ సభయొక్క పరిమాణమునకెక్కువ ప్రాముఖ్యమిస్తూన్నట్లు కనిపిస్తూన్నది. బ్రిటిష్ ఇండియాలోని రాష్ట్ర ప్రధానులున్నూ, ప్రముఖ స్వదేశసంస్థానాల దివానులున్నూ కలసభ ఈపనిచేస్తే బాగుంటుందని మఱి ఒక రంటూన్నారు. ఇంకా వివిధ రాజకీయాభిప్రాయాలకు చెందిన అనేకమంది

అనేకవిధములైన సూచనలను చేస్తూన్నారు. కాబట్టి ఇప్పుడు వీటినన్నిటినీ సమగ్రంగాపరిశీలించి సముచితమైన నిర్ణయానికి రావడం అవసరం.

నూతన రాజ్యాంగాలను తయారు చేయవలసిన సందర్భంలో ఆధునిక ప్రపంచంలోని యితర దేశాలేయే మార్గాలను అవలంబించినవో తెలుసుకోవడం మనకు చాలా ప్రయోజనకరం. రాజకీయ సమస్యలు కాని, రాజ్యాంగ నిర్ణయ సమస్యలు కాని ఇండియాకు ప్రత్యేకంగా తటస్థించిన కొత్త సమస్యలుకావు. ఇతర దేశా లనేకం ప్రజాస్వామ్య ప్రభుత్వాలనూ, జాతీయ ప్రభుత్వాలనూ స్థాపించుకోవలసిన తరుణం వచ్చినప్పు డిటువంటి సమస్యలనే ఎదుర్కోవలసి వచ్చింది. కాబట్టి ఈ సందర్భంలో ఆ దేశాలతో ఇండియాకు చాలా పోలిక ఉన్నది. అంతేకాదు; విదేశీయ సంస్థలను అనుకరించినంత మాత్రంతో అవమానం రాదు. "ఇదివర కెక్కడ కనీ వినీ యెఱుగని సరి కొత్త రాజకీయ సంస్థలను సృజించే మేధాశక్తి మానవులకు చాలా తక్కువ" అన్నాడు ప్రొఫెసరు మెక్లియాడు (McLeod). కాబట్టి మానవ సభ్యత, మానవ విజ్ఞానము మొదలగు తదితర విషయములలో వలెనే, రాజకీయ విధానములను పెంపొందించడంలోకూడా అనుకరణం చాలా ప్రధాన స్థానమాక్రమిస్తూఉన్నది. నిజానికి ఆధునిక రాజ్యాంగములను నిర్మించిన వారిలో దాదాపుగా అందఱూ చాలావరకు యితర

యుగములకూ యితర రాజ్యాలకూ, చెందిన సంస్థలను బాగా పరిశీలించి వాటి ప్రభావమునకు లోబడినవారే. ఈ రోజునకూడా అది తప్పని సరి అవుతూన్నది. ప్రపంచానికి వెలిగా ఉండడం ఎవరికీ సాధ్యంకానిపని. "విదేశీయులను చూసిన చిత్త వృత్తితో అర్థంలేకుండా అనుకరించే దేశాల లోని సంస్థలు అజీర్ణ వ్యాధిగ్రస్తుని బాధ అనుభవిస్తూన్నట్లే, ఇతర చోట్ల ప్రయోగించి పరీక్షించి చూచిన రాజకీయాభి ప్రాయాలనూ, పద్ధతులనూ అనుకరించేటందు కేవగించు కొనే దేశాలలోని సంస్థలుకూడా తగిన పోషణలేక జీర్ణించి పోవచ్చును. అతి ప్రాచీన కాలంలోనూ, మధ్యయుగంలోనూ, ఆధునిక యుగ ప్రారంభదశలోనూ యితర దేశాలతో సంబంధంలేని ప్రభుత్వ విధానము సర్వ సాధారణంగా సాధ్య పడేది. కాని ముద్రణాయంత్రాలు, రేడియోలు, సినిమాలు ఈ నవీన ప్రపంచకంలోని ప్రభుత్వ విధానాలను వెల్లడి చేస్తూండగా లోకంతో సంబంధంలేని సరి కొత్త ప్రభుత్వ పద్ధతి ఆచరణలోకి రావడం దుస్తరం." అని ప్రొఫెసర్ హో గుడ్ వ్రాసిన విషయాలలో ఎంతో నిజం ఉంది.

ఆధునిక ప్రజాస్వామ్య పద్ధతులకు మూలపురుషు లైనవారు, ఆయా సమాజములకు తగిన ప్రభుత్వవిధానాలను సృజించడమే రాజ్యాంగ చట్టముయొక్క ఉద్దేశమని నిర్ణ యించినందు వలననే రాజ్యాంగ శాసన నిర్మాణ సభలకింత ప్రాముఖ్యతవచ్చినది. యూరపు ఖండంలో పదహారవ

శతాబ్దంనాటి ప్రభుత్వాలు నిరంకుశ చక్రవర్తుల చేతులలో ఉండేవి. వారు తమ అధికారాలు దైవదత్తములనీ, మానవులకే మీ సంబంధంలేనివని భావించేవారు. కాబట్టి వారు దైవానికితప్ప మనుష్యమాత్రులకు బాధ్యులు కానట్లు ప్రవర్తించేవారు. వారి చిత్తంవచ్చినట్లు అధికారం చలాయిస్తూండడంవల్ల ప్రజలు చాలా కష్ట నష్టాలను భరించవలసి వచ్చింది. ప్రజల ధన, మాన, ప్రాణములకు సంబంధించిన సర్వసాధారణ ప్రాథమిక హక్కులుకూడా వారికి లేకుండా పోయినవి. కాబట్టి ప్రభువుల ఈ నిరంకుశాధికారాన్ని నిగ్రహించి దుర్వినియోగం చేయకుండా అరికట్టేటందుకు యేదో ఒక చట్టం కనిపెట్ట వలసివచ్చింది. అదే లిఖిత పూర్వకమైన రాజ్యాంగ శాసనంగా పరిణతి పొందింది.

**రాజ్యాంగ శాసనస్వభావము :**

రాజ్యాంగశాసనమును, స్వరూపము(formal), ఆచరణ (functional) అనే రెండు భిన్నదృక్పథాలనుండి చూడవచ్చును. స్వరూప దృక్పథమునుండి చూచేయెడల అది ప్రభుత్వనిర్మాణమునకు సంబంధించిన నియమాలతో నిండి ఉంటుంది. ఈ అర్థంలో అయితే, ప్రతిప్రభుత్వానికీ– నిరంకుశ ప్రభుత్వానికిగానీ, ప్రజాస్వామ్యానికిగానీ– యేదో ఒక రాజ్యాంగశాసనం పేరుకుఉన్నట్లు భావించవచ్చును. కాని ఆచరణ దృక్పథంలోనుండి చూచేటట్లయితే, తానుచేసే ప్రతిపనికీ ప్రభుత్వం ప్రజలకు బాధ్యతవహించి ఉండాలి.

పౌరులహక్కులకు అది యేమాత్రమూ భంగం లేకుండా వ్యవహరిస్తూ వాటిని రక్షించి పోషించడానికి తగిన కార్య కలాపమంతా జాగ్రత్తగా నిర్వహించాలి; ఈ పద్ధతులమీద నిర్మింపబడిన ప్రభుత్వం ఉన్నప్పుడే నిజమైన రాజ్యాంగచట్ట మున్నట్లు తలంపబడుతూన్నది. ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాన్సు దేశాలలో విప్లవాలు చెలరేగి ఆలోచనమీద నూతన రాజ్యాంగశాసనాలు తయారుచేయబడిన తొలిప్రయత్నపు రోజులలోకూడా రాజకీయవేత్తలంతా రాజ్యాంగశాసన మనే పదాన్ని ఈ అర్ధంలోనే గ్రహిస్తూవచ్చారు. ఇప్పటికీ చాలామంది గ్రంథకర్తలు ఇదే అర్థంలో ఆమాటను వాడు తూన్నారు. సరియైన రాజ్యాంగతత్వాన్ని (Constitution-alism) ప్రవేశపెట్టడము కానీ లేక ప్రభుత్వాన్ని నియమ బద్ధంగా (Constitutional) చేయడంకానీ రాజ్యాంగచట్టము యొక్క ఉద్దేశమని వారి అభిప్రాయం. "శాస్త్రీయ ప్రభుత్వము (Constitutional) అనేమాటను ఏదో ఒక రాజ్యాంగచట్టానికి అనుగుణంగా నడుపబడుతూన్న ప్రభుత్వం అనే అర్థంలో మనం వాడడంలేదు. మన ఆలోచనకు తావి స్తూన్న ప్రతి ఆధునికప్రభుత్వమునకూ కూడా లిఖితంగా గానీ అలిఖితంగాకానీ యేదో ఒకరాజ్యాంగచట్టం ఉండనేఉన్నది. అంతమాత్రంతో అవన్నీ చట్టబద్ధమైన (Constitutional) ప్రభుత్వాలని కలలోకూడా అనుకోకూడదు......ప్రజల క్షేమంకోసమూ వ్యక్తిస్వాతంత్ర్యరక్షణకోసమూ తన అధి

కారాలను వినియోగిస్తూన్న ప్రభుత్వమే చట్టబద్ధమైన ప్రభుత్వము'' అని ఉడ్రొవ్ విల్సన్ చెప్పిఉన్నాడు. 'ప్రభుత్వ, రాజకీయచర్యలను తగిన అదుపాజ్ఞలలో ఉంచగలగడమే సరియైన రాజ్యాంగతత్వము' (Constitutionalism) అన్నాడు ప్రొఫెసరు సి. జె. ఫ్రీడ్రిచ్.

ఎవరీశాసనమును నిర్మించాలి ?

ఆధునికప్రభుత్వాలవిషయంలో రాజ్యాంగశాసనం నిర్వర్తించవలసిన ఈ ముఖ్యధర్మాలనుబట్టియే ఆ శాసనమును ఎవరు నిర్మించాలి అనేప్రశ్నకు ఎక్కువ ప్రాముఖ్యత వచ్చింది. పదిహేడు పదునెనిమిది శతాబ్దములలోని రాజకీయభావుకులకీప్రశ్న అంతకఠినంగా తోచలేదు. ఆరోజులలో బాగా ప్రచారంలోనున్న రాజకీయాభిప్రాయాల నుండియే వారికీ ప్రశ్నకు తగిన జవాబు వెంటనే దొరికింది. అసలు అధికారం ప్రజలదనీ, ప్రభుత్వాలూ అధికారాన్ని ప్రజలనుండి గ్రహించి చలాయిస్తూన్నవనీ వారివిశ్వాసము. సుప్రసిద్ధమైన వర్జీనియా ప్రకటనలో ఇలా ఉన్నది. ''యావత్తు అధికారమూ ప్రజలది. కాబట్టి అది వారి నుండియే గ్రహింపబడుతూన్నది. మేజస్ట్రేట్లు వారికి రక్షకులూ, సేవకులూ అయి అనుక్షణమూ సన్నిహితంగా ఉండాలి.'' ప్రభుత్వాన్ని తగిన అదుపాజ్ఞలలో ఉంచడమే రాజ్యాంగచట్టముయొక్క ఉద్దేశము గనుక, దానిని

నిర్మించే అధికారంగానీ, మార్చే అధికారంగానీ, ప్రభుత్వమునకూ, ప్రభుత్వశాఖయైన శాసనసభకూ కూడా ఉండడం న్యాయం కాదు. అలా ఉన్నట్లయితే రాజ్యాంగశాసనానికి లోబడి ఉండవలసిన ప్రభుత్వం దానినే లోబఱుచుకొని అధికారం చలాయిస్తుంది. రాజ్యాంగ శాసనమును ప్రజలుకానీ అందుకోసం ప్రత్యేకంగా ఎన్నుకొనబడిన వారిప్రతినిధులుగానీ తయారుచేసినప్పుడే ప్రభుత్వానికి ప్రజల అధికారం తగినంత సమగ్రంగా లభిస్తుంది. రాజ్యాంగ శాసనమును నిర్మించే అధికారంవేరు తదితర శాసనాలనుచేసే అధికారంవేరు. ఈరెంటికీ చాలా భేదం ఉన్నది. మొదటి అధికారం ప్రజలకు తప్ప తదితరుల కెవ్వరికి ఉండరాదు.

రాజ్యాంగశాసనమునుచేసే అధికారం ప్రజలకు మాత్రమే ఉండడం ఎంత అవసరమో, ఎంత న్యాయమో విశదీకరిస్తూ అమెరికన్ రాజ్యాంగచట్టమును రచించిన మూలపురుషులలో ఒకరైన హామిల్టన్ 'ఫెడరలిస్టు' అనేగ్రంథములో ఒకవ్యాసం వ్రాశాడు. దాని చివర భాగంలో 1776-1789 లలో ఉన్న అమెరికాసంయుక్త రాష్ట్రాలసమాఖ్య (Confederacy) నుగూర్చి ఇలా చెప్పాడు. "నేటి ఫెడరల్విధానము ఎన్నడూ ప్రజల ఆమోదమును పొంది ఉండకపోవడంచేత ఎన్నో లోపాలకు గుఱిఅవుతూన్నది. ఆయాశాసనసభల అంగీకారం తప్ప, అంతకు

మించిన గట్టిపునాదు లేవీ దానికి లేవు. కాబట్టి దాని అధికారాలను గురించి తరుచుగా అనేకచిక్కుప్రశ్నలు బయలు దేరుతూఉన్నవి. కొన్నిసందర్భాలలో ఈ ఫెడరల్ విధానాన్ని రద్దుచేయడానికికూడా శాసనసభకు అధికారమున్నట్లు తప్పుగా భావింపబడుతూన్నది. ప్రభుత్వశాసనంవలన ఆమోదింపబడిన ఈవిధానం, దానివలననే తిరిగీ రద్దుచేయబడ వచ్చుననేవాదం చెలరేగుతూన్నది. ఏదైనా ఒక ఒడంబడిక జరిగినప్పుడు ఒకపార్టీకి దానిని రద్దుచేసుకోవడానికికూడా అధికారమున్నదని వాదించడం చాలా న్యాయవిరుద్ధమే. అయినప్పటికీ ఆసిద్ధాంతాన్ని గౌరవనీయులు సమర్థిస్తూన్నారు. ఇటువంటిప్రశ్న పుట్టడానికి సావకాశం కలగడమే మన జాతీయప్రభుత్వం, కేవలం ప్రతినిధుల అధికారామోదములపైనగాక అంతకంటె మంచిపునాదులపైన ఆధారపడిఉండవలెనని ఋజువవుతూన్నది. అమెరికన్ సామ్రాజ్యసౌధం ప్రజల అంగీకారమనే గట్టిపునాదులపైన నిలచిఉండాలి. నిజమైన అధికారమునకు జన్మస్థానమైన ప్రజాసామాన్యమునుండి తక్షణం స్వచ్ఛమైన జాతీయశక్తి తరంగితంగా ప్రవహించాలి.'' ఈ వాదానికి అనుగుణంగానే 1787 నాటి పరిషత్తు (Convention) అంగీకరించిన అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగ విధానము ప్రజల ఆమోదం నిమిత్తం పంపబడినది.

విప్లవ యుగము తరువాత ప్రజాస్వామ్య సిద్ధాంతంలో గొప్ప మార్పు కలిగినప్పటికీ, యావత్తు అధికారము

నకు ప్రజలే మూలమనే, అభిప్రాయము వారు నిర్మించిన రాజ్యాంగము ద్వారాగాని, లేక వారి ఆమోదమును పొందిన రాజ్యాంగము ద్వారాగానీ మాత్రమే, వారి అధికారము ప్రభుత్వానికి సంక్రమిస్తుం దనే అభిప్రాయమూ నేటి వరకూ వ్యాపకం లోనే ఉన్నవి. అందువలన నిరంకుశప్రభుత్వాలకు భిన్నమైన ప్రజాస్వామ్య ప్రభుత్వాల రాజ్యాంగ శాసనాలన్నీ దాదాపుగా ఈ సిద్ధాంతముపైననే ప్రజలచే ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఎన్నుకోబడిన ప్రజా ప్రతినిధులుగల రాజ్యాంగ నిర్మాణ సభలవలన గాని, ప్రతినిధి పరిషత్తులవలన గాని నిర్మింప బడుతూన్నవి. సామాన్య శాసనాధి కారులు, రాజ్యాంగ శాసనాధికారులు కలగలుపు కాకుండా ఉండేటందుకు చాలా సందర్భాలలో ఈ పరిషత్తులు కేవల మొక్క రాజ్యాంగ నిర్మాణం కోసమే ఎన్నుకోబడుతూ వచ్చినవి. కాబట్టి అటువంటి ప్రత్యేక సభలు, పరిషత్తులూ మాత్రమే ప్రజాస్వామ్య రాజ్యాంగాలను నిర్మింపవలెననే సూత్రము సర్వజనాంగీకరమైనట్లుగా మనము నిర్ధారణ చేయవచ్చును. నేటి రాజ్యాంగములను నిర్మించడంలో ఈ సిద్ధాంత మెంతవరకు ఆచరించబడుతూన్నది, యేయే సందర్భాలలో అతిక్రమింప బడుతూన్నది అనే విషయం ముందు అధ్యాయంలో పరిశీలించెదముగాక !



# 2. ఆధునిక రాజ్యాంగ నిర్మాణముల చరిత్ర

## మూడు రకాలు

ఆధునిక కాలంలో ఆలోచన మీద తయారు చేయబడిన క్రొత్త రాజ్యాంగాలు గల ప్రభుత్వాలను సుమారుగా మూడు రకాలకింద విభజించవచ్చును. ఉత్తర అమెరికాలోని పదమూడు బ్రిటిష్ కాలనీలూ, ఐర్లండు, జెకోస్లోవకియా, జుగోస్లోవియా, ఫిన్‌లాండు, పోలాండు, ఎస్తోనియా, లాట్వియా, లిథుయేనియా మొదలగు దేశాలూ మొదటి రకంకిందకు వస్తవి. ఇవన్నీ తమపైన ఉన్న పూర్వ సామ్రాజ్యాలను పడగొట్టి స్వాతంత్ర్యం సంపాదించుకొని బయటపడినవి. ఫ్రాన్సు, జర్మనీ, ఆస్ట్రియా మొదలైన దేశాలు రెండో రకం కిందకువస్తవి. వీటికి పరాధీనతనుండి స్వాతంత్ర్యం పొందడమనే సమస్య లేకపోయినప్పటికీ నిరంకుశ పరిపాలనకు బదులుగా ప్రజాస్వామ్య స్థాపనము చేసుకొనవలసి వచ్చింది. అమెరికా సంయుక్త రాష్ట్రాలూ, స్విట్జర్లాండు, కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా మొదలయిన దేశాలూ, మూడోరకం కిందకువస్తవి. ఇవన్నీ అంతకు పూర్వం వేరువేరుగా స్వతంత్రంగా వ్యవహరిస్తూ కొంతకాలమైన తర్వాత కలిసిపోయి ఆకలయిక వలన ఏర్పడిన

రాజ్యాలు. మొదటి రెండు రకాలలోని దేశాల రాజ్యాంగ శాసనములూ తయారుచేయబడే నాటికి కపీ తీవ్ర విప్లవోద్యమాలను ఎదుర్కొని తటించవలసి వచ్చినది. మూడోరకపు దేశాల విషయంలో అటువంటి అవసరం కలగలేదు. చల్లగా రాయబారాలుతోనే అవి తమ పనిని నెరవేర్చుకో గలిగినవి. మొదటి రెండు రకాల రాజ్యాలు తమ రాజ్యాంగములను తయారు చేసుకొనే నాటి ప్రత్యేక పరిస్థితులనుబట్టియే అక్కడి రాజ్యాంగ నిర్మాతలు క్రిందటి అధ్యాయంలో వివరింపబడిన రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు సిద్ధాంతాన్ని గట్టిగా అంటిపట్టుకొని వ్యవహరించడానికి కొన్నిచిక్కులను ఎదుర్కోవలసివచ్చింది.

ఇంగ్లాండు :

ఇంగ్లాండు దేశపు భీకర అంతఃకలహంలో మొదటి ఛార్లెస్ రాజు ఉరితీయబడి నిరంకుశ రాజ్యాధికారం తొలగింపబడిన పిమ్మట రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు సిద్ధాంతానికి అనుకూలురైనవారు బుద్ధిపూర్వముగ నూతనరాజ్యాంగమును నిర్మించడానికి ప్రథమ ప్రయత్నాలు చేశారు. ఆనాడు రాజకీయాధికారం పార్లమెంటు చేతులలో గాక సైన్యం చేతులలో పడింది. 'ప్రభుత్వ మంతకూ మూలం ప్రజ; ప్రజలందరూ కలసి ఆమోదంమీద ప్రభుత్వాన్ని ఏర్పఱచుకొంటారు; ప్రభుత్వానికి అధికారాలిచ్చే హక్కే

గాక ప్రభుత్వ చర్యలకు హద్దుపెట్టి వాటిని అతిక్రమించ కుండా చూచే హక్కు కూడా ప్రజలకుఉంది.' అనే సిద్ధాం తాలను నమ్మినవారే ఆసైన్యంలో ఎక్కువమంది ఉండి నారు. ఇందు కనుగుణంగా కొంతమంది సైనికులు "ప్రజల సమాఖ్య" (Agreement of the People) అని పేరుతో ఒక రాజ్యాంగ చట్టాన్ని వ్రాసి కామన్సు సభకు సమర్పించు కొన్నారు. కాని అది ఆచరణలోకి రానేలేదు. విప్లవోద్యమ ప్రారంభదశలో గట్టి నియంతృత్వ ముండడమే అవసరం. కొత్త కొత్త రాజకీయ ప్రయోగాలు చేసేటందు కది తగిన తరుణంకాదు. అయినప్పటికీ మఱికొంత కాలానికి సేనానాయ కులు మఱొక రాజ్యాంగాన్ని (Instrument of Government) వ్రాసియిచ్చారు. దానిని ఆనాటి నియంత అని చెప్పతగిన క్రాంవెల్ ప్రజల ఆమోదంకాని, పార్లమెంటు అంగీకారం కాని పొందకుండానే ఆచరణలో తెచ్చాడు. కాని దానికి కూడా దేశంలో పాదు కుదరలేదు. 1660 లో రాజరికం (Monarchy) పునరుద్ధరింపబడినప్పుడు, ఇంగ్లాండు దేశంలో, ఆలోచన మీద రాజ్యాంగ శాసనమును నిర్మించడమనే పద్ధతి ఎన్నటికీ పనికిరాదని విడిచివేయబడినది. కాని తరు వాత అక్కడ సంస్థాపితమైన ప్రజాస్వామ్య విధానము, పార్లమెంటు చట్టముల ద్వారా సాంప్రదాయాను గుణంగా క్రమ పరిణామం పొందినదే.

అమెరికా సంయుక్తరాష్ట్రాలు :

రాజ్యాంగనిర్మాణంలో శాశ్వతఫలితాలు లభించిన తొల్లింటి ఉదాహరణాలు కావలెనంటే అమెరికాసంయుక్త రాష్ట్రాలనుతీసికొనిపరిశీలించాలి. ఉత్తరఅమెరికాలోనిఇంగ్లాండు దేశపు పదమూడు వలసరాజ్యాలు, ఇంగ్లాండు యాజమాన్యమును తొలగించుకొని 1774-75లో స్వతంత్రరాజ్యాలైనవి. అప్పుడవి తమ స్వాతంత్ర్యమున కనుగుణమైన రాజ్యాంగాలను నిర్మించుకోవడం అవసరమని భావించినవి. ఆ రాజ్యాలలోని విప్లవోద్యమనాయకులు రాజ్యాంగనిర్మాణ పరిషత్తు సిద్ధాంతములందు విశ్వాసము కలవారైనప్పటికీ, వారు వాటిని గట్టిగా అంటి పట్టుకొనిఉండడం సాధ్యం కాలేదు. స్వాతంత్ర్యసమరం కొనసాగించవలసిన సందిగ్ధ తరుణమది. కాబట్టి ఆ అన్నిరాజ్యాలలోనూ తత్క్షణావసరములకు తగినట్లు తాత్కాలిక ప్రభుత్వాలను స్థాపించవలసి వచ్చింది. వాటిని కాంగ్రెసులు అనికానీ కన్వెన్షన్లుఅనికానీ పిలుస్తూ వచ్చారు. అవన్నీదాదాపు స్వయంనిర్మితాలు. ఒక విధంగా అవి ప్రజలకు ప్రాతినిధ్యంవహించి పనిచేస్తూన్నప్పటికీ ప్రజలచేత ప్రత్యక్షంగా యెన్నుకొనబడినవికావు. ఆ విధంగా ఉన్న ఆ సభలే మామూలు శాసనాలనూ, మామూలుపరిపాలననూ నడుపుతూ తీరిక కాలంలో తమ రాజ్యాంగాలను నిర్మించేపనికి కూడా దొరకొన్నవి. రాజ్యాంగ శాస

నాలను మామూలు శాసనాలను అవే చూస్తూవచ్చినవి. వర్జీనియా, సౌత్ కెరోలినా, న్యూజెర్సీ రాజ్యాల రాజ్యాంగాలీవిధంగా తయారైనవే. మిగిలిన రాజ్యాలలో ఏడు రాజ్యాల తాత్కాలిక ప్రభుత్వాలు (Conventions) తమ రాజ్యాంగాలను నిర్మించడానికి ప్రజలనుండి స్పష్టమైన అధికారాన్ని పొందినవి. కాని ప్రజలు వాటిని ప్రత్యేకం ఆ పనికోసం ఎన్నుకోలేదు. అయితే వీటిలో యే ఒక రాజ్యాంగశాసనమూ కూడా వోటర్ల ఆమోదమునకు పంపబడి ఉండలేదు.

ప్రజాపరిషత్తు సిద్ధాంతానికి విరుద్ధంగా ఈ రాజ్యాలన్నీ ఇలా నడుచుకోవడానికి కారణం చాలావరకు ఆనాడు అనేక సందిగ్ధావస్థల కవి లోనుగావలసి రావడమే. అయినప్పటికీ అనేకు లీపద్ధతి పనికిరాదని అభ్యంతరం పెట్టినారు. మసాచూసెట్సు (Massachusetts) ప్రజలు మరీ గట్టిగా పట్టుపట్టి అభ్యంతరం పెట్టినందువలన, ఆ రాజ్యపు రాజ్యాంగచట్టాన్ని నిర్మించి అమలుపరచడంలో రాజ్యాంగనిర్మాణ పరిషత్తు సిద్ధాంతాలను 'తూ' 'చా' తప్పకుండా అనుసరించవలసి వచ్చినది. వయసువచ్చిన స్వతంత్రమానవులందరూ కలసి ఎన్నుకొన్న ప్రత్యేకపరిషత్తు (Convention) రాజ్యాంగ శాసనమును రచించేనిమిత్తం నియోగింపబడినది. వారు వ్రాసిన శాసనము పట్టణసమావేశములలో, చర్చించి మార్పు చేసి అంగీకరించడానికిగానీ, తోసివేయడానికిగానీ అధికార

మీాయబడినది. ఆ చర్చల తదనంతరం పరిషత్తు తిరిగి సమావేశమై అభ్యంతరాలను గూర్చి పునరాలోచనచేసి తదనుగుణంగా రాజ్యాంగశాసనములో మార్పుగావించి దానిని ఆచరణలోకి తెచ్చింది. 1780 తరువాతనుండి ఈ రాజ్యాంగం పైన ఆధారపడియే ఆ దేశపు ప్రభుత్వం నడుస్తూవచ్చింది. ఈ విధంగా మసాచుసెట్సు (Massachusetts) సంయుక్త రాష్ట్రిలలోని రాజ్యాలయొక్క తరువాతి రాజ్యాంగనిర్మాణములకు వరవడిపెట్టింది. 'ఈ విధానము ప్రమాద రహితం. ప్రజలే ప్రభుత్వాధికారమునకు మూలకందమనీ వారి అంగీకారంపైననే ప్రభుత్వం సృజింపబడుతూన్నదనీ, వారు ప్రభుత్వానికి పైఅధికారులనీ ప్రభుత్వమూ ప్రజా ఒక్కటి కాదనీ అందఱు నిస్సందేహంగా నమ్ముతూండేవారు.' ఈ నమ్మకమే, మామూలు శాసనసభకంటెనూ దానిలో చేయబడిన చట్టములకంటెనూ కూడా రాజ్యాంగ చట్టమునకెక్కువ ఆధిక్యత రావడానికి కారణభూతమయింది.

అమెరికా సంయుక్తరాష్ట్రిల ఫెడరల్ విధాన నిర్మాణంలో, రాజ్యాంగనిర్మాణ పరిషత్సిద్ధాంతముయొక్క ప్రభావం చాలా పనిచేసింది. 1781 లో ఇందుకొక ప్రత్యేక పరిషత్తు సమావేశమయింది. రోడ్ (Rhod) ద్వీపం తప్ప తక్కిన అన్నిరాజ్యాలూ తమ తమ ప్రతినిధుల నాసమావేశానికి పంపినవి. మొత్తం 74 మంది ప్రతినిధులు. వారిని వోటర్లు నేరుగాఎన్నుకోలేదు. ఆయారాజ్యాల శాసనసభలు

వారిని ఎన్నుకొని, వారు చేయవలసిన పనిని గూర్చి సూచనలు చేసినవి. వారిలో 19 మంది ప్రతినిధులు పరిషత్తుకు హాజరుకానేలేదు. హాజరైనవారిలో 39 మంది మాత్రమే తయారైన చిత్తు రాజ్యాంగశాసనంపైన సంతకాలుచేశారు. తరువాత ఆ చిత్తుచట్టం ఒక్కొక్క రాజ్యానికే ప్రజల ఆమోదం నిమిత్తము పంపబడింది. ప్రతి రాజ్యంలోనూ ప్రత్యేకం ఆ చిత్తుచట్టాన్ని గూర్చి ఆలోచించడానికి ఒక పరిషత్తు (Convention) ఎన్నుకోబడి సమావేశమయింది. 1788వ సంవత్సరం ముగియకముందే ౧౧ రాజ్యాలూ చిత్తుచట్టాన్ని ఆమోదించినవి. అసలు రాజ్యాంగ నిర్మాణ పరిషత్తులో జోక్యంకలిగించుకోని రోడ్ (Rhode) ద్వీపంకూడా 1790 లో ఆ చట్టాని ఆమోదించి ఫెడరేషన్‌లో చేరింది. 1787 మేలో పరిషత్తు సమావేశమయింది. 1789 ఏప్రిల్ 30 ని రాజ్యాంగచట్టం అమలులోకి వచ్చింది. అదే మొదటి అధ్యక్షుడు వాషింగ్టన్, అధ్యక్షప్రమాణం చేసినరోజు.

## ఫ్రాన్సు:

ఫ్రాన్సులో విప్లవయుగంలో (1789-1799) తయారయిన రాజ్యాంగశాసనాలు, ప్రజలచేత ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎన్నుకోబడిన సమావేశాలలో చేయబడినవే. 1791 నాటి రాజ్యాంగచట్టమును తయారుచేసిన జాతీయ రాజ్యాంగ నిర్మాణ పరిషత్తే ఇందుకు నిదర్శనం. అందులో

1,200 మంది సభ్యులుండిరి. వారిలో సగం మంది పన్నులు చెల్లిస్తూ, 25 యేళ్లుకానీ, అంతకు పైబడిన వయస్సు కానీ కల ఫ్రెంచి పురుషులందరూ కలసి పరోక్షంగా ఎన్నుకొన్న మధ్య తరగతుల ప్రతినిధులే. ఏ పన్నులూ చెల్లించని నిరుపేదలు కావడంచేత వోటింగు హక్కులేకుండా పోయినవారి సంఖ్య అంచనావేస్తే, మొత్తం జనసంఖ్యలో వారు ఎనిమిదోవంతు ఉన్నట్లు లెక్క తేలింది. 60 లక్షల మంది యుక్త వయస్సు వచ్చిన పురుషులలో 50 లక్షలు వోటింగు అధికారమును పొందగలిగారు. ఈ పరిషత్తు తయారు చేసిన రాజ్యాంగశాసనం ప్రకారం నిరంకుశ రాజరికం శాసనబద్ధమైన రాజరికంగా (Cstitutional Monarchy) లేక పరిమితాధికారములుగల రాజరికంగా (Limited Monarchy) గా మారింది, కాని ఆ రాజ్యాంగ చట్టం చిరకాలం నిలవలేదు. అనేక కారణాలవలన విప్లవ నాయకులలో ప్రజా స్వామ్యభావాలు పెంపొందడంచేత, పరిపాలనకు తగిన క్రొత్త రాజ్యాంగ చట్టాన్ని తయారు చేయవలసివచ్చింది. వయస్సువచ్చిన ప్రతి మనిషీ పరోక్షంగా ఎన్నుకొన్నజాతీయ పరిషత్తు(National Convention) ఈ పనికి పూనుకొన్నది. కాని ఈ పరిషత్తుయొక్క ఎన్నికలలో, అశ్రద్ధవలనగానీ భయంవలనగానీ మొత్తం వోటర్లలో పదోవంతు మాత్రమే పాల్గొన్నారు. అయినప్పటికీ మొత్తం వోటర్ల అభిప్రాయాన్ని వీరు ప్రకటించలేదని

సందేహించతగిన కారణాలు లేవని ఒక చరిత్రకారుడు వ్రాశాడు. ఈ సంస్థ 1793 లో ఒక రాజ్యాంగ శాసనాన్నీ 1795 లో మరొక రాజ్యాంగ శాసనాన్నీ తయారు చేసింది. ఈ రెండూ ప్రజల అంగీకారానికి పంపబడి అత్యధిక సంఖ్యా కలచే ఆమోదింపబడినవి. కాని ముఖ్యంగా ఫ్రెంచి ఆంత రంగిక రాజకీయ విషయాలలో విదేశీ ప్రభుత్వాలు జోక్యం కలిగించుకోవడం వలననూ తరువాత తటస్థించిన యుద్ధాల మూలమునసూ 1793 నాటి రాజ్యాంగ శాసనము తాత్కాలి కంగా ఆచరణలోకి రాలేదు. ఈ క్లిష్టదశ ప్రారంభమైన కాలంలో పనిచేసేటందుకు దాదాపు నియంతృత్వమని చెప్ప తగిన తాత్కాలిక ప్రభుత్వ మొకటిపైన ఉదాహరింపబడిన పరిషత్తుచేతనే యేర్పాటు చేయబడినది. ఇక రెండవ రాజ్యాంగచట్టము 1795 నాటిది. దాని ప్రకారము అయిదు గురు విప్లవోద్యమ నాయకులు కార్యనిర్వాహక డైరెక్టరు లుగా అధికారంలో ఉంటారు. ఈ చట్టము 1799 వరకూ అమలులోనుండి నెపోలియన్ చేత తోసివేయబడింది. ఈ అతిరథుడు అధికారంలోకి రాగానే ప్రజాస్వామ్యం సంపూ ర్ణంగా సమసిపోయింది. నెపోలియన్ స్థాపించిన ప్రభుత్వ విధానము బూర్బాన్సు (Bourbons) ప్రభుత్వమంత నిరం కుశంగా ఉన్నది. కాని ప్రజారాజ్య సిద్ధాంతం దేశంలో బాగా నాటుకొని పోవడంచేత, తా నవలంబించిన చక్రవర్తి త్వము సైతం ప్రజల వోటు ద్వారా వారి ఆమోదం

పొందడం మంచిదని ఆయనకుకూడా తోచింది. 1830 లో జరిగిన ఫ్రెంచి విప్లవం కేవలం నిరంకుశ రాజుల మార్పుగా పరిణమించింది. అంతేకాని నూతన రాజ్యాంగ నిర్మాణం మాట ఎవ్వరూ తలపెట్టనే లేదు. కాని 1848 నాటి విప్లవం చాలా మార్పు తెచ్చింది. ఆ విప్లవ కారులలోని ప్రజా స్వామ్య పక్షంవారు ప్రజా పరిపాలనము దేశంలో స్థాపింపబడ వలెనని కోరినారు. విప్లవప్రారంభదశలో స్థాపింపబడిన తాత్కాలిక ప్రభుత్వం వయస్సు వచ్చిన వారందరికీ వోటింగు అధికారమిచ్చింది. వారే రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు నొకదానిని ఎన్నుకొన్నారు. దానిలో 900 మంది సభ్యులున్నారు. విప్లవ కారులలో అతివాదులు కొంతమంది ఒక విధమైన కమ్యూనిజం కావలెనని కోరగా ఆ పరిషత్తు వారి కోరు నొక్కి ప్రజా స్వామ్య రాజ్యాంగ చట్టాన్ని నిర్మించ గలిగింది. ఈ చట్టము మూడు సంవత్సరాలవరకూ అమలులో ఉంది. పిమ్మట దానిని మార్చేటందుకు మూడవ నెపోలియనుకు ప్రజలు వోటింగుద్వారా అధికారమిచ్చారు. అప్పుడాయన దానిని తోసి రాజన్నాడు. మరు సంవత్సరం నెపోలియను తనను చక్రవర్తిగా ప్రకటించుకొనేటందుకు ప్రజలే తిరిగి ఓటింగుద్వారా ఆయనకు తమ ఆమోదాన్ని తెలియజేశారు. 1871 లో ఫ్రాన్సుదేశం మరొక విప్లవానికి గురియైనది. ఫ్రాన్కో-జర్మనుయుద్ధంలో మూడవ నెపోలియన్ పూర్తిగా అపజయం పొందినందు

వలన ఆ విప్లవం అంతతొందరగా చెలరేగింది. ఆ యుద్ధంయొక్క చివరిదశలో అధికారానికివచ్చిన తాత్కాలిక దేశరక్షణ ప్రభుత్వము, వయస్సు వచ్చిన వారం దఱిచే ఎన్నుకోబడిన 750 మంది సభ్యులుగల జాతీయ పరిషత్తును ఏర్పాటుచేసింది. ఈ పరిషత్తే మూడవ రిపబ్లిక్ రాజ్యాంగచట్టాన్ని తయారుచేసింది. ఆ చట్టప్రకారమే 1940 లో హిట్లరు ఫ్రాన్సును ఆక్రమించేవరకూ ఆ దేశ పరిపాలనము జరుగుతూఉండింది. ఫ్రెంచివిప్లవం తరువాత తయారుచేయబడిన రాజ్యాంగచట్టాలన్నిటిలోకీ ఈ చట్టమే ఎక్కువకాలం సజీవంగా ఉంది.

1791 తదనంతరం నిర్మింపబడిన ఫ్రెంచి ప్రజాస్వామ్య రాజ్యాంగ చట్టాలన్నీ, వయస్సువచ్చిన వారంజఱిచే ఎన్నుకోబడిన రాజ్యాంగ నిర్మాణ పరిషత్తులు తయారుచేసినవేనన్నమాట గమనించ వలసిన విషయం. ఆ అన్ని పరిషత్తులూ పరిమాణంలో చాలాపెద్దవే. వాటిలో కేవలం సిద్ధాంతులు, శాస్త్రకారులూ మాత్రమే కాక, అనేకమంది కుశాగ్రబుద్ధులూ వ్యవహారదక్షులూ అయినరాజకీయ పరిజ్ఞాతలు కూడా ఉన్నారు. వయస్సు వచ్చిన ప్రతివారికీ వోటువున్నప్పటికీ ప్రజల రాగద్వేషాలను ప్రకోపింపచేసే వట్టిరాజకీయాందోళకుల చేతులలోగాని, లేక ఊహా ప్రపంచంలో సంచరించే వ్యవహార దక్షులుకానివారి చేతులలో కాని ఆ పరిషత్తులు పడలేదు. కొన్ని ప్రజా స్వామ్య

రాజ్యాంగాలు పుట్టుకతోనే రూపుమాసినవి. కొన్ని బహు కొద్దికాలం పనిచేసినవి. 1875 లో పుట్టిన రాజ్యాంగ శాసన మొక్కటే దాదాపు 70 యేళ్ళు పనిచేసింది. అయితే ఫ్రెంచి అనుభవాలను బట్టి మనము తెలిసికోవలసిం దేమంటే, రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుల స్వరూప నిర్మాణ ముల మీద మాత్రమే రాజ్యాంగ చట్టంయొక్క జీవితం కాని, కార్యనిర్వహణం కాని ఆధారపడి ఉంటుందని భావించ కూడదనే సర్వసాధారణ విషయ మొక్కటే. రాజ్యాంగ శాసనం జయప్రదం కావడం ఇంకా అనేక సందర్భాల మీద ఆధారపడి ఉంటుంది. దేశానికి లోపలనూ, వెలుపలనూ ఉన్న పరిస్థితులమీద ఎక్కువ ఆధారపడి ఉంటుంది. సంఘ జీవితం సుస్థిరంగా లేక అల్లకల్లోలంగా ఉన్నప్పుడు, ఎవరు నిర్మించిన రాజ్యాంగ శాసనమైనా అచిరకాలం లోనే భగ్నమై తీరుతుంది.

జర్మనీ :

ఆధునిక యుగంలో రెండు పర్యాయములు–1848 లో ఒకసారి 1919 లో ఒకసారి—జర్మనీకి నూతన రాజ్యాంగ చట్టాలు నిర్మించబడ్డవి. ఈ రెండు పర్యాయాలూ కూడా విప్లవ మధ్యకాలంలోనే ఈపని ప్రారంభమయింది. 1848 లో యూరపు ఖండమంతటా విప్లవోద్యమం చెలరేగుతూ ఉండెంది. జర్మనీలో అది జాతీయోద్యమంగానూ, ప్రజా

స్వామికోద్యమంగానూ కూడా నడిచింది. జర్మను విప్లవ నాయకులు జర్మనీ అంతనూ ఒకే కేంద్రప్రభుత్వంకింద ఐక్యం చేసి, దానికే ఒకవిధమైన ప్రజాస్వామిక స్వరూప మీయవలెనని తలంచారు. తమ నిరంకుశత్వాన్ని వదులుకోవడానికి యిష్టపడనిఅనేకమంది రాజ్యాధికారులు—చిన్నవాళ్లూ పెద్దవాళ్లూ కూడా—ఆ పద్ధతికి ఎదురు తిరిగారు. వారితో విప్లవనాయకులు పోరాడవలసి వచ్చింది. ఈ ఉద్యమం ప్రారంభదశలో కొంత జయప్రదంగానే నడిచింది. కాని ఇంకనూ ఈ వ్యవహారం శ్రుతిమించి రాగాన పడక మునుపే ప్రష్యారాజుగారితో సహా కొంతమంది పరిపాలకులు తమ ప్రజలకు కొన్ని సౌకర్యాలు కలుగ చేశారు. వాటినే అధికార రాజ్యాంగ చట్టాలని (Octroyed constitutions) పిలుస్తూన్నారు. కాని తిరుగుబాటు దారులు వాటికి సంతృప్తి పడలేదు. వయస్సు వచ్చిన వారందరూ ఎన్నుకొన్న దాదాపు 600 మంది సభ్యులుగల రాజ్యాంగ నిర్మాణపరిషత్తును సమావేశ పఱచి ఆనాటి ఉదార రాజకీయ సిద్ధాంతముల కనుగుణమయిన రాజ్యాంగ చట్టాన్ని నిర్మింపవలెనని నియమించారు. ఫ్రాంకు ఫర్టులో ఆసభ సుమారు ఏడాదికిపైగా సమాలోచనలుచేసి సంయుక్త జర్మనీదేశానికి తగిన ఒక రాజ్యాంగచట్టాన్ని నిర్మించగలిగింది. దానినిగూర్చి ఒకానొక గ్రంథకర్త యిలా అన్నాడు. "ఆసభ చాలా ఉదారాశయములతో ఉత్కృష్టమయిన రాజ్యాంగ చట్టాన్ని

నిర్మింపగలిగింది. దానిప్రకారం ప్రతి జర్మను పౌరునిహక్కు-లకూ రక్షణ ఉంటుందని తోచింది. ప్రభుత్వ శాసనమునకు పౌరులందరూ సమానులే నన్న విషయం స్థిరపడింది; కేంద్ర ప్రభుత్వాన్నీ తదితర ప్రత్యేక రాజ్యాలనూ కూడా అదుపాజ్ఞలలో ఉంచగలిగిన బాధ్యతాయుతశాసన సభలు ప్రతిపాదించబడినవి.'' కాని ఈ రాజ్యాంగనిర్మాణ సభ తనపనిని ముగించేసరికి విప్లవోద్యమం అణచివేయబడ డమేగాక ఎక్కడచూచినా నిరంకుశాధికారులదే పైచేయి అయింది. వారు నిర్మించిన నూతనరాజ్యాంగచట్టం ఆచరణ లోకి రావడానికి సావకాశమే లేకపోయింది. అది పుట్టుక తోనే మరణించింది. ముందుగా రాజకీయాధికారం సంపా దించి రాజ్యాంగశాసనాలను అమలుపఱిచే శక్తిసామర్థ్యాలు కలవారే వాటి నిర్మాణమునకు పూనుకొనవలెనని ఈ సంగతి స్పష్టపరుస్తూన్నది. రాజ్యాంగ చట్టం తయారుచేసే అధి కార మున్నదని అనుకొనేవారు దానిని తయారుచేసి అమలు పఱచడానికి తగిన శక్తి సామర్థ్యాలు కలవారుగాకూడా ఉండాలి.

జర్మనీలో రాజ్యాంగ చట్టం తయారుచేసేటందుకు రెండవ పర్యాయం 1919 లో (ప్రపంచ యుద్ధానంతరం) అవకాశం వచ్చింది. కైజరు పదచ్యుతుడైన తరువాత వివిధ విప్లవ పక్షాలవారూ అధికారాన్ని అంది పుచ్చుకోవ డానికి పోటీలు పడ్డారు. మితవాద సోషలిస్టులతో కూడిన

తాత్కాలిక ప్రభుత్వం తీవ్రవాదుల తిరుగుబాటును అణచి వేసి తన అధికారాన్ని బలపఱచుకొన్నది. తరువాత అది వయస్సు వచ్చిన వారందఱిచే దామాషా ప్రాతినిధ్య పద్ధతిని (Proportional Representation) ఎన్నుకోబడిన రాజ్యాంగ నిర్మాణ పరిషత్తును సమావేశపఱచి ప్రజా పాలిత జర్మనీకి తగిన రాజ్యాంగ చట్టాన్ని తయారు చేయ వలసిందని ఏర్పాటుచేసింది. ఆ రాజ్యాంగనిర్మాణ పరిషత్తులో 421 మంది సభ్యులున్నారు. అది వీమారు (Weimar) లో సమావేశమై జర్మను ప్రజారాజ్య చట్టాన్ని నిర్మించింది. హిట్లరు నాజీనియంతృత్వం స్థాపించిన 1933 వరకూ కూడా ఆ చట్టంకిందనే జర్మనీ పరిపాలన జరుగుతూ వచ్చింది. అది అచిరకాలంలోనే అదృశ్యమైనప్పటికీ, సామ్యవాద ప్రజా పాలనాదర్శమును చక్కగా ప్రకటన చేసిన ఉత్కృష్ట శాసనమని తెలిసినవాళ్లు చాలామంది అనుకొంటూవచ్చారు. జర్మనుప్రజల విధులనూ అధికారాలనూ వివరించిన ఆచట్టం లోని రెండవభాగం చాలా ప్రాముఖ్యమైనది. దానినిగూర్చి జాగరూకులైన ఇరువురు రాజ్యాంగ పరిశీలకులు వ్రాసిన వ్రాతలను ఈ దిగువ ఉదాహరిస్తూన్నాను.

"ఉత్తమమైన నూతన సాంఘిక రాజ్యాన్ని నిర్మించు కొనుటకు చక్కని జాతీయవాంఛా ప్రకటనగా, జాగరూకతతో వివరములను పరిశీలించడానికీభాగం బాగా పనికి వస్తుంది......రాజకీయ సిద్ధాంతాలను గూర్చిన ఒకమంచి

వ్యాసమనవచ్చును. దీనిని అంతేకాదు రాజకీయ ఆచరణకు ఇదే పునాదికూడా. రాజకీయ చైతన్యంలేని జర్మను ప్రజాభిప్రాయాన్ని ఇది పరిగణించడమేలేదు. జర్మనీలో ఎక్కువగా కనిపించే సామాన్య జర్మనుప్రజల ఆదర్శములను గూర్చి ఇందులో ఏమీ కానరాదు. ఊహాప్రపంచంలో ఊగులాడేవారుగాక లోకానుభవంగల రాజకీయవేత్తలు దీనిని నిర్మించారు. కాని అభివృద్ధికి మూలమైన సిద్ధాంతముయొక్క ఆదర్శాలను గ్రహించి, ఆదర్శాలకు అతిదూరమైనవాటిని తృణీకరించి మెలకువగలిగి వర్తించారు వారు...ప్రభుత్వమునకూ, ప్రజకూకూడా సేవా పరాయణత్వమే పరమ ధర్మంగాభావిస్తూ నూతన జర్మనీని సృజింపదలచుకొన్న మహాపురుషుల నిర్మాణమిది......దీనిని నిర్మించిన వారి చేతులలోనుండి అధికారం జారిపోయింది. దీనిలోని ఆదర్శానికి విరోధులైనవారే ఇంతవరకూ వృద్ధిలో ఉన్నారు. కాని వీమారులో ప్రతిష్ఠించబడిన ఆదర్శానికిది అనుగుణంగా ఉండేయెడల భావిజర్మనీని నిర్మించేటందుకిది పునాదియై జర్మను చరిత్రలో చిరస్మరణీయమైన ఘట్టంగా ఉంటుంది.''

ఇటువంటి అభిప్రాయాలనుబట్టి, జర్మను రాజ్యాంగ నిర్మాణ పరిషత్తువలెనే వయస్సువచ్చిన వారందటి చేతనూ ఎన్నుకోబడిన రాజ్యాంగపరిషత్తు, సరియైన ప్రజాస్వామ్య రాజ్యాంగ చట్టాన్ని తయారుచేయడం కష్టమైన పని కాదని తేలుతూన్నది.

జర్మను రాజ్యాంగచట్టాన్ని వ్రాసిన పరిషత్తు నిర్మాణంలోగానీ, అసలు చట్టంలోగానీ కొన్ని లోపాలు ఉండడం చేతనే ఆ చట్టం భగ్నమయిందని కొంతమంది విమర్శకుల అభిప్రాయం. కాని అది సరికాదు. 1919 నాటి శాంతి మహాసభా నిర్ణయాలు సంతృప్తికరంగా ఉండక పోవడంచేతనూ, ప్రపంచకంలో ప్రతి-చోటా ఆర్థికదుస్థితి వ్యాపించడంచేతనూ, కల రాజ్యాలూ లేని రాజ్యాలూ పోటీపడి యుద్ధసామగ్రిని ఉత్పత్తిచేసుకోవడం వలననూ ఇంకా అనేక కారణాలవల్ల కూడా ప్రపంచంలో అనేకచోట్ల నియంతృత్వాలు ప్రబలినవి.

స్విట్జర్లాండు :

ఆధునికయుగమునకు తగినరాజ్యాంగాన్ని నిర్మించుకొనే ముందు స్విట్జర్లాండుకూడా అంతర్యుద్ధమునకూ విప్లవమునకూ గురియైనది. 1848 నాటి ఈ రాజ్యాంగ శాసనం నిర్మింపబడే వరకూ స్విట్జర్లాండు ఒకే రాజ్యంగా యెన్నడూ లేనే లేదు. అది అనేక స్వతంత్రరాష్ట్రాలతో కూడుకొన్న ఒక అతుకులమారి సమాఖ్య (Confederation) గా ఉండేది. ఈ స్వతంత్ర ప్రభుత్వాల రాయబారులు, తమతమ ప్రభుత్వాల ఉత్తరువుల ననుసరించి వోటుచేయడం మూలంగా, వారందరికీ సంబంధించిన సామాన్య విషయాలు స్విట్జర్లాండు పార్లమెంటులో నిర్ణయింప బడుతూండేవి. ఆయారాష్ట్ర ప్రభుత్వాలరాయబారులే ఆ పార్లమెంటులో సభ్యులు. అనేక విష

యాలలో వోటింగు ఏకగ్రీవంగా ఉండవలెననే నిబంధన కూడాఉంది. పైగా పార్లమెంటుచేసిన ఈ నిర్ణయాలను అమలుపరిచేటందుకు తగిన కేంద్ర కార్యనిర్వాహకవర్గం కూడా లేదు. అంతేకాదు. విదేశ ప్రభుత్వాలతో స్వంతంత్రంగా వ్యవహరించుకొనే హక్కు, అనేక చిన్నచిన్న రాష్ట్రాలుకలసి ఆ పెద్ద సమాఖ్య (Confederacy) లోనే ఒక సంఘాన్ని యేర్పాటుచేసుకొనే హక్కు-కూడా రాష్ట్రాలకు ఉండేది. ఇందువలన దేశం బలహీనమై విదేశీ దండయాత్రలకూ కుట్రలకూ గుఱికావడానికి మంచి సావకాశం కలిగింది. 1847 లో ఫెడరలిస్టు పార్టీవారు లేచి, రాష్ట్రాలన్నిటికీ సంబంధించిన కొన్నిముఖ్య విషయాలను నిర్ణయించి అమలుపఱిచేటందుకు తగిన శాసన కార్యనిర్వాహణాధికారములుగల బలిష్ఠమైన కేంద్రప్రభుత్వ మొకదానిని స్థాపించవలెనని ఉద్దేశించారు. కన్సర్వేటివులు వారిని ఎదుర్కొన్నారు. కొన్ని క్యాథలిక్కు రాష్ట్రాలీ ఎదిరి పక్షంలోచేరడం తటస్థించింది. వారందఱూకలిసి సోండర్ బండ్ (Sonderbund) అనే పేరుగల ఒక ప్రత్యేక సంఘంగా యేర్పాటయి అసలు సమాఖ్యనుండి పూర్తిగా చీలిపోయేటందుకు ఆస్ట్రియా, ప్రష్యా, ఫ్రాన్సు దేశాలవంటి బలవత్తర విదేశప్రభుత్వాల సహాయముకూడా ఆపేక్షించారు. ప్రొటెస్టెంటు రాష్ట్రాలూ, సమాఖ్యశాసన సభా కూడా సోండరుబండుకు వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించి, విదేశీప్రభుత్వాలు జోక్యం కలిగించు

కోవడానికి సావకాశం లేకముందే దానిని 1848 లో పూర్తిగా అణచివేశారు. తరువాత ఫెడరలిస్టులు అధికారంవహించి వారి అభిప్రాయానుసారంగా రాజ్యాంగ చట్టాన్ని సంస్కరించారు.

సమాఖ్యశాసనసభ రాజ్యాంగశాసన సంస్కరణం కోసమై మొట్టమొదట ఒక కమిటీని నియమించింది. ఆ కమిటీ సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగచట్టాన్ని కొంతవరకు వరవడిగా పెట్టుకొని ఒకచిత్తుశాసనాన్ని తయారుచేసింది. తరువాత ఆచిత్తుశాసనం రాష్ట్రాల సలహాకోసమూ, సూచనలకోసమూ పంపబడింది. సమాఖ్యశాసనసభలో తుది నిర్ణయంకోస మడిచర్చకు వచ్చినప్పుడు, రాష్ట్రాల సవరణాలను పంపినవి. రాష్ట్రాయబారులలో అధికసంఖ్యాకులు ఉత్తమోత్తమమైన ఫెడరల్ ప్రణాళికకు అనుకూలంగా వోటుచేయవలెనని ఆదేశింపబడడంచేత, పార్లమెంటు యే కొలది చిన్నచిన్న సవరణలతోనో ఆ చిత్తుచట్టాన్ని అంగీకరించి, రాష్ట్రాల ఇచ్ఛననుసరించి ఆమోదించడమో నిరాకరించడమో చేయవలసిందని వాటికి పంపించింది. 1,900,000 జనసంఖ్యగల 15½ రాష్ట్రాలు ఆచిత్తుచట్టాన్ని అంగీకరించినవి. 290,000 జనసంఖ్యగల 6½ రాష్ట్రాలు దానిని నిరాకరించినవి. కాబట్టి ఈ నూతన రాజ్యాంగచట్టం 1848 నుండీ అమలులోకి వచ్చినట్లుగా పార్లమెంటు ప్రకటించింది. తరువాత 1874 లో సవరించబడిన ఈ రాజ్యాంగచట్టము నను

సరించియే ఇప్పుడు స్విట్జర్లాండు ప్రభుత్వం జరుగుతూన్నది. కాబట్టి స్విస్సురాజ్యాంగం ప్రజాప్రాతినిధ్యంగల పార్ల మెంటుచే తయారుచేయబడి, ప్రజల ఆమోదమును పొందిన దని చెప్పవచ్చును.

ఇతర రాజ్యాలు కొన్ని :

ఆధునిక ప్రపంచంలోని తదితర రాజ్యాలలో ప్రజా స్వామ్య ప్రభుత్వాలు నిర్మింపబడిన విధానమునుగూర్చి ఇక్కడ వివరంగా చెప్పదలచుకోలేదు. కడచిన ప్రపంచ యుద్ధం తరువాత ప్రజాపరిపాలనా సిద్ధాంత ఆచరణములకు ఆశేషజనమూ అనుకూలంగా ఉన్నసంగతి అందటికీ తెలి సిన విషయమే. జర్మనీ, ఆస్ట్రియా, రష్యా సామ్రాజ్యాలు విచ్ఛిన్నం కావడంవలన పుట్టిన దాదాపు అన్నిరాజ్యాల లోనూ, రాజ్యాంగ నిర్మాణసభలను సమావేశపఱచడం ప్రధాన రాజకీయ సిద్ధాంతంగా పరిణమించింది. 'విప్లవం ముగియడం ఆలస్యంగా, భావిరాజ్యాంగ శాసనమునుగూర్చి నిర్ణయించడానికి ప్రజల సంపూర్ణ ఆలోచనా ఆదేశాల నిమిత్తం క్రొత్తక్రొత్త ప్రణాళికలు తయారుచేయబడినవి. సహజంగా ప్రతిరాజ్యమూ కొన్ని క్రొత్తసమస్యలను చిక్కు లనూ ఎదుర్కోవలసివచ్చిన మాట నిజమే, అయితే రాజ్యాంగ నిర్మాణపరిషత్తులద్వారానే వాటిని పరిష్కరిం చుకోవడానికి తగిన ప్రయత్నాలు జరిగినవి, ఆస్ట్రియాలో

వయస్సువచ్చిన వారందఱూ కలసి 170 మందిగల రాజ్యాంగ నిర్మాణసభను ఎన్నుకొన్నారు. కాని కొంతమంది ఫెడర లిస్టు తీవ్రవాదులు ప్రజలచేగాక వివిధరాష్ట్ర ఎసెంబ్లీలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులుగల మరొక పరిషత్తును నిర్మిం చడంచేత మొదటి రాజ్యాంగ నిర్మాణ సభా కార్యక్రమం కొన్నాళ్లు ఆగిపోయింది. తుట్టతుదకి రెండుసభలూ రాజీ పడిన కారణంచేత నూతన ఆస్ట్రియన్ రిపబ్లిక్కునకు తగిన ఫెడరల్ రాజ్యాంగ విధానాన్ని రాజ్యాంగ నిర్మాణ పరి షత్తు తయారుచేయగలిగింది. యుగోస్లోవియా, లిథుయే నియా, పోలాండు, ఫిన్లాండు, ఎస్తోనియా, లాట్వియా దేశా లలో వయస్సువచ్చిన వారందరూ కలసి ఎన్నుకొన్న రాజ్యాంగ నిర్మాణపరిషత్తులే రాజ్యాంగ చట్టాలను తయారు చేసినవి. ఈ పరిషత్తులలో కొన్నిమాత్రమే దామాషా ప్రాతినిధ్య పద్ధతిని ఎన్నుకోబడినవి. అయితే యివి తయారు చేసిన చట్టాలు ప్రజల ఆమోదముకోసం పంపబడలేదనే విషయంమాత్రం జ్ఞాపకం ఉంచుకోవాలి.

జెకోస్లోవకియా :

ఈ దేశంలో పైన ఉదాహరింపబడిన విధంగా గాక వేరువిధంగా రాజ్యాంగ పరిషత్తు ఏర్పాటుచేయబడింది. ఇక్కడ సుడేటాన్ జర్మనులు, లిథుయేనియనులలాటి జాతీయ అల్పసంఖ్యాకుల సమస్యలను ఎదుర్కోవలసి రావడంచేతను,

శాంతిసభలో ఈ దేశముయొక్క ఎల్లలను నిర్ణయించడానికే చాలాకాలం గడచిఉండడంచేతనూ, ప్రత్యేకం ప్రజలచే ఎన్నుకోబడిన రాజ్యాంగనిర్ణయ సభచే, రాజ్యాంగచట్టం తయారుచేయబడలేదు. కాని ఒకప్రత్యేక విధానంకింద నిర్మింపబడిన జాతీయసభ ఆ పనిని నిర్వర్తించింది. ఈ సభ ఆస్ట్రియా సామ్రాజ్య శాసనసభకు (Reichstrat) బొహీమియా, మొరావియా, సైలీషియా రాజ్యాలనుండి ఎన్నుకోబడిన ప్రతినిధులలోనుండి 1911 లో నిర్మింపబడినది. (ఆనాడు జెకోస్లోవకియా ఆస్ట్రియా సామ్రాజ్యంలో ఒక రాష్ట్రం) కొంతకాలమైన తరువాత స్లోవకులుకూడా ఈ రాజ్యంలో లాంఛనప్రాయంగా చేరగా వారినుండికూడా 55 మందిని ఈ సభవారు చేర్చుకొన్నారు. హంగేరీతో చేసికొన్న రాజీననుసరించి జెకోస్లోవకియా సరిహద్దులు చిట్ట చివరకు స్థిరపరుపబడినవి. అప్పుడా జాతీయసభ, మఱికొంత మందిని స్లోవకియానుండి చేర్చుకొనుటద్వారా స్లోవకియాకు అదనపు ప్రాతినిధ్య మిచ్చినది. ఈవిధంగా నిర్మింపబడిన పరిషత్సభ్యుల మొత్తం 256. ప్రొఫెసర్ యమ్. డబ్లియు గ్రాహం ఈసంస్థను గూర్చి ఎంతబాగా శ్లాఘిస్తున్నాడో చూడండి.

"మామూలు లాంఛనాలను అలా ఉంచితే జెకోస్లోవికియా రాజ్యం యొక్క తాత్కాలిక రాజ్యాంగ శాసనాన్ని, అవలు చట్టాన్నికూడా తయారుచేసిన సభ జాతీయ

సభ అనే మాట నిశ్చయం. యుద్ధమునకు పూర్వం చలా మందిలో ఉన్న అన్ని రాజకీయాభిప్రాయాలకూ అది పూర్తిగా ప్రాతినిధ్యం వహించి ఉండడమేగాక, దానిలోని వివిధ విరుద్ధాభిప్రాయాలు గల జాతీయ అల్పసంఖ్యాకుల వలన యేవిధమైన ఆటంకమూ లేకుండా తన పనిని కొనసాగించుకో కలగడమే ఇందుకు నిదర్శనం. తమకు సమకాలికమైన పోలిష్ రాజ్యంలోవలె అదృష్టవశాత్తూ పైకి వచ్చిన అధిక సంఖ్యాక రాజకీయ కక్షుల దయాదాక్షిణ్యములకు శాశ్వత రాజ్యాంగ పరివర్తనమును వదలివేయడం ఆ సభవారి అభిప్రాయంకాదు. అయితే జెక్కులూ స్లోవకులూకాని, అల్ప సంఖ్యాకుల సంరక్షణ విషయంలో వారు తగిన శ్రద్ధ వహించలేదని చెప్పడానికి వీలులేదు. జెకోస్లొవికియా ప్రభుత్వంవారు అల్పసంఖ్యాకుల సంరక్షణను గూర్చి చేసిన ప్రతిపాదనలు, తాము సూచించ దలచుకొన్న ప్రతిపాదనలను కూడా మించి ఉన్నవని, 'నూతన రాజ్యములను' గూర్చి విచారణచేసిన ప్యారిస్ శాంతిసభకమిటీ వారి రికార్డులలో స్పష్టంగా ఉదాహరింపబడి ఉన్నది.

ఐర్లాండు:

రాజ్యాంగ చట్టమును తయారుచేసుకొనే అవకాశం కలగడానికి ముందు విప్లవంద్వారా అధికారం చేజిక్కించుకొన్న రాజ్యాలలో 'ఐరిష్ ఫ్రీస్టేటు' కూడా ఒకటి. జాతీయ స్వాతంత్ర్యం కోసం ఐర్లాండు దీర్ఘంగా పోరాడిన సంగతి చారిత్రక జ్ఞానంకలవారందఱికీ తెలిసిన విషయమే.

ఐర్లాండు స్వయంనిర్ణయ సూత్రముమీద ఆధారపడి సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందగోరగా బ్రిటిష్ అధికారులు ఐర్లాండుకొక విధమైన స్వపరిపాలనమును ప్రసాదించి ఐరిష్ సమస్యను పరిష్కరించవలెనని చేసిన ప్రయత్నాలు పూర్తిగా విఫలమైనవి. ఐరిష్ జాతీయ వాదులు ఐర్లాండు పరిస్థితులను గూర్చి 1918 లో ఇలా చెప్పినారు. 'ఐర్లాండొకజాతి, అనే గమనికతో ఐర్లాండు రాజ్యాంగచట్టం నిర్మింపబడాలి. చిన్నచిన్న అప్రాముఖ్య విషయాలను గూర్చిన వివరాలలో రాజీ ఉండవచ్చును. ఐర్లాండులోని అల్పసంఖ్యాకుల రక్షణ విషయంలో కూడా రాజీపడడానికి ఎంతో అవకాశం ఉంది. అంతేకాని ఐర్లాండు దేశం మొత్తానికి సంబంధించిన అధికారాలకు హద్దులుండ కూడదు.' బ్రిటిష్ అధికారులీ జాతీయ హక్కును నిరాకరించడమే గాక, అల్స్టరులోని ప్రొటెస్టెంటులకూ మిగిలిన ప్రాంతంలోని క్యాథలిక్కులకూ గల మతభేదాలను స్వార్థంకోసం పెంచి, ఫెడరల్ విధానాన్ని అసంభవంచేసి దేశాన్ని విభజించడానికి అల్స్టరులను ప్రోత్సహించి ఆందోళనచేయించారు.

1912 లో కామన్సుసభవారు యావత్తు ఐర్లాండుకూ ఒకేపార్లమెంటు ఉండేటట్టు హోమ్‌రూలుబిల్లును అంగీకరించినప్పుడు, ప్రభువులసభ వ్యతిరేకించినప్పటికీ అది శాసనమయ్యే పరిస్థితులు కన్పడగా, అల్స్టరులు (Ulsterites) స్వచ్ఛంద సైనికదళాన్ని సమకూర్చి సాయుధనిరోధం సాగించారు. ఇది జాతీయవాదులను మరింత రెచ్చగొట్టి సిన్‌ఫీన్ పక్షనిర్మాణానికి దోహదంచేసింది. మొదటి ప్రపంచయుద్ధాన్ని

సావకాశంగా చేసుకొని సిన్ ఫీనులు 1916 ఈస్టరులో ఆయుధాలతో తిరుగుబాటుచేసి, ఐరిష్ ప్రజాస్వామ్యాన్ని (Republic) ప్రకటించి, తాత్కాలిక ప్రభుత్వాన్ని స్థాపించారు. కాని బ్రిటిష్‌వారు తిరుగుబాటును అతిక్రూరంగా అణచివేయగలిగినారు. అందువల్ల ఆరెండు దేశాలకూ తీరని వైరుధ్య మేర్పడింది. 1919 లో బ్రిటిష్‌పార్లమెంటుకి ఎన్నికలు జరిగినప్పుడు, ఐర్లాండులో స్వాతంత్ర్యసమస్యపైననే ఎన్నిక నడిచింది. అల్స్టరుకు ఈశాన్యంగా బయటనున్న (North Eastern) అన్నిప్రాంతాలలోనూ సిన్ ఫీన్ పక్షంవారు దాదాపు అన్నిస్థానాలనూ గెలుచుకొన్నారు. ఈ విధంగా ఎన్నుకోబడిన 73 మంది సభ్యులూ బ్రిటిష్‌పార్లమెంటులో కూర్చోకూడదని శపథంపట్టి డబ్లినులో సమావేశమై "డయల్ ఐరన్" (Dail Eirean) అనే పేరుతో తమ పార్లమెంటును స్థాపించుకొని, స్వాతంత్ర్యప్రకటనచేసి, మంత్రివర్గాన్ని యేర్పరచుకొని, బ్రిటిష్‌ప్రభుత్వానికి వ్యతిరేకంగా మఱొక మారుప్రభుత్వాన్ని నడిపింపసాగారు. 1920లో బ్రిటిష్‌ప్రభుత్వంవారు ఐర్లాండు విభజించబడడం ఖాయమనేవిశ్వాసం కలిగేటట్లుగా ఐర్లాండు రాజ్యాంగ చట్టాన్ని ఒకదానిని అంగీకరించారు. అందుమూలాన ఐర్లాండులో అల్స్టరు కొకపార్లమెంటూ తక్కిన దేశమంతటికీ మఱొక పార్లమెంటూ ఏర్పడ్డవి. యావత్తు ఐర్లాండుకూ సంబంధించిన విషయాలలో ఈ రెండుపార్లమెంటులూ అంగీకరించి యిచ్చిన అధికారాలను అమలుపఱిచేటందుకు

40 మందితో కూడిన ఒక ఫెడరల్ కౌన్సిలు యేర్పాటు చేయబడింది. దీనికి రెండుపార్లమెంటులూ చేటి 20 మంది సభ్యులను ఎన్నుకొని పంపించవలెను. దేశరక్షణ, విదేశాంగ వ్యవహారలవంటి ముఖ్యవిషయాలు కొన్ని ప్రత్యేకం బ్రిటిష్ ప్రభుత్వంవారు తమ చేతులలోనే పెట్టుకొన్నారు.

ఇదంతా చూచి జాతీయవాదులు మునుపటికంటె కూడా బిఱ్ఱబిగిసి కూర్చున్నారు. బ్రిటిష్ అధికారముఁనెడల వారివిరోధభావమంతకంతకు ప్రస్ఫుటమై తీవ్రరూపం తాల్చింది. బ్రిటిష్ వారి దండనవిధానం విఫలమయింది. ఎక్కడ చూచినా గొర్రిల్లాయుద్ధం సర్వసాధారణమైపోయింది. సైనికపరిస్థితులు ఉభయులకూ కూడా అంత అనుకూలంగా లేకపోవడంచేత ఉభయులూ మార్దవంగా వ్యవహారం కుదుర్చుకోవడం మంచిదని 1921 నాటికి బ్రిటిష్ వారూ ఐరిష్ వారూకూడా తెలిసికొన్నారు. బ్రిటిష్ ప్రభుత్వంవారే ముందుగా రాయబారాలు ప్రారంభించారు. ఉభయదేశాలూ శాంతిసభలో సమావేశమై ఒక సంధి చేసుకొన్నారు. అట్పరకు వెలిగానున్న ఐర్లాండు దేశపు స్వాతంత్ర్యాన్ని ఆ సంధి గుర్తించింది. అయితే బ్రిటిష్ చక్రవర్తియెడల విశ్వాసంకలిగి ప్రవర్తిస్తూ ముఖ్యంగా దేశరక్షణకు సంబంధించిన కొన్ని షరతులకు ఐర్లాండు లోబడి ఉండవలెనని అందులో నిర్ణయింపబడింది. ఈసంధివలన బ్రిటనుఐర్లాండుల మధ్యగల దీర్ఘరాజకీయపోరాటం ఒకవిధముగా అంతమొందింది.

తరువాత 1922లో ఐరిష్ ప్రజలు తమ దేశమునకొక రాజ్యాంగచట్టమును నిర్మించుకోవడానికి ప్రయత్నించారు. అప్పటికప్పుడే రాజ్యాంగనిర్మాణపరిషత్తుసిద్ధాంతం ప్రజాస్వామ్యసూత్రంలో ప్రధానభాగంగా పరిగణించింది. వారాసిద్ధాంతానికి కట్టుబడి 1920 నాటి ఐర్లాండు ప్రభుత్వ చట్టంలో నిర్దేశించబడినట్టిన్నీ, దాదాపు వయసువచ్చిన వారందరిచేతనూ ఎన్నుకొనబడినట్టిన్నీ 130 మంది సభ్యులు గల రాజ్యాంగపరిషత్తును సమావేశపరిచారు. కాని ఇంగ్లాండుతో చేసుకొన్న కొన్ని సంధిషరతులకు అంగీకరించక డీవెలరా నాయకత్వంకింద నడుస్తూన్న రిపబ్లికన్ ప్రతినిధులీ పరిషత్సమాలోచనలలో పాల్గొన నిరాకరించారు. చిత్తు చట్టాన్నిగూర్చిన చర్చ 1922 సెప్టెంబరు 18న ప్రారంభమై అక్టోబరు 25 తో అంతమయింది. వారు తయారుచేసిన రాజ్యాంగచట్టం డిశంబరు 6 నుండీ అమలులోకి వచ్చింది.

ఈ రాజ్యాంగచట్టాన్ని గూర్చి ముఖ్యంగా రెండు విషయాలను గమనించాలి. ఒకటి దీనిని తయారుచేసిన సభ స్వేచ్ఛమైన రాజ్యాంగనిర్మాణపరిషత్తు. అది యెప్పుడూ శాసననిర్మాణ కార్యములను నిర్వర్తించలేదు. ఈ సభ సమావేశమైనకాలంలో తక్షణావసరములకు కావలసిన శాసననిర్మాణకార్యక్రమం యావత్తూ తాత్కాలిక ప్రభుత్వం వారి ఉత్తరువులరూపకమైన డిక్రీలద్వారానే నిర్వహింపబడినది. అందువలన ఈ సభ సామాన్యశాసనాధికారములనూ, రాజ్యాంగనిర్మాణ శాసనాధికారములనూ, వేరువేరుగా ఉంచగలిగింది.

ఇంకొకటి ఏమంటే బ్రిటిష్ కామన్‌వెల్తులోని తదితర అధినివేశ రాజ్యాల రాజ్యాంగచట్టాలు బ్రిటిష్ పార్లమెంటు వారిచే శాసింపబడినవి. కాని ఐరిష్ ఫ్రీస్టేటు యొక్క రాజ్యాంగ చట్టంమాత్రం పూర్తిగా ఐరిష్ ప్రజలవల్లనే తయారు చేయబడి ఆచరణలోకి వచ్చింది. ఈ విషయమా రాజ్యాంగ చట్టంలోని రెండవసూత్రంలో ఈ విధంగా ప్రస్ఫుటం చేయబడింది: "ప్రభుత్వానికిగల అన్ని అధికారాలున్నూ, శాసన, కార్యనిర్వాహక, న్యాయసభల అధికారం యావత్తున్నూ, ఐర్లాండు ప్రజలనుండియే వారికి సంక్రమించింది. ఐరిష్ ఫ్రీస్టేటులోని ఈ అన్ని అధికారాలు, ఈ రాజ్యాంగ శాసనం క్రింద లేక దీనివలన ఇందు కనుగుణంగా నిర్మింపబడిన సంస్థల ద్వారా అమలు జరుపబడుతూండవలెను."

### మూడో రకం:

ఇంతకు పూర్వం దౌర్జన్యయుత విప్లవములు జరిగిన చోట్ల రాజ్యాంగ శాసనములను తయారుచేసుకొన్న దేశాలనుగూర్చి వ్రాశాము. ఇప్పుడు కేవలం శాంతియుతంగా అన్ని కక్షులవారు కలసి రాయబారాలద్వారా రాజ్యాంగ చట్టాలను నిర్మించుకొన్న దేశాలసంగతి వ్రాయబోతూన్నాము. ఈ సందర్భాలలోకూడా, పాతరాజకీయవిధానాలనూ, రాజ్యాంగ పద్ధతులనూ మార్చి కొత్తవాటిని నిర్మించదలచుకొన్నవారు ముందుగా అధికారం చేజిక్కించుకొనియే ఆపని ప్రారంభించారు. కాని వారు యుద్ధంచేయక రాయబారాలూ, రాజీ మూలకంగానే అధికారం సంపాదించుకొన్నారు.

అటువంటి దేశాలలో అత్యంత ముఖ్యమైనవి అమెరికా సంయుక్త రాష్ట్రాలు, కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికాలు. 1787 లో అమెరికా సమాఖ్య (Confederation) అమెరికా ఫెడరేషన్‌గా మార్పు చేయబడింది. సమాఖ్య వాదులూ ఫెడరేషన్ వాదులూ కొట్లాడుకోకుండా రాజీగా ఈ నిర్ణయానికి రాగలిగారు. ఇదేవిధంగా శాంతియుతంగానే 1867 లో కెనడా అధినివేశం ఫెడరేషన్‌గా మార్పు చేయబడింది. 1900 లో ఆస్ట్రేలియన్ కామన్‌వెల్తూ, 1909 లో దక్షిణఆఫ్రికా యూనియనూ నిర్మింపబడినవి. బ్రిటను ఎక్కువ అధికారం చలాయించకుండా మానిన స్వపరిపాలిత వలస రాష్ట్రాలలో న్యాయశాస్త్రాల ఫలితంగా కలిగిన రాజ్యాంగాలివి.

కెనడా :

బ్రిటిష్ పార్లమెంటువారు చేసిన—బ్రిటిష్ ఉత్తర అమెరికాచట్టంవలన—కెనడా ఫెడరేషను అయింది. కాబట్టి శాస్త్రప్రకారం మాలోచిస్తే బ్రిటిష్ పార్లమెంటే కెనడా రాజ్యాంగాన్ని నిర్మించిందని చెప్పాలి. కాని నిజానికి బ్రిటిష్ పార్లమెంటు చేసిన ఈచట్టం, కెనడా, నోవాస్కోషియా, న్యూబ్రూన్‌స్విక్, ప్రిన్సు ఎడ్వర్డు ఐలెండు ప్రభుత్వాలచే నియమింపబడిన ప్రతినిధులు 1864 లో క్విబెక్కులో సమావేశమై చేసిన తీర్మానాలపైననే పూర్తిగా ఆధారపడిఉంది. కాబట్టి కెనడా అధినివేశ రాజ్యాంగాన్ని తయారుచేసిన సభ నిజంగా క్విబెక్కు సమావేశంకాని మరొకటికాదు. అయితే

ఈ సమావేశం ఈ అధ్యాయానికి మొట్టమొదట ఉదాహరింపబడిన రాజ్యాంగనిర్మాణ సభలవంటిదికాదు. దీనిలోని సభ్యులు ప్రత్యేకం రాజ్యాంగ నిర్మాణం కోసమై ప్రజాసామాన్యంచేత ఎన్నుకోబడ్డ వారుకారు. వారా కాలంనాటి బ్రిటిష్ ఉత్తర అమెరికాలోని వివిధ రాష్ట్రీయ మంత్రులచే నియోజితులైన వారు. అయినప్పటికీ ఈ సందర్భంలో మనం రెండు విషయాలను ముఖ్యంగా గమనించాలి. ఒకటి 1864 నాటికి ఈ రాష్ట్రాలన్నీ బాధ్యతాయుత ప్రభుత్వాలను కలిగియున్నవి. ఆ ప్రతిఒక్క రాష్ట్రంలోనూ ప్రజలచే ఎన్నుకోబడిన శాసనసభా, శాసనసభకు బాధ్యత వహించిన మంత్రివర్గమూ ఉన్నవి. ఇందువలన ప్రజలకూ, శాసనసభకూ, మంత్రివర్గానికీ కూడా అభిప్రాయాలలో ఒక విధమైన ఐక్యత ఉండినదని అర్థం. కాబట్టి మంత్రివర్గంచేసిన ఏపనియైనా ప్రజల అంగీకారంతో చేసినదనే చెప్పాలి. మఱొక విషయమేమంటే క్వెబిక్కు సభలోని ప్రతినిధు లంగీకరించిన 72 తీర్మానాలూ, రాష్ట్రీయ శాసన సభలు ఆమోదించడంకానీ నిరాకరించడంకానీ జరుగవలెననే ఉద్దేశంతో అవన్నీ శాసన సభలకు పంపబడినవి. అందువలన కెనడా అధినివేశ రాజ్యాంగానికివెనుక ప్రజల ఆమోదం ఉన్నట్లుగానే భావించాలి. ఈ ఆమోదం రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు ద్వారానే రాజ్యాంగచట్టం నిర్మింపబడవలెనని వాదించేవారి సిద్ధాంతానికి భిన్నమైనది అయితే కావచ్చును.

ఈ తీర్మానాల తరువాతచరిత్ర రాజ్యాంగ నిర్మాణ పరిశీలనకు ప్రోత్సాహం కలిగించే కొన్ని లక్షణాలను వెల్లడి చేస్తూన్నది. కెనడా పార్లమెంటులో చర్చకు వచ్చినప్పుడివి తీవ్రవిమర్శకు గురియైనవి. కెనెడియన్ రాజ్యాంగమును పరిశీలించిన ఒకానొక రాజకీయ పరిజ్ఞాత ఇలా అన్నాడు. "అధికారం పొందని వారు సంధిచేసుకోవడము, ఫెడరేషన్ నిబంధనలు ప్రజలకు పంపబడక పోవడమూ—ఈ రెండూ చాలా తీవ్ర విమర్శకు పాలయినవి,...కాని కనీసం 1858 నుండి అయినా ఈ విషయం చర్చింపబడుతూనే ఉన్నదనీ, 1864 లో జరిగిన అనేక మధ్య యెన్నికలలో (By-elections) ఈ ప్రణాళికకు అనుకూలురైన వారినే ప్రజలు యెక్కువ ఉండి ఎన్నుకొన్నారనీ, దీనికి వ్యతిరేకమైన బహిరంగ సభలు ఎన్నడూ విరివిగా జరుగలేదనీ, ఇది అక్కరలేదని ఎవ్వరూ పిటిషనులు పెట్టుకోలేదనీ—ఈ అన్ని కారణాల వలన దేశం ఈ తీర్మానాలను ఆమోదిస్తూన్న దనుకోవడం న్యాయమేననీ, ఇన్ని వివరాలతో, కూడిన ఈ చిక్కు చట్టాన్ని ప్రజలకు పంపించడం అసంభవమనేమాట వేరుగా చెప్పనక్కరలేదనీ వాదించి మంత్రివర్గం వారు తమచర్యను సమర్థించుకొన్నారు." అయితే ఈ తీర్మానాలను పార్లమెంటులో అత్యధిక సంఖ్యాకు లంగీకరించారు. అయినప్పటికీ విమర్శలో అర్థం లేకపోలేదు. భాధ్యతాయుత ప్రభుత్వవిధానంకిందకూడా ముఖ్యమైన రాజకీయ సంస్కరణలను చేసేటప్పుడు ముందుగా ప్రజల స్పష్టమైన ఆదేశాన్ని పొంది ఉండడం ఉత్తమం. ఆ సందర్భంలో ప్రభుత్వ పక్షాన

మాట్లాడేవారు 'సిద్ధాంతానికీ' 'వివరాలకీ' గల తార తమ్యాన్ని మనస్సులో పెట్టుకొని వ్యవహరించాలి.

న్యూ బ్రూన్‌స్విక్ మంత్రివర్గం తమ తీర్మానాలను శాసన సభలకు పంపనూ లేదు. వారు వాటిని పూర్తిగా పరిశీలించి చర్చించనూ లేదు. వారు శాసనసభలను రద్దుచేసి సామాన్య ఎన్నికలలో ఈ తీర్మానాలను ప్రధానమైన ఎన్నిక విషయంగా చేశారు. 41 నియోజకవర్గాలనుండీ ఫెడరేషనును సమర్థించేవారు ఆరుగురు మాత్రమే గెలుపొందడంచేత, అప్పటికి ఫెడరేషనును గూర్చిన ముచ్చట ఆపుచేయబడినది. న్యూ బ్రూన్‌స్విక్కులోని ఈ సంఘటనలు, నోవా స్కోషియా ప్రిన్సు ఎడ్వర్డు ఐలెండులలో దుష్పలితాలకు దారి తీసినవి. మొదట పేర్కొనబడిన రాజ్యంలో, అంతకు పూర్వపు ప్రణాళిక ననుసరించి మూడు కోస్తా రాష్ట్రాలు కలసి ఒకే శాసనసభకల యూనియన్‌గా ఉండవలెనని తీర్మానింపబడింది. తరువాత పేర్కొనబడిన రాజ్యంలో ఫెడరేషనుకు సంబంధించిన ప్రణాళికలన్నీ నిరాకరింపబడినవి.

కాని కొంతవరకు బ్రిటిష్ వలస రాజ్యాధికారుల ప్రభావ చాతుర్యములవలన క్రమక్రమంగా కోస్తా ప్రాంతములలో కూడా అభిప్రాయాలు మారినవి. బ్రున్‌స్విక్కులో 1866 ఎన్నికలలో ఫెడరేషన్‌కు అనుకూలురు రాష్ట్ర మంతటా సంపూర్ణ విజయం పొందినారు. నోవాస్కోషియా శాసన సభలో కూడా ఫెడరేషను కనుకూలమైన తీర్మానమామోదింపబడెను. తరువాత కెనడా, నోవాస్కోటియా

(Nova Scotia) న్యూబ్రున్స్విక్ మంత్రులు పంపిన ప్రతినిధులు సమావేశమై, క్వెబెక్ మహాసభలో చేసిన తీర్మానాలవంటి 69 తీర్మానాలనుచేసి వలస రాజ్యాల కార్యదర్శికి పంపించారు. ఈ తీర్మానాలను ఆధారంచేసికొని, వలస రాజ్యాల ప్రతినిధులున్నూ కొంతమంది బ్రిటిష్ ప్రతినిధులున్నూ కలసి నూతనొక చిత్తు చట్టాన్ని తయారుగావించారు. ఏమీమార్పులు చేయకుండా బ్రిటిష్ ప్రభుత్వం దానిని చట్టంగా అంగీకరించింది. దీనినే బ్రిటిష్ ఉత్తర అమెరికా చట్టమంటారు. ఇదే నేటి కెనడా అధినివేశ రాజ్యాంగ చట్టం. ఫెడరేషన్ కోసం పరితపిస్తూన్న ఆయా రాష్ట్రాల మంత్రులచే నియోగింపబడిన కొద్దిమంది ప్రతినిధుల కృషి ఫలిత మీ చట్టము.

ఆస్ట్రేలియా :

వేఱొక అర్థానికి అవకాశంలేని విస్పష్టమైన భాషలో ప్రజాపాలిత రాజ్యాంగచట్టమును తయారుచేయడం ముఖ్యావసరమ నేటందుకు ఆస్ట్రేలియా రాజ్యాంగ నిర్మాణచరిత్రమును ఉదాహరణగా తీసికోవచ్చును. ఫెడరేషన్ సమస్యను గూర్చి మొట్టమొదట శ్రద్ధవహించిన మనిషి న్యూ సౌత్ వేల్సు ప్రధాన మంత్రి సర్ హెన్రీ పార్క్సు. వలస రాజ్యాల ప్రభుత్వాలకంటె ఎక్కువ విశాలమైన సంస్థల ద్వారా రాజ్యాంగచట్టాలు వెలువడడం ముఖ్యావసరమని ఫెడరేషనును గూర్చి ఆయన యిచ్చిన తొలి ఉపన్యాసాలలో ఒక ఉపన్యాసమునందు (1889 అక్టోబరు 24 న) నొక్కివక్కా-

ణించాడు. 'వలస రాజ్యాల పార్లమెంటులచే నియోగింప బడిన ఆ ప్రతినిధులూ వలస రాజ్యాల ప్రముఖ నాయకులూ గల మహాసభ కావాలి' అన్నాడాయన. అటువంటి మహా సభా నిర్మాణమునకై ముందుగా ఆలోచనలు చేసుకొనే టందుకు 1890 ఫిబ్రవరి 6 వ తేదీని వలస రాజ్యాలవారు ఇష్టాగోష్ఠిగా సమావేశమైనారు. ప్రతి వలస రాజ్య ప్రభు త్వమువారూ తమ పక్షమునుండీ తమ ఎదిరి పక్షమునుండీ ఇరువురు ప్రతినిధులను నియోగించి, న్యూజీలాండునుండి కూడా మఱొక ప్రతినిధిని కలుపుకొన్నారు. ఆ విధంగా సమావేశమైన పదమూడుమంది ప్రతినిధులూ, ఫెడరేషన్ యొక్క అవసరమును అంగీకరించి తగిన ఫెడరల్ విధాన మునుగూర్చి విచారించి నివేదికను పంపే నిమిత్తం, ఆస్ట్రే లియన్ జాతీయ పరిషత్తుకు (Australian National Convention) ప్రతినిధులను నియోగించ వలసిందని శాసన సభలను ఆహ్వానించారు. తరువాత శాసనసభలు ప్రతి నిధులను ఎన్నుకొన్నవి. ఆస్ట్రేలియాలోని ఆరు వలస రాజ్యాలవారూ ఒక్కొక్కరు ఏడుగురు ప్రతినిధులనూ, దూరానఉన్న న్యూజీలాండువారు ముగ్గురు ప్రతినిధులనూ ఎన్నుకొని పంపినారు. ఈ ప్రతినిధులను పంపడంలో రెండు శాసనసభలలోని ఇరువర్గములకూకూడా ప్రాతినిధ్యము ఉండేటట్లు జాగ్రత్తవహించారు. 1891 మార్చిలో ఈ జాతీయ పరిషత్తు (Convention) సమావేశమై దీర్ఘంగా సమాలోచనలుచేసి ఆస్ట్రేలియా కామన్వెల్తు చట్టానికి ముసాయిదా వ్రాసింది. ఈ చిత్తు చట్టాన్ని అంగీకరించ

డంలో ప్రతి కాలనీకూడా తనకు తోచిన పద్ధతిని అవలం భింపవచ్చునని పరిషత్తు సిఫారసు చేసింది. తాను తిరిగి సమావేశమై సవరణలను గూర్చి ఆలోచించవలసిన అవసర మేర్పడకుండా ప్రతికాలనీయున్నూ ఈ చిత్తుచట్టాన్ని మొత్తంగా అంగీకరించడమో, తిరస్కరించడమో చేయ వలెననికూడా ఆ పరిషత్తు తీర్మానించింది.

కాని పరిషత్తుకు వెలుపల నున్నవారు మొత్తంమీద ఈ బిల్లు కంత సుముఖంగా లేరు. దీనిని గూర్చి పూర్తిగా పరిశీలించిన క్వీక్, గ్యారను లిరువురూ ఇలా అన్నారు: 'కన్వెన్షన్ రచించిన ఈ బిల్లును తుదిపరిష్కారంగా పార్ల మెంటులుగానీ, ప్రజలుగానీ అంగీకరించబోవడం లేదని తొందరలోనే తెలియవచ్చింది. ఎంతో అంత ప్రాముఖ్యత గల రాజ్యాంగచట్టముయొక్క వివరాలనుగూర్చి తమ మాట వినకుండానే దానిని అమలుపరచడం తగదని పార్లమెంటులు భావించడం సహజమే. ఈచట్టం ప్రజలకు పరోక్షంగా ప్రాతి నిధ్యం వహిస్తూన్న కొంతమంది పూర్వాచారపరాయణులు గల సంస్థచే తయారుచేయబడినదనీ, దానిని సృజించిన పార్లమెంటులు కూడా దానికి ఫలానా పని చేయవలసిందని స్పష్టంగాగానీ వివరంగాగానీ ఆదేశించి ఉండలేదనీ ప్రజా బాహుళ్యంలో ఒక అపనమ్మకం కూడా బయలుదేరింది. అందువల్ల కొంతమంది ఈ బిల్లును అతివిస్తారంగా శ్లాఘించ డమూ, మరికొంతమంది అతికఠినంగా విమర్శించడమూ జరిగింది.' ఈ అభిప్రాయాలు ముఖ్యంగా గమనించదగినవి.

రాజ్యాంగంలో యేదైనా ఒక గొప్పమార్పును అమలు పఱిచేముందు,- ఆ మార్పు సహజంగా ఎంత మంచి దైనప్ప టికీ-ప్రజాభిప్రాయాన్ని ప్రస్ఫుటంచేయగల సంస్థలతో ముం దుగా ఆలోచించడం ప్రజాపాలనపు వాతావరణంలో ఎంత అవసరమో వాటివలన స్పష్టంగా తెలుస్తూన్నది. 1890 నాటి కన్వెన్షన్ వారు తయారుచేసిన బిల్లు ఆచరణలోకి రాకపోవడానికి కారణం పైన పేర్కొనబడినట్లు ప్రజల మద్దతు లేకపోవడమే. దానిలో చాలా సుగుణాలు ఉన్నవి. నిజానికి తరువాతబిల్లుకు అనగా చిట్టచివరి ఆస్ట్రేలియన్ కామన్ వెల్తుచట్టానికి పునాదికూడఅదే. కాని, అది తక్షణం ఫలప్రదం కాలేదు.

తరువాత ఫెడరల్ ఉద్యమచరిత్రలో ఈ విషయం బాగా తెలిసివచ్చింది. ఫెడరేషను కనుకూలంగా యిప్పుడు గొప్ప ఆందోళనచేసిన ఆస్ట్రేలియన్ నేటివ్సుల సంఘం, ఫెడ రల్ రాజ్యాంగాన్ని తయారుచేసే సభ (Convention)లోని సభ్యులను, శాసనసభలుగాక ప్రజలే నేరుగా ఎన్నుకొన వలెననీ, వారువ్రాసిన చట్టముకూడా ప్రజల వోట్లద్వారానే ఆమోదమును పొందవలెననీ గట్టిగా పట్టుబట్టినారు. దీనిని గూర్చి క్విక్కు, గ్యారనులు ఇలా అంటూన్నారు: 'రాజ్యాంగ నిర్మాణమునకు బాగాపనికివచ్చే శిక్షణ, సమర్థతగలమనుష్యు లను ఎన్నుకోవడంలో పార్లమెంటులకంటె ప్రజలకు తక్కువ అర్హతఉన్నదని పార్లమెంటరీవిధానమునందు విశ్వాసంగల వారనుకొని ఉండిరి. కాని రాజ్యాంగనిర్మాణసభలోని మను ష్యులఆధిక్యతకంటె కూడా ఆ సభయందు ప్రజలకు గల

విశ్వాసమే ఎక్కువగా పరిగణింపదగినదనే విషయాన్ని వారు గుర్తించినట్లులేదు. అయితే ప్రజలెన్నుకొన్నవారు చాలా మంది పార్లమెంటు లెన్నుకోదగినవారుగానే ఉన్నారు. ప్రజలు నేరుగా ఎన్నుకొన్నందువలన పార్లమెంటుల ఎన్నిక వలన లభించని ఎక్కువ అధికారమూ ప్రజావిశ్వాసమూ వారికి లభించినవి.' రాజ్యాంగనిర్మాణమునకు శాస్త్రజ్ఞానమూ, ప్రావీణ్యమూ ఉండవలసిందే. కాని అవి ఉన్నంత మాత్రాన చాలదు. వాటిని గట్టిగా ఆచరణలోకి పెట్టేటందుకు తగిన అధికారంకూడా ఉండాలి. ప్రజాపాలనములో ఇది ప్రజలవలననే లభిస్తుంది.

ఆస్ట్రేలియన్ నేటివులసంఘమువారు సూచించిన పై కార్యవిధానము 1895లో ఆస్ట్రేలియా వలసరాజ్యాల ప్రధానులసభలో అంగీకరింపబడినది. న్యూసౌత్ వేల్సు, విక్టోరియా, దక్షిణఆస్ట్రేలియా, టాస్మేనియా రాజ్యాలప్రజలు ఒక్కొక్క రాజ్యమునుండి పదిమంది ప్రతినిధులను రాజ్యాంగనిర్మాణ సభకు (Convention) ఎన్నుకొని పంపించారు. పశ్చిమ ఆస్ట్రేలియా ప్రతినిధులను పార్లమెంటే ఎన్నుకొన్నది. క్వీన్సులాండు ఫెడరల్ ఉద్యమానికి దూరంగా ఉన్నది. 50 మంది సభ్యులుగల ఆ సభ అడిలేయిడ్‌లో (Adilaide) దాదాపు నెలరోజులు సమావేశమై ఒక బిల్లును తయారు చేసింది. అనేక పార్లమెంటులాబిల్లును చర్చించి సవరణలను సూచించినవి. తరువాత ఆసభ మెల్‌బొర్న్‌లో రెండవ పర్యాయం సమావేశమై, ఈసవరణలకనుగుణంగా ఆబిల్లును

తిరిగీ వ్రాసినది. తరువాత పైన పేర్కొనబడిన నాలుగు వలసరాజ్యాలలోని ప్రజల ఆమోదమునకు ఆచిత్తుచట్టం పంపబడింది. పడమర ఆస్ట్రేలియామాత్రం శాసనసభ ఆమోదమునే కోరింది. ఈ అన్నిటిలోనూ అధికసంఖ్యాకులూ రాజ్యాంగచట్టానికి అనుకూలురుగానే ఉన్నారు. కాని అన్నిటిలోకి ముఖ్యమైన న్యూసౌత్ వేల్సురాజ్యంలో ఇంతకుపూర్వపు స్వాతంత్ర్యచట్టంలో (Enabling Act) ఉదాహరింపబడిన సంఖ్యకు తక్కువగా ఉండి, అతిస్వల్పమైన మెజారిటీతో ఈచట్టం నెగ్గింది. న్యూసౌతువేల్సులోని విమర్శకుల అభ్యంతరాలను విచారించేనిమిత్తం 1899 జనవరిలో మఱియొక ప్రధానులసభ జరిగింది. అంతకుపూర్వం ఫెడరల్ ఉద్యమానికి దూరంగాఉన్న క్వీన్సులాండుకూడా ఆసభలో కలియడమే ఆ సభావృత్తాంతంలో గొప్పసంగతి. ఆ బిల్లును సవరించి కాలనీల ప్రజల ఆమోదం నిమిత్తం తిరిగీ పంపించారా సభవారు. ఈ పర్యాయం దానిని వోటర్లు అంగీకరించారు. తరువాత సీమలోని పార్లమెంటు యేవిధమైన మార్పులేకుండా ఆ బిల్లును చట్టంగా ఆమోదించింది. దానికి 1900 నాటి ఆస్ట్రేలియా కామన్ వెల్తు రాజ్యాంగ చట్టమని పేరు. కాబట్టి ఆస్ట్రేలియా రాజ్యాంగచట్టము, నాలుగు వలసరాజ్యాలలో (Colonies) నేరుగా ప్రజలచేతనూ తక్కిన రెండురాజ్యాలలోనూ పార్లమెంటులచేతనూ ఎన్నుకోబడిన రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుచే తయారుచేయబడినదనీ; ఆయారాజ్యాల ప్రధానులసభలూ, రెండు శాసన

సభలలో ఇరుకక్షులకూ చెందిన ప్రముఖసభ్యులూ, శాసన సభలూకూడా తరువాతి దశలలో దానికి రూపమిచ్చేటందుకు ముఖ్యపాత్రవహించారనీ చెప్పవచ్చును.

దక్షిణ ఆఫ్రికా :

కేప్ కాలనీ, ట్రాన్స్వాల్, ఆరంజిఫ్రీస్టేటు, నేటాలు అనే నాలుగు స్వపరిపాలిత వలసరాజ్యాల శాసనసభలచే ఎన్నుకోబడిన ముప్పైమంది ప్రతినిధులుగల రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు (National Convention) దక్షిణఆఫ్రికా రాజ్యాంగచట్టాన్ని తయారుచేసింది. ఇందులో కేప్ కాలనీకి పంన్రెండుమందీ, ట్రాన్సువాలుకు ఎనిమిదిమంది ఆరెంజి ఫ్రీస్టేటు నేటాలులకు చెఱి అయిదుమందీ ప్రతినిధులుగా ఎన్నిక అయినారు. వీరికితోడు రానున్న ఆ యూనియనులో చేర్చు కోబడడానికి నావకాశం కలదని భావించి రొడీషియానుండి కూడా ముగ్గురిని ప్రతినిధులుగా కలుపుకొన్నారు.

ఈ పరిషత్తు (Convention) 1908 అక్టోబరు 12 వ తేదీమొదలు నవంబరు 5 వ తేదీవరకు దర్బానులో ఒక సారి సమావేశమయింది. తరువాత కేప్ టౌన్‌లో 1908 నవంబరు 23 మొదలు 1909 ఫిబ్రవరివరకూ తిరిగీ సమావేశమయింది. ఆ నాలుగు స్వపరిపాలిత రాజ్యాల యూనియనుకూ ఫెడరల్ పద్ధతినిగాక యూనిటరీపద్ధతిని ఈ పరిషత్తొకచిత్తు రాజ్యాంగచట్టాన్ని తయారుచేసింది. తరువాత అది పైన పేర్కొనబడిన నాలుగు వలసరాజ్యాల పార్లమెంటులలోనూ చర్చకు వచ్చినప్పుడు దానికనేకసవరణలు

ప్రతిపాదింపబడినవి. మూడవసారి ఆ పరిషత్తు 1909 మే మూడో తేదీ మొదలు 11 వ తేదీవరకూ బ్లూమెంఫోంటీన్ (Bloem fontein) లో సమావేశమైనప్పుడు ఈ సవరణలన్నీ విచారణకు వచ్చి ఆచిత్తు చట్టంలో మార్పులుచేయబడినవి. ఈవిధంగా పరిణామం పొందిన చిత్తు చట్టం మూడు వలస రాజ్యాలలో శాసనసభలవల్లనూ, నేటాలులో ప్రజా సామాన్యంవల్లనూ ఆమోదించబడింది. అంతట ఇంపీరియల్ పార్లమెంటువారు చట్టంగా అంగీకరించేటందుకు ఆ బిల్లు ఇంగ్లాండుకు పంపబడినది. అప్పుడే లండనులోని వలసరాజ్య కార్యాలయమువారితో సంప్రతించి చిత్తు చట్టంలోని సిద్ధాంతాలకూ, నియమాలకూ విరుద్ధం కాని యే సవరణల కైననూ అంగీకరించేటందుకు, ఆనాలుగు వలసరాజ్యాల శాసనసభలలో ప్రతిఒక్కటీ కొంతమంది ప్రతినిధులను ఎన్నుకొని పంపించింది. కొన్ని సవరణల నీప్రతినిధు లంగీక రించిన పిమ్మట ఇంపీరియల్ పార్లమెంటువారు దానిని క్రమ బద్ధమైన చట్టంగా చేశారు. అదే 1909 నాటి దక్షిణ ఆఫ్రికాచట్టం (The South Africa Act of 1919) 1910 మే 31 వ తేదీని దక్షిణఆఫ్రికా యూనియనుప్రకటనజరిగింది.

కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణఆఫ్రికాల రాజ్యాంగ శాసనాలను తయారుచేసిన సంస్థలు చిన్నచిన్నవి, ఆయా రాజ్యాంగచట్టాలు నిర్మింపబడిన రోజులలో ఆ దేశాలలోని జనసంఖ్యకూడా తక్కువగానే ఉండడంచేత అది మన కంత ఆశ్చర్య మనిపించడంలేదు. కెనడియన్ రాజ్యాంగాన్ని రచించిన క్వైబెక్కు సభ ఇంతవరకు సమావేశమైన రాజ్యాంగ

పరిషత్తు లన్నిటిలోకీ మఱీ చిన్నది. ముప్పై మూడుమంది ప్రతినిధులుగల దక్షిణఆఫ్రికా రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు దానికంటె కొంచెం పెద్దది. ఈ మూడింటిలోనూ పెద్దదైన ఆస్ట్రేలియన్ రాజ్యాంగ నిర్మాణ పరిషత్తులోకూడా 50 కంటె ఎక్కువమంది సభ్యులు లేరు. కాని ఈ సభల ప్రతినిధులను ఎన్నుకోవడంలో ఈ దేశాలన్నీ ఒకేపద్ధతిని అవలంబించలేదు. కెనడాలో మంత్రులే ప్రతినిధులను ఎన్నుకొన్నారు. దక్షిణఆఫ్రికాలో శాసనసభలు ఎన్నుకొన్నవి. ఆస్ట్రేలియాలోని నాలుగు వలసరాజ్యాలలో ప్రజలున్నూ తక్కిన రెండు వలసరాజ్యాలలో శాసనసభ్యులున్నూ ఎన్నుకొన్నారు. కెనడా, దక్షిణఆఫ్రికాలలో చిత్తు రాజ్యాంగ చట్టాలను శాసనసభలే ఆమోదించినవి. ఆస్ట్రేలియాలో కొంతవరకు శాసనసభలద్వారాను, మఱి కొంతవరకు ప్రజలవోట్ల మూలమునను చిత్తు రాజ్యాంగచట్టముయొక్క ఆమోదం జరిగింది. తాము ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఎన్నుకొని వట్టిశాస్త్రజ్ఞులకు, ఏసందర్భంలోనూ ఈరాజ్యాంగ శాసనములను తయారుచేసేపనిని ప్రజలు ఒప్పగించలేదు. కాని వారిసలహా సహాయములనుమాత్రం పొందుతూనే ఉండిరి. ఈమూడు అధినివేశముల రాజ్యాంగనిర్మాణముల లోనూ, రాజ్యాంగ నిర్మాణ పరిషత్తులను గూర్చిన విప్లవ యుగమునాటి ప్రజాస్వామ్యసిద్ధాంతముయొక్క ప్రభావం చాలా పనిచేసింది.



# 3. చారిత్రక గుణపాఠాలు

ఆధునిక కాలపు రాజ్యాంగనిర్మాణచరిత్రను పరిశీలించి కొన్ని సర్వసాధారణ పాఠాలను నేర్చుకోవచ్చును.

రాజ్యాధికార పరిణామం :

ఏ రాజ్యంలోనైనా ఒకకొత్త ప్రజాపక్షం అధికారం సంపాదించినతరవాతనే రాజ్యాంగనిర్మాణసమస్య యేర్పడుతుంది. రాజ్యాంగనిర్మాణమునకు ముందు అట్టి అధికార సంపాదనం అత్యావసరం. అన్నివిప్లవాలు-శాంతియుతములు కానీ, దౌర్జన్యయుతములుకానీ ఒక మానవసమూహము నుండి మరొక మానవసమూహమునకు అధికారం రావడం కోసమే జరుగుతవి. అంతతో ఆ సమాజములోని రాజకీయ సమస్య అనగా ఎవరిచేతులలో అధికారం ఉండవలెను అనేసమస్య పరిష్కారమవుతుంది. అంతవరకూ రాజ్యాంగ నిర్మాణమునుగూర్చిన ప్రయత్నాలుగానీ అందుకు తగిన ప్రత్యేకసంస్థను సృజించవలెనని చేసేచర్చలుగానీ నిరుపయోగములు కావడం నిశ్చయం. అవన్నీ కేవలం ఆచరణ యోగ్యములుకాని శాస్త్రవాదం కిందకువస్తవి. అధికారం లోకి వచ్చిన పక్షం వారిసిద్ధాంతములకు, ప్రభుత్వవిధానమునకు పరిపాలనాపద్ధతులకు నిలకడగల శాశ్వతరూపమిచ్చే టందుకుచేసే యేర్పాటునే రాజ్యాంగచట్టమని పిలుస్తున్నాము. ఈ అర్థంలోనే రాజ్యాంగశాసనం కొత్తప్రభుత్వానికి ప్రధానచట్ట మవుతూన్నది.

## అధికారావసరం:

అధికారం కలవారు మాత్రమే రాజ్యాంగశాసనాలను తయారుచేయగలరనే విషయం అందరికీ తెలిసినదే. ఈ అధికారం కేవలం చట్టాన్ని వ్రాయడానికి తగిన శాస్త్ర జ్ఞానమూ, నైపుణ్యమూ ఉన్నంతమాత్రాన రాదు. ఆవి రెండూ ఎంత అవసరమైనప్పటికీ, తయారైన రాజ్యాంగ చట్టాన్ని అమలుపరిచేశక్తి ఉన్నప్పుడే ఆ అధికారం కలిగి నట్లు భావించాలి. అన్ని శాసనాలకువలెనే రాజ్యాంగశాస నానికికూడా అమలుపరిచేటందుకు తగిన వెనుకబలం ఉండాలి. కావలసిన హక్కులను సంపాదించగలిగిన శక్తి లేనప్పుడు వాటిని ప్రతిపాదించినంతమాత్రంతో ప్రయో జనంలేదని సుప్రసిద్ధ తత్వవేత్త స్పినోజా చెప్పిన సుభా షితంలో యెంతయినా సత్యముంది. ఆహారాన్ని జీర్ణించుకో గలవారే దానిని ఆరగించడానికి అర్హులు. స్పినోజా చెప్పిన మాట నిజమని చరిత్ర ఋజువుచేస్తూన్నది. ఆధునికకాలంలో జరిగిన అనేకవిప్లవాలలో ప్రజాస్వామ్యమునందు విశ్వాసం గల పక్షాలవారు అధికారం సంపాదించుకోగలిగినారు. కాబట్టే ప్రపంచకంలోని చాలా దేశాలలో బాధ్యతాయుత ప్రజాస్వామ్య రాజ్యాంగశాసనాలను నిర్మించి చక్కగా అమలుపఱచడానికి సావకాశం కలిగింది. ఫ్రాంకుఫర్టు పరి షత్తువారు 1848 లో వ్రాసిన జర్మను లిబరల్ రాజ్యాంగ చట్టం భగ్నమవడానికి కారణం, దానిలోని లోపాలుకాదు. పరిషత్తువారిపని పూర్తి అయ్యేవరకే విప్లవ వ్యతిరేక

శక్తులు బలపడి ప్రజాస్వామ్యఉద్యమాన్ని పూర్తిగా అణచివేయగలిగినవి. మాటవచ్చింది గనుక ఈ విషయంలో మరొక సంగతికూడా చెప్పవలసిఉంది. రాజ్యాంగచట్టాలను అమలుపరిచేటందుకు తగినంత సైనికదళమూ పోలీసు బలమూ ఉన్నంతమాత్రాన చాలదు—ఇవి ఎప్పుడూ ప్రతి చట్టానికీ వెనుక ఉండనేఉంటవి. ప్రజాభిప్రాయము, అనుకూలంగా ఉండి ప్రజల మద్దతుఉండాలి. అంటే నైతికబలంకూడా ఉండాలన్నమాట. ఇందు కుదాహరణంగా ఒక సంగతి వినండి! 1935 ఇండియాచట్టాన్ని తయారుచేయడంలో వెచ్చించినంత శక్తిగాని, కాలంగాని, బుద్ధివిశేషంగానీ, బ్రిటిష్‌పార్లమెంటులోని ఇంకే చట్టానికీ, ఎన్నడూ వినియోగింపబడలేదని సీమలోని రాజకీయధురంధరులు పదేపదే అంటూంటారు, కాని ఆ చట్టాన్ని వారు పూర్తిగా అమలుపరచ లేకపోయినారు. దానిని ఆచరణలోకి తీసికొనివచ్చేటందుకు తగినంత సైనికబలం లేకనా వారికి! కాదు, ప్రజాభిప్రాయం వ్యతిరేకంగా ఉండడమే అందుకు కారణం.

తాత్కాలిక ప్రభుత్వాలు :

అధికారాన్ని చేజిక్కించుకొనేటందుకు చేసేప్రయత్నాలు జయప్రదమైనప్పుడెల్ల శాసనమునకుకూడా అతీతమైన ఒక తాత్కాలికప్రభుత్వం అమలులోకి వస్తుంది. అలా అమలులోకి వచ్చిన ప్రభుత్వమే నూతనరాజ్యాంగనిర్మాణమునకు ఏర్పాట్లుచేస్తుంది. రాజ్యాంగచట్టాలను ఎలా తయారుచేయాలి? ఏసంస్థ వాటిని తయారుచేయాలి? ఆ

సంస్థయొక్క స్వరూపనిర్మాణము ఎలాఉండాలి? దాని కార్యవిధానమేమిటి? అనేవిషయాలన్నిటినిగూర్చి తుది నిర్ణయం చేయగలిగిన దీతాత్కాలికప్రభుత్వాలే. అమెరికా స్వాతంత్ర్యసంగ్రామంలో 13 రాజ్యాలపైన (Common-wealth) తగినంత అధికారాన్ని సంపాదించిన అమెరికా ఖండ కాంగ్రెసు, శాసనములకు అతీతమైన ఒకసంస్థ. అదే కాన్ ఫెడరేషన్ నియమాలనువ్రాసి 1787 లో సంయుక్త రాష్ట్రాల ఫెడరల్ రాజ్యాంగవిధానాన్ని తయారుచేసే టందుకు రాజ్యాంగపరిషత్తును సమావేశపరిచింది. ఇది పైన పేర్కొన్నవిషయానికి నిదర్శనం. ఈ పదమూడు రాజ్యాలలో ప్రతిఒక్కదానిలోనూకూడా పైన పేర్కొన బడిన మోస్తరు తాత్కాలికప్రభుత్వాలే, రాజ్యాంగ నిర్మాణపరిషత్తులనుసమావేశపఱచడంకానీ, లేదా రాజ్యాంగ చట్టాలను నిర్మించడంకానీ చేసినవి. ప్రతిదేశంలోనూ విప్లవ కాలానంతరం, రాజ్యాంగశాసనాలు క్రొత్తగా తయారు చేయబడిన సందర్భంలో తాత్కాలికప్రభుత్వాలావిషయ ములో వహించిన పాత్రనుగూర్చి చరిత్రలో అనేకనిదర్శన ములు కలవు.

**రాజ్యాంగనిర్మాణపరిషత్తుయొక్క స్వభావకార్యకలాపములు :**

అయితే రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు ఒక్కసారి సమావేశపఱుపబడగానే దానికి సర్వస్వతంత్రంగా వ్యవహ రించే హక్కువస్తుంది, దాని కార్యవిధానాన్ని అదే స్వయంగా నిర్ణయించుకొంటుంది. సాధారణంగా అది తాత్కాలిక

ప్రభుత్వంతో సంప్రతించిగానీ, దానిసహాయంతోగానీ వ్యవహరిస్తూఉంటుంది. అయినప్పటికీ ఇంతమాత్రంతో దాని స్వాతంత్ర్యమే మాత్రమూ కుంటువడదు. తనంతటతాను స్వతంత్రంగా వ్యవహరించుకొనే అధికార మాపరిషత్తుకు లేకపోయినట్లయితే అది నిజమైన స్వతంత్రరాజ్యాంగాన్ని తయారుచేయనేలేదు. ఆసభలో జరిగే వాదోపవాదాలు అతిస్వేచ్ఛగా ఉండాలి. అన్నిసమస్యలనూ సమగ్రంగా పరిశీలించినపిమ్మటనే అక్కడ నిర్ణయాలు జరగాలి. బయటి వారి అధికారానికి లోబడిఉన్న రాజ్యాంగపరిషత్తు, ప్రభుత్వాన్ని అదుపాజ్ఞలలో ఉంచదగిన రాజ్యాంగచట్టాన్ని ఎన్నటికీ తయారుచేయలేదు. నియంతలుకానీ నిరంకుశాధికారులుకానీ నిర్మించిన రాజ్యాంగ చట్టమును లాంఛనంగా అంగీకరించే ప్రజలవోట్లు స్వతంత్ర రాజ్యాంగ నిర్మాణపరిషత్తులలో జరిగే నిజమైన చర్చలకు సరిపోలవు. ప్రొఫెసర్ సి. జె. ఫ్రెడ్రిచ్ ఇలా అన్నాడు: ''సమకాలిక నియంతృత్వాలు ఏర్పాటుచేసిన ఎన్నికలకు సరియైన విలువకట్టవలెనంటే ఈ వాక్స్వాతంత్ర్య సమావేశస్వాతంత్ర్యములను ముఖ్యంగా గమనించాలి. హిట్లరు అధ్యక్షపదవినిపొంది వోట్లు తీసికొన్నవిధానం, నెపోలియన్ అవలంబించినవిధానము వలెనే వట్టిబూటకం. సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగచట్టమంగీకరింపబడిన పరిస్థితులకూ ఆ పరిస్థితులకూ పూర్తిగా భేదమున్నది. ఇక్కడ రాజ్యాంగచట్టమును గూర్చి వోట్లు తీసుకొనే ముందు ప్రజలలో ఎంతో

చర్చ జరిగింది. ఎన్నో తీవ్ర వాదోపవాదాలు జరిగినవి. అధిక సంఖ్యాకులు మార్పును అంగీకరించే టంతవరకూ, అప్పటికి అమలులోనున్న కాన్ ఫెడరేషన్ ప్రభుత్వం రద్దు కాలేదు. అదే విధంగా 1848 సం॥ స్విట్జర్లాండు రాజ్యాంగ చట్టంకూడా, రాజ్యాంగ నిర్మాణసభ సరిగా పనిచేయడం వలననే యేర్పాటయింది. ఈ రెండు రాజ్యాంగ చట్టాలూ ప్రభుత్వాల ఫెడరేషనును (Federation of Governments) రద్దుచేసి ఫెడరల్ ప్రభుత్వాన్ని స్థాపించడానికి సావకాశం కల్గించినవి. ఈ రెంటికీగల ఈ పోలిక తెలుసుకోదగినది.''

రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు రాజ్యాంగ శాసనాన్ని ప్రత్యక్షంగా తయారు చేస్తుందనడం అంతపనినీ అదే నిర్వహిస్తుందనే అర్థం లోకాదు. నిజానికి అనేకమంది మనుష్యులూ, అనేక సంస్థలూ కలసి ఒక రాజ్యాంగచట్టాన్ని తయారు చేస్తారు. ఇందులో కొందరు రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుకు బయటివారుగాకూడా ఉండవచ్చును. నిజంగా రాజ్యాంగ చట్టమును నిర్మించినవారిని తెలుసుకోవడం తేలిక కాదు. రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుతో దూరపు సంబంధం కల అనేకమంది ప్రజానాయకులూ అనేక ప్రజా పక్షాలూ తయారుచేసిన ప్రణాళికలనుగూర్చియే—చాలా సందర్భాలలో—రాజ్యాంగ నిర్మాణ పరిషత్తులో చర్చలు జరుగుతూంటవి. పరిషత్తులోకూడా పలుకుబడిగల నాయకులూ చిన్న చిన్న ప్రత్యేక కమిటీలవారే నిజమైన పని చేస్తూన్నారు. రాజ్యాంగ చట్టానికి పునాదిగా ఉండవలసిన పెద్దపెద్ద సిద్ధాం

తాలూ, తయారైన చిత్తు చట్టమూ మాత్రమే నిండు పరిషత్తులో చర్చకు వస్తవి. ఇందులో ఏమీ వింతగానీ వినోదంగానీ లేదు. ఆధునిక కాలంలో అన్ని ప్రజాస్వామ్య పార్లమెంటులూ శాసనసభలూ కూడా ఇలాగే వ్యవహరిస్తూన్నవి. ప్రజాస్వామ్య ప్రభుత్వ విధానానికి సంబంధించిన శాఖలలో ఈ పార్లమెంటొక శాఖ. వోటర్లు, రాజకీయకక్షులు, స్టాండింగు కమిటీలు, సెలెక్టు కమిటీలు, మంత్రివర్గాలు—వీటన్నిటికీ వేటిపని వాటికున్నది. అవన్నీ తమతమ పనులను సక్రమంగా నిర్వహిస్తేనే పార్లమెంటులు సమర్థతతో పని చేయగలుగుతవి. కాబట్టి దేశంలోని వివిధ విధాల అభిప్రాయాలకు ప్రాతినిధ్యం వహించేటందుకు రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు పెద్దదిగా ఉండవలసి వచ్చే యెడల యెవ్వరూ భయపడ నక్కరలేదు. పైకి చూడడానికి యెంత పెద్దదిగా ఉన్నప్పటికి, దాని కార్యవిధానమును సరిగా యేర్పాటు చేసినయెడల, సరియైన నిర్ణయములను చేయడంలో ఆ సభ యొక్క సమర్థత యెన్నటికీ కొఱవడదు.

ఆధునిక రాజ్యాంగ పరిషత్తులలో కొన్నింటి నిర్మాణమునూ కార్యవిధానమునూ పరిశీలించినయెడల ఈ విషయం స్పష్టంగా అర్థమవుతుంది.

## అమెరికా సంయుక్త రాష్ట్రాలలో :

కాన్ ఫెడరేషను మహాసభ (Congress of the Confederation) వివిధ రాజ్యాలకు పంపిన సందేశానుసారంగా, అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగ

చట్టాన్ని తయారుచేసిన ఫెడరల్ కన్వెన్షన్ సమావేశ మయింది. 1787 మేలో ఫిలడెల్ఫియాలో కూడిన ఈ సభలో-వాషింగ్టన్, బెంజమిన్ ఫ్రాంక్లిన్, మాడిసన్, హామిల్టన్ లవంటి ప్రముఖ రాజకీయ నాయకులు ప్రతినిధులుగా ఉన్నారు. జార్జివాషింగ్టన్ ఆసభకు ఏకగ్రీవంగా అధ్య క్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ఆ మహాసభా చర్చలనూ చర్యలనూ సరిగా రిపోర్టు చేసేటందుకు కొక కార్యదర్శి ఆయన సూచన మీదనే ఎన్నుకోబడ్డాడు. కార్యవిధానమునుగూర్చిన నియమాలను తయారుచేసేందుకు ముగ్గురు ప్రతినిధులతో ఒక కమిటీ ఏర్పాటు చేయబడింది. వారు వ్రాసిన నియమాలను పరిషత్తువారు అంగీకరించారు. 13 రాజ్యాలలోనూ ఏడు రాజ్యాలు హాజరయితే 'కోరం' అయినట్లుగా భావించవలె ననీ, ప్రతిరాజ్యానికీ ఒక్కొక్క వోటు వుండవలెననీ, ఆ రాజ్యాలలో అధిక సంఖ్యాక రాజ్యాలు ఒప్పుకొన్న విష యాలే పరిష్కారమైనట్లుగా అనుకోవలెననీ నిర్ణయింప బడినది. సమావేశాలు చాలా రహస్యంగా జరుగవలెననీ, వాటిలోని విషయాలు బయటకు తెలియనీయరాదనీ కూడ తీర్మానింపబడినది. వివాదగ్రస్తములైన అనేక సమస్యలు జయప్రదంగా పరిష్కారం కావడానికి, సమావేశాలూ చర్చలూ రహస్యంగా జరగడమే కారణమని చరిత్రకారు లందఱూ ఏకగ్రీవంగా శ్లాఘించారు. ప్రొఫెసర్ మాక్ లాఫ్లిన్ (Mc. Langhlin) ఇలా అన్నాడీ విషయంలో, 'ఈ రహస్యానికి కారణం అందరికీ తెలిసిందే. అందువల్ల సభ్యులు మనస్సులో ఉన్నది దాచకుండా మాట్లాడడానికి

వీలయింది; నిర్ణయం కాని ప్రతిపాదనలు, అపరిపక్వములైన అభిప్రాయాలు పత్రికలలో పడలేదు; అసంపూర్ణమయిన వాక్యాన్ని ఆధారంగా చేసుకొన్న అనవసరపు రాగద్వేషాలకూ, అభ్యంతరాలకూ అవకాశం కలుగలేదు; కాన్ఫెడరేషన్ సూత్రాలను సవరించి వాటిని ఇంకా ఎక్కువ చేయవలెనని నాయకులు మొట్టమొదట అనుకొన్నప్పటికీ, తుదకు వారవలంబించిన ప్రణాళిక అసలు సూత్రాలకే ఎంతో భిన్నంగా ఉన్నది. ఈ సంగతి ముందుగా బయట తెలిసిఉండినట్లయితే ప్రజలలో వారికి భయం కలిగించేటంత వ్యతిరేకభావం ప్రకటింపబడిఉండేది.' తీవ్ర వాద ప్రతివాదాలకు అవకాశంగల సమస్యలను పరిష్కరించ వలసినప్పుడు రహస్యంగా చర్చించుకోవడం చాలా ఉత్తమం. అందువలననే దక్షిణ ఆఫ్రికా యూనియను రాజ్యాంగాన్ని నిర్మించిన జాతీయ పరిషత్తు అంత రహస్యంగా సమావేశం కావలసి వచ్చింది.

కన్వెన్షన్ వారు మూడు ముఖ్యప్రణాళికలను గూర్చి విచారణచేశారు. అందులో ఒకటి వర్జీనియా ప్రతినిధులు ప్రతిపాదించిన రాండోల్ఫు ప్రణాళిక. రెండవది న్యూజెర్సీ నుండి వచ్చిన ప్యాటర్సన్ ప్రణాళిక. మూడవది హ్యామిల్టన్ ప్రణాళిక. ఇవన్నీ నిండు కన్వెన్షన్ కమిటీలలో చర్చించబడినవి. రాజ్యాంగ శాసనం ఉండవలసిన విధానాన్ని గూర్చి స్థూలం తీర్మానాలు చేయబడినవి. వాటి కనుగుణంగా చట్టాన్ని వ్రాసేటందుకు వివరాలను

తయారుచేయడానికొక కమిటీ నిర్మింపబడింది. ఆ ప్రకారం తయారయిన చిత్తు చట్టంలోని ప్రతి విషయమూ ఒకదాని తరువాత ఒకటి కన్వెన్షన్‌లో చర్చకు వచ్చింది. కన్వెన్షన్ వారి నిర్ణయములను సరియైన శైలిలో వ్రాయడానికి మరొక కమిటీ యేర్పాటుచేయబడింది. వారు వ్రాసిన తుది ప్రణాళికను కన్వెన్షన్ వారు తిరిగి చర్చించి రాజ్యాంగ చట్టము యొక్క చిట్టచివరి స్వరూపాన్ని నిర్ణయించారు. నాడు కన్వెన్షన్ వారు ఎదుర్కోవలసి వచ్చిన వివాదగ్రస్త సమస్యలకున్నూ నేడు భారతదేశ మెదుర్కొనవలసిన సమస్యలకున్నూ చాలా పోలిక ఉంది. అసలు యూనియను ఉండాలా అక్కరలేదా? ఉంటే ఒక యూనియనే ఉండాలా అనేకం ఉండవచ్చునా? కాన్ఫెడరేషను కావాలా ఫెడరేషను కావాలా? అనే సమస్యలలా ఉండగా, అల్ప సంఖ్యాక అధిక సంఖ్యాక సంఘములనుగూర్చి, మెజారిటీల అధికారము మైనారిటీల రక్షణలనుగూర్చి, చిన్నచిన్న రాజ్యాల వారి మనోభావముల కనుగుణంగా పెద్ద రాజ్యాలను విభజించడమునుగూర్చి ఫెడరల్ కన్వెన్షన్ వారు ముఖ్యంగా చర్చించవలసి వచ్చింది. వాషింగ్టన్ ఫ్రాంక్లిన్‌లవంటి సుప్రసిద్ధ రాజకీయ చతురుల పలుకుబడివలననూ, కమిటీల కార్యకలాపమువలననూ, ప్రతినిధులందరూ వాద ప్రతివాదములను విని తమ పూర్వపు అభిప్రాయాలను మార్చుకోవడానికి సంసిద్ధంగా ఉండడం వలననూ, సంతృప్తికరమైన రాజ్యాంగచట్టమును వ్రాసి కన్వెన్షన్ విజయం పొందడానికి వీలయింది.

జర్మనీలో :

1918–19 నాటి జర్మనీలో అధిక సంఖ్యాకులైన సోషలిస్టు పార్టీ వారు ప్రతి కక్షులందఱినీ పడగొట్టి అధికారం లోకి వచ్చి ఆరుగురు కమీషనర్లతో తాత్కాలిక ప్రభుత్వాన్ని స్థాపించారు. ఆ ప్రభుత్వమే రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుయొక్క ఎన్నికను సక్రమంగా నడిపేటందుకు చట్టం చేసి ఆ ప్రకారం ఎన్నికలను జరిపింది. ఆ రాజ్యాంగ పరిషత్తు 1919 ఫిబ్రవరిలో వీమారులో సమావేశమయింది. అప్పుడు జర్మనీ దేశంలో న్యాయసమ్మతమైన నూతన ప్రభుత్వవిధానమును స్థాపించగల ప్రధాన శాసనాన్ని రచించడానికి, ఆ రాజ్యాంగ నిర్మాణసభ సర్వాధికారములుగల స్వతంత్ర సంస్థ అని కవున్సిల్ ఆఫ్ కమీషనర్ల అధ్యక్షుడు హార్ ఇబర్టు (Herr Ebert) తన ప్రారంభోపన్యాసంలో ఉదాహరించాడు. ఆ సభ తాత్కాలిక రాజ్యాంగచట్టాన్ని చేయ పూనుకొని, అంతకు పూర్వం శాసనానికి అతీతంగా ఉన్న తాత్కాలిక ప్రభుత్వాన్ని శాసనబద్ధం కావించింది. జర్మను జాతీయ ప్రజా స్వామ్యమునకు (National Republic) ఆ సభ హార్ ఇబర్టును మొదటి అధ్యక్షుడుగా ఎన్నుకొన్నది. ఆయన తాత్కాలిక రాజ్యాంగ చట్టంలోని నియమాల కనుగుణంగా జాతీయ మంత్రివర్గాన్ని నిర్మించుకొన్నాడు.

రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు సమావేశం కాక పూర్వమే తాత్కాలిక ప్రభుత్వంవారు ప్రొఫెసరు ప్రూసును (Preuss) అంతరంగిక కార్యదర్శిగా నియమించి నూతన

రాజ్యాంగ చట్టానికి ముసాయిదా వ్రాయడానికి అధికార మిచ్చారు. ఆయన ప్రొఫెసరు మాక్సు వెబరు సహాయంతో దానిని తయారుచేశారు. తరువాత ఈ చిత్తుచట్టంలో కొన్ని మార్పులు చేయబడినవి. ఈవిధంగా మార్పుచెందిన చట్టమే రాజ్యాంగ నిర్మాణసభ సమావేశమైన రోజుననే దానిలో చర్చకువచ్చింది. దానున్న జర్మను రాజ్యము యూనిటరీపద్ధతిని (Rech) ఒక్కటిగా నుండవలెననడమే ఆచట్టములోని ముఖ్య లక్షణం. 1848-49 లో ఫ్రాంకుఫర్టు పార్లమెంటు నిర్మించిన రాజ్యాంగ చట్టమునుండి ఇంగ్లాండు, అమెరికా సంయుక్త రాజ్యాల యొక్కయూ, స్విట్జర్లాండు ఫ్రాన్సు దేశాల యొక్కయూ రాజ్యాంగచట్టముల నుండి అనేక విషయాలనీ చట్టం అనుకరించింది.

నూతన జర్మను రాజ్యాంగములోని ఐక్యతా లక్షణాన్ని ప్రత్యేకరాజ్యాలకు ప్రత్యేకహక్కులు కావలెననే వారు యెక్కువగా వ్యతిరేకించారు. కాబట్టి తాత్కాలిక ప్రభుత్వమువారా చట్టాన్ని రాజ్యాలప్రతినిధులు నూరు మందిగల ప్రత్యేకసభకు పంపించడం ఉచితమనుకొన్నారు. ఈ ప్రత్యేకసభవారు ఆ చట్టాన్నిగూర్చి సమాలోచన చేయ డాని కొక కమీషనును వేశారు. ఈ కమిషను సభ్యులనుండి ఇంకొక చిన్నకమిటీ యేర్పడి ఆ చట్టాని సమగ్రంగా పరీక్షించి అనేకవిషయాలలో దానిని మార్పుచేసింది. తరువాత దానిని తాత్కాలిక ప్రభుత్వమువారు, తాత్కాలిక రాజ్యాంగశాసనం క్రింద పనిచేస్తూన్న రాజ్యాలసభకు (House of States) పంపించారు. దానిఫలితంగా అక్కడ

ప్రాథమిక చిత్తుచట్టం తయారుచేయబడినది. అదే చిట్టచివరికి రాజ్యాంగనిర్మాణ పరిషత్తుకు పంపబడింది.

చిత్తుచట్టాన్ని మొదటిసారి చర్చించి పిమ్మట దానిని పరిశీలించడానికి అన్ని రాజకీయ పక్షాలకూ ప్రాతినిధ్యం వహించగల 28మంది సభ్యులతో పరిషత్తువారొక కమిటీని నియమించారు. ఆ కమిటీవారా ముసాయిదా చట్టాన్ని చాలావరకు మార్చి తిరిగి పరిషత్తువారికి పంపించారు. వారు నిండు పరిషత్సమావేశములో దానిని చర్చించి ఇంకా అనేకమార్పులు కావించారు. ఈ విధంగా మార్చబడిన చట్టమే చిట్టచివరకు జర్మను ప్రజాస్వామ్యరాజ్యాంగ శాసనంగా అంగీకరించబడింది. చిత్తుచట్టం మూడవసారి చర్చకు వచ్చి తుదకు వోట్లుతీసికొనబడినప్పుడు చట్టానికి 262 మంది అనుకూలంగానూ, 75 మంది ప్రతికూలంగానూ ఒక్కరు తటస్థంగానూ ఉన్నారు. జర్మను జాతీయవాదులు, జర్మను ప్రజాపక్షమువారూ, ఇండిపెండెంటు సోషలిస్టులూ, బవేరియన్ రైతుసంఘంవారు (Bavarian Agrarian Association) బవేరియన్ ప్రజాపక్షంలో ఒకసభ్యుడూ చట్టానికి వ్యతిరేకంగా వోటుచేశారు.

## ఆస్ట్రేలియాలో:

ఆస్ట్రేలియా రాజ్యాంగనిర్మాణోద్యమం యావత్తూ క్రమపరిణామం పొందిఉండడంచేత నూతన ఫెడరల్ కామన్ వెల్తు రాజ్యాంగచట్టాన్ని నిర్మించే యేర్పాట్లకోసం తాత్కాలిక ప్రభుత్వస్థాపనమనే ప్రశ్నయే ఉదయించలేదు.

కాని అక్కడకూడా ఫెడరల్ కామన్వెల్తు రాజ్యాంగవిధా నానికి వ్యక్తిపరంగా అనుకూలంగాఉన్న రాజ్యాంగవేత్తలు ప్రజాభిప్రాయ మందుకనుగుణంగా పరిణతి పొందేవరకూ వేచిఉండవలసి వచ్చింది. ఫెడరల్ రాజ్యాంగమును తయారు చేసే కన్వెన్షన్‌కు (రాజ్యాంగనిర్మాణసభకు) ప్రతినిధుల నెన్నుకోవడానికి ప్రజ లిష్టపడిననాడే ఆ ఉద్యమానికి నిజమైనబలం చేకూరింది.

కన్వెన్షన్ సమావేశమైన కాలనికి ప్రధానమంత్రి యైన కింగ్‌స్టన్‌ను, కన్వెన్షన్‌కు అధ్యక్షుడుగానూ, బ్లాకు మూరును కార్యదర్శిగానూ మొదటి సమావేశంలోనే ఎన్ను కొన్నారు. ఆ సభకు నాయకుడుగా బార్టన్‌ను ఎన్నుకొని, సాధారణంగా ఫెడరల్ రాజ్యాంగవిధానమునకు కావలసిన ముఖ్యసిద్ధాంతాలనుప్రతిపాదిస్తూ అ నేకతీర్మానాలను ప్రవేశ పెట్టవలసినపని ఆయనకు అప్పగించారు. ఆప్రకార మాయన చే ప్రవేశపెట్టబడిన తీర్మానాలపైన ఏడురోజులు చర్చజరిగి 1897 మార్చి 31వ తేదీని అవి ఆమోదింపబడినవి.తరువాత ఆ సభలోని సభ్యులందరూ మూడు కమిటీలుగా ఏర్పడ్డారు. ప్రతి ప్రతినిధివర్గమునుండీ నలుగురుసభ్యులతో ఒక రాజ్యాంగ నిర్మాణసంఘం (Constitutional Committee) యేర్పాటు చేయబడింది. రాజ్యాంగనిర్మాణసభ యెలా ఉండాలి, దాని అధికారాలేమిటి? అది యేమిపనులు చేయాలి? అనే విష యాలను నిర్ణయిస్తూ చిత్తురాజ్యాంగశాసనాన్ని తయారు చేసి రాజ్యాంగనిర్మాణ పరిషత్తుకు పంపించడం ఆ సంఘం

నిర్వర్తించవలసిన పని. రెండవది ఆర్థికసంఘం. ఇది ప్రతి ప్రతినిధివర్గము నుండీ ముగ్గురుసభ్యులతో యేర్పాటయింది. ఆర్థికవిధానము, పన్నులు, రైల్వేలు, వాణిజ్యనిబంధనలు- వీటన్నిగూర్చి ఆలోచించడం దీనిపని. మూడవది ప్రతి ప్రతి నిధి వర్గమునుండీ ఇరువురుసభ్యులుగల న్యాయశాఖాసంఘం. ఫెడరల్ న్యాయ శాఖాస్థాపనమునకు సంబంధించిన నిబంధ నలను గూర్చి ఆలోచించడం దీనిపని. వివిధరాజ్యాల ప్రధానులు ప్రతికమిటీలోను అధికారరీత్యా సభ్యులయినారు. ఏప్రిల్ 8 నాటికి ఈ కమిటీలన్నీ తమపనిని ముగించినవి. ఆర్థిక న్యాయశాఖాసంఘాలు, రాజ్యాంగనిర్మాణసంఘానికి తమ నివేదికలను పంపగా, రాజ్యాంగ నిర్మాణసంఘం చిత్తు చట్టానికి ముసాయిదా వ్రాయడానికి ముగ్గురుగల ఒక ఉప సంఘాన్ని నియమించింది. ఆ ముసాయిదా ఏప్రిల్ 12 నాటికి కన్వెన్షనుకు చేరింది. సభానాయకుడుగా బార్టన్ ఆ బిల్లును వివరించి చెప్పినాడు. అంతట ఆ కన్వెన్షన్ యావత్తూ ఒకకమిటీగా మారింది. ఆర్థికబిల్లులు, సమాన ప్రాతినిధ్యము, నౌకాయానములకు వీలైన నదుల యాజ మాన్యము మొదలగు వివాదగ్రస్త విషయములను గూర్చి అనేక తీవ్రచర్చలు జరిగినవి. ఏప్రిల్ 22 న కన్వెన్షనుకు ఆ బిల్లు పంపబడింది. మఱునాడాబిల్లును కన్వెన్షన్ అంగీ కరించింది.

వివిధవలసరాజ్యాల శాసనసభలు సూచించిన సవర ణల కనుగుణంగా ఆ చిత్తురాజ్యాంగచట్టాన్ని పునర్విచారణ

చేయుటకు సెప్టెంబరు రెండవ తేదీని కన్వెన్షన్ తిరిగి సమావేశమయింది. 24 సెప్టెంబరున కూడా తిరిగి కన్వెన్షన్ సమావేశము వాయిదా వేయబడింది. 1898 జనవరి 20 ని మెల్‌బోర్న్‌లో చివరసారి కన్వెన్షన్ సమావేశమయింది. కన్వెన్షన్ వారు కమిటీగా కూర్చొని, యావత్తుబిల్లునూ ఆమూలాగ్రంగా పునర్విచారణచేశారు. ముసాయిదాకమిటీ వారు దానిని సవరించారు. చిట్టచివరకు 1898 మార్చి 16వ తేదీని ఈ సవరణబిల్లును, కన్వెన్షన్ వారు అంగీకరించారు. తరువాతకూడా కొన్నిచిక్కులు తటస్థించినవి. కాని 1899లో ప్రధానామాత్యులందఱు సమావేశమై వాటిని విచారించి సర్దుబాటుచేసుకొన్నారు. కాబట్టి రాజ్యాంగచట్టాలను వ్రాయడంకానీ సవరించడంకానీ చాలావరకు ప్రసిద్ధ రాజకీయ నాయకులమీదనూ ప్రత్యేక కమిటీలమీదనూ ఆధారపడి ఉన్నదనడానికిదే నిదర్శనము.

## ఐర్లాండులో

ఇంగ్లాండు ఐర్లాండు దేశాలు చేసుకొనిన సంధిని ఐరిష్ పార్లమెంటు అంగీకరించగానే, ఐర్లాండు దేశపు తాత్కాలిక ప్రభుత్వము ఐరిష్ ఫ్రీస్టేటుయొక్క రాజ్యాంగ నిర్మాణ కార్యక్రమమునకు దొరకొన్నది. పదిమంది సభ్యులతో కూడిన రాజ్యాంగ నిర్మాణ సంఘాన్ని యేర్పాటు చేసి, తాత్కాలిక ప్రభుత్వానికి నాయకుడైన మైకేలు కాలిన్సును దానికి ఛైర్మన్‌గా చేసింది. రాజ్యాంగ చట్టపు చిత్తుముసాయిదాను తయారు చేసేటందుకు ఈ సంఘము

వారికి ఒక నెల వాయిదాయిచ్చింది. తూర్పు మధ్య యూరోపు దేశాల ప్రజాస్వామ్య రాజ్యాంగాలను చాలా వరకు ఆధారంగా చేసుకొని ఆ సంఘంవారు నిజానికి మూడు ప్రణాళికలను నిర్మించారు. ఈ ప్రణాళికలనుండి తాత్కాలిక ప్రభుత్వము వారొక చివరి ముసాయిదాను వ్రాసి, తమకూ బ్రిటనుకూ జరిగిన సంధి కది అనుగుణంగా ఉన్నదా లేదా అనే విషయాన్ని సంప్రతించుకోవడానికి బ్రిటిష్ మంత్రివర్గము దగ్గరకు లండను తీసికొని వెళ్లినారు. బ్రిటిష్, ఐరిష్ ప్రభుత్వాల న్యాయ శాఖోద్యోగులు భయులూ అంగీకరించిన ప్రకారం, చిట్టచివరి చిత్తు ముసాయిదా, సరిగా రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుకు ఎన్నికలు జరిగే 1922 జూన్ 15 వ తేదీన ప్రచురించబడింది. 1922 సెప్టెంబరు 18 వ తేదీని రాజ్యాంగ నిర్మాణచిత్తు శాసనం ప్రవేశపెట్టబడింది. సెప్టెంబరు 20, 21 వ తేదీలలో రెండవ సారి, ఆ బిల్లును చదివినపిమ్మట, ఆ పరిషత్తు కమిటీగా మారింది. అక్కడ జరిగిన చర్చల ఫలితంగా చిత్తుచట్టం చాలావరకు సవరించబడింది. ఈ విధంగా సవరించబడిన చిత్తు చట్టంలోకూడా తరువాత జరిగిన పరిషత్సమావేశములలో అనేక మార్పులు చేయబడి చిట్టచివరకు 1922 అక్టోబరు 25 వ తేదీన అంగీకరింపబడింది. ఆ పరిషత్తులో అనేక మార్పులకు గురియైనప్పటికీ, మొత్తంమీద ఈ బిల్లు నిపుణులతో కూడిన కమిటీ వారిచే తయారుచేయబడినదే. ఈ పై ఉదాహరణములను బట్టియే కాక ఇంకా అనేక

ఉదాహరణములనుబట్టి కూడా రాజ్యాంగ చట్టం, రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుకు లోపలనూ, వివిధ మార్గాలనుండిన్నీ చిట్టచివరిరూపంలో వెలువడగలదనే మాట స్పష్టము. అసలు రాజ్యాంగ పరిషత్తు మొత్తంకంటె కూడా, వ్యక్తులూ, పక్షాలూ, కమిటీలూ—వీరందరూ రాజ్యాంగ శాసనము యొక్క అంతిమరూపానికి ఎక్కువగా తోడ్పడుతూవుంటారు. కాబట్టి రాజ్యాంగపరిషత్తు ప్రాముఖ్యతను మనం ఈదృష్టితో పరిగణించాలి.



# 4. పరాధీన భారత రాజ్యాంగ నిర్మాణం

ఈస్టిండియా కంపెనీవారు, జయకారణంగా కొంత వరకూ, రాజకీయ చాతుర్యం వలన కొంతవరకూ భారత దేశంలో అధికారాన్ని సంపాదించ గలిగారు. ఇందువలన బ్రిటిష్ పార్లమెంటు ఇండియా రాజ్యాంగ చట్టాన్ని తయారు చేసే సంస్థగా పరిణమించినది. రాజకీయ దృష్టితో విచారించితే శాస్త్ర రీత్యా అస్వతంత్ర దేశాలకు ప్రత్యేక రాజ్యాంగ శాసనం ఉండనడానికి వీలులేదని వాదించ వచ్చును. కాని ప్రయోజనమేమిటి? బ్రిటిష్ పార్లమెంటు తన రాజకీయాధికారాలనూ, శాసనాధికారాలనూ చలాయించి 1773 నాటి రెగ్యులేటింగు చట్టం మొదలుకొని 1935 నాటి ఇండియా చట్టం వరకూ గల అన్ని రాజ్యాంగ చట్టాలను తయారుచేస్తూనే వచ్చింది.

పార్లమెంటు:

మొట్టమొదట మనం పార్లమెంటును గూర్చిన రెండు ముఖ్యాంశములను తెలుసుకోవాలి. పార్లమెంటు రెండు సభలతో కూడి ఉంది. ప్రతిసభా అనుకోతగినంత పెద్దదే. 18 వ శతాబ్దాంతమున భారత దేశపు మొదటి రాజ్యాంగ చట్టాన్ని నిర్మించేరోజులలో ప్రభువులసభలో 590 మంది సభ్యులుమాత్రమే ఉండిరి. 1835 నాటికి క్రమక్రమంగా ఆ సభ 750 కి పెరిగింది. రెగ్యులేటింగుచట్టం ఆమోదింప

బడినప్పుడు కామన్సుసభలో కూడ 500 పైచిలుకు సభ్యు లున్నారు. కాని 1919నాటి ఇండియాచట్టం అంగీకరింపబడే సమయానికి ఆ సభ 700 కు పైగా పెరిగింది. కాబట్టి జరిగిన రెండు శతాబ్దములలోనూ భారతదేశ రాజ్యాంగ చట్టాలను తయారుచేస్తూవచ్చిన పార్లమెంటు మిక్కిలి పెద్ద దని చెప్పడానికేమీ సందేహంలేదు. ఇది మొదటి అంశము. ఇక రెండవసంగతి యేమిటంటే ఇండియాయొక్క ప్రత్యేక అవసరాలనుగూర్చి పార్లమెంటుసభ్యులకు తెలిసినది చాలా తక్కువ. వారిలో చాలా ఎక్కువమందికి ఏమీ తెలియనే తెలియదు. భారతదేశవిషయాలలో వారికిగల అభిరుచి యెంత మాత్రమూ గమనించతగినదికాదు. వాటిని గూర్చి పార్లమెంటువారు చూపే శ్రద్ధ అంతస్థిరమైనదికాదు, వారి కా విషయాలంత బాగా తెలియనూ తెలియవు అని 1917లో మాంటేగూ పెన్నుఫర్లులు అన్నమాటలలో యెంతో యథార్థం ఉంది.

రాజ్యాంగ నిర్మాణసంస్థయే రాజ్యాంగ శాసనాన్ని చేస్తుందనడం కేవలం లాంఛనప్రాయమని ఇంతకు పూర్వమే చెప్పిఉన్నాము. నిజానికి, అనేకమంది వ్యక్తుల యొక్కయు, అనేక పక్షాలయొక్కయు, ప్రత్యేక కమిటీల యొక్కయు, ఇంకా ఇతర యేజన్సీలయొక్కయు సహా కారమువలననే రాజ్యాంగ చట్టముయొక్క అంతిమ రూపం తయారవుతుంది. రాజ్యాంగ చట్టము తయారుకావ డానికి తగిన సాధన సామగ్రిని వీరే సేకరించి యిస్తా

ఉంటారు. దీనిని మూలంగా చేసికొని రాజ్యాంగ నిర్మాణ సభ చట్టాన్ని తయారుచేస్తుంది. కాబట్టి రాజ్యాంగ చట్టము యొక్క గుణాగుణాలు చాలావరకు ఈ యేజన్సీల మీద ఆధారపడి ఉంటవి. రాజ్యాంగ చట్టము తయారైన పిదప దానిని చక్కగా అమలు పఱచేటందుకు తగిన రాజకీయ బలాన్ని, అధికారాన్ని రాజ్యాంగ నిర్మాణ సభ చేకూరు స్తుంది. ఈ సూత్రాన్ని అనుసరించి బ్రిటిష్ పార్లమెంటు వారిండియా రాజ్యాంగ నిర్మాణమునకు కావలసిన సాధన సామగ్రిని సేకరించడంలో ఉపయోగించిన యేజన్సీలు 1772 నుండి అనేక పరిణామ దశలను గడచినవని చెప్ప వచ్చును.

## ప్రత్యేక రహస్య కమిటీల పద్ధతి:

1772 నుండి 1853 వరకూ, ఇండియా విషయాలను తెలుసుకోడానికి ప్రత్యేకం రహస్య కమిటీలను పార్లమెంటు వారు నియమిస్తూ ఉండేవారు. ఇండియా రాజ్యాంగమును గూర్చి శాసనం చేయదలచుకొన్నప్పుడల్లా వారీ పద్ధతి నే తప్పకుండా అవలంభిస్తూ వచ్చారు. కాని ఆ కమిటీల సభ్యులకు కూడా మామూలు పార్లమెంటు సభ్యునికి తెలిసిన దానికంటె ఇండియాను గూర్చి ఎక్కువ ఏమీ తెలియదు. అయితే వారు పుస్తకాలద్వారా కొంతవరకూ, ఈస్టిండియా కంపెనీవారికింద ఇండియాలో నౌకరీ చేసి సీమకు తిరిగి వెళ్లినవారు చెప్పిన సాక్ష్యాలద్వారా కొంత వరకూ, భారతదేశాన్ని గూర్చి తెలుసుకొంటూ ఉండే

వారు. కాబట్టి ఒక విధంగా ఇండియాలో బ్రిటిష్ ప్రభుత్వము వారు చేసిన రాజ్యాంగ శాసనముల స్వరూప నిర్మాణములకు చాలావరకు ఐ. సి. యస్. ఉద్యోగులే మొదటి నుండీ ఎక్కువగా బాధ్యత వహించినారని చెప్పవచ్చును. ఇంతేగాక కోర్టు ఆఫ్ డైరెక్టర్లతోనూ, తదితర స్వప్రయోజన పరులతోనూ కూడా కమిటీసభ్యులు సంప్రదిస్తూండే వారు. రాజకీయముల వత్తిడియే ఎల్లప్పుడూ వీరిపైన ఎక్కువగా పనిచేస్తూ వచ్చింది.

1773 నాటి రెగ్యులేటింగు చట్టానికి ముందు జనరల్ బర్గాయిన్ (General Burgoyne) అధ్యక్షతక్రింద 33 మంది సభ్యులుగల ప్రత్యేక ఉపసంఘంవారు ఈస్టిండియా కంపెనీ వ్యవహారములను గూర్చి విచారణచేశారు. తరువాత 13 మంది సభ్యులుగల రహస్య ఉపసంఘంవారు చేసినపని పై విచారణకు అనుబంధంగా చేర్చబడింది. మొదటి ప్రత్యేక ఉపసంఘంవారు 12 నివేదికలనూ, రెండవ రహస్య ఉపసంఘంవారు ఆరు నివేదికలనూ తయారుచేశారు. వీటిని బట్టియే 1773నాటి రెగ్యులేటింగు చట్టం ఆమోదింపబడింది. ఇండియాలోని న్యాయపరిపాలనను గూర్చి విచారణచేసిన సెలెక్టుకమిటీ నివేదికఫలితంగా 1781 లో బెంగాల్ సుప్రీమ్ కోర్టు నిర్మాణ సవరణచట్టం ఆమోదింపబడింది. 1781 లో నియోగింపబడిన సెలక్టుకమిటీ సభ్యులున్నూ, రహస్యకమిటీ సభ్యులున్నూ పంపిన పెద్దపెద్ద నివేదికలే 1783 లో ఫాక్సు వ్రాసిన ఇండియాబిల్లుయొక్కయూ, 1784 లో పిట్టువ్రాసిన

ఇండియాచట్టముయొక్కయు స్వరూపస్వభావాలకు చాలావరకు మూలములైనవని చెప్పవచ్చును. ఈస్టిండియా కంపెనీ జనరల్ కోర్టువారితోనూ, డైరెక్టర్లబోర్డుతోనూ సంప్రదించి తన బిల్లును తయారుచేసినందులకు పిట్టుచాలాగొప్పగా చెప్పుకొన్నాడు. ఈస్టిండియాకంపెనీవారి ఛార్టరును 1813 లో పునరుద్ధరించేటందుకు, 1808లోనే ఒక సెలెక్టుకమిటీని పార్లమెంటువారు నియమించారంటే, సెలెక్టుకమిటీల విచారణల కానాడెంత ప్రాముఖ్య మీయబడిందో స్పష్టమవుతూన్నది. ఈ సెలక్టుకమిటీ నాలుగుసంవత్సరాల కృషిఫలితంగా అనేకనివేదికలను తయారుచేసింది. అలాతయారైన ఐదవ నివేదికలో ఇండియాలో ఆనాటి పోలీసు, న్యాయశాఖల పనిని గూర్చి, భూమిహక్కుల విధానమును గూర్చి వ్రాయబడింది. నేటికినీ ఆ విషయాలలో అది ప్రమాణగ్రంథంగా పరిగణింపబడుతూన్నది. ఇదేవిధంగా రాజ్యాంగనిర్మాణంలో ముఖ్యమైన మార్పులను కలిగించిన 1833 నాటి ఛార్టరు చట్టంకూడా పార్లమెంటరీవిచారణ పూర్ణంగా జరిగిన పిమ్మటనే తయారుచేయబడింది. 1853 ఛార్టరుచట్టం విషయంలో కూడా సరిగా యిలాగే జరిగింది. ఈ సందర్భంలో మరొకసంగతి చెప్పవలసి ఉంది. ఆ కాలంలో భారత రాజ్యాంగ చట్టములను పార్లమెంటులో చర్చించే ముందు ఇండియాప్రభుత్వముతో ఆలోచించడం ముఖ్యమని బ్రిటిష్ అధికారులు తలంచినట్లులేదు. అయినప్పటికీ వారెన్ హేస్టింగ్సు, వెలస్లీ, డల్‌హౌసీలలాంటి రాజప్రతినిధులు,

బోర్డుఆఫ్ డైరెక్టర్లకున్నూ, కంట్రోల్ బోర్డువారికిన్ని భారత రాజ్యాంగ సంస్కరణముల విషయంలో అనేక నివేదికలను పంపినట్లు కనుపిస్తూన్నది.

### "స్థానికంగా ఉన్న వాళ్ల మాటలనే పాటించాలి" అనే పద్ధతి:

సెలెక్టు కమిటీలద్వారా విచారణచేసే ఈ పద్ధతిని 1858 అనంతరం పార్లమెంటు విడిచివేసింది. 1908లో భారత రాజ్యాంగ కార్యదర్శిగాఉన్న మార్లీ ప్రభువీ పద్ధతిని పునరుద్ధరించవలెనని ఆలోచించాడు. కాని అది అంత ప్రయోజనకారి కాదని గ్రహించాడు. ఈ విషయంలో మాంటేగు, షేమ్సుఫర్డులు ఇలా వ్రాశారు "మార్లీ వాదంలోని పటుత్వము ఇలా ఉండగా భారతదేశ రాజకీయాభివృద్ధిని స్వతంత్రంగా పరిశీలించిన పిమ్మట మేమీ ముఖ్య నిర్ణయానికి రాగలిగినాము. హిందూదేశంలో జాతీయత పెంపొందుతూన్న కొద్దీ, నిరంతర భారత రాజకీయాభివృద్ధినిగూర్చి ఆలోచించి పనిచేసేనిమిత్తం ఇండియా దేశపు పరిపాలనమును నిత్యమూ పరిశీలించేటందుకు తగిన మార్గమును పార్లమెంటు యేర్పాటుచేయక పోవడమే మన అపజయానికి మఱొక కారణం............భారత భావి రాజకీయాభివృద్ధియొక్క గమనమునూ, దశలనూ నిర్ణయించడానికి ఆగస్టు 20 వ తేదీని బ్రిటిష్ పార్లమెంటువారు స్పష్టంగా చేసిన ప్రకటన ననుసరించి అతిభారమైన మన బాధ్యతను నిర్వర్తించేటందుకు తగిన సంస్థను ఏదో ఒక

రూపంలో పునరుద్ధరించడం ముఖ్యమని మా అభిప్రాయం.'' అయితే ఇండియాకు స్వయం నిర్ణయసూత్రం అంగీకరింపబడిన ఈ రోజులలో ఈ నిర్ణయంలోని పటుత్వమూ ప్రయోజనమూకూడా చాలావరకు తగ్గిపోయినవి.

1858 తరువాత, రాజప్రతినిధి ఆయన కార్యవర్గంతో కూడిన ఇండియాప్రభుత్వం వారిపైననే, ఇండియాను గూర్చిన భోగట్టావిషయంలోగాని, రాజ్యాంగసంస్కరణలను గూర్చిన ప్రతిపాదనల సందర్భంలోగాని పార్లమెంటువారు (భారత రాజ్యాంగ కార్యదర్శిద్వారా) ఆధారపడిఉంటూ వచ్చారు. 1857-58 నాటి తిరుగుబాటుకు కొంత కారణం ఇండియానుగూర్చి బ్రిటిష్‌ప్రభుత్వంవారు సరిగా తెలుసుకోకపోవడమేననే అభిప్రాయమే ఈమార్పుకు హేతువైనది.

1858 కి పిదప ముఖ్యమైన రాజ్యాంగసమస్యలన్నీ, రాజప్రతినిధికీ భారత రాజ్యాంగ కార్యదర్శికీ మధ్యజరిగే ఉత్తరప్రత్యుత్తరాలద్వారానే పరిష్కరింపబడుతూండేవి. వాటిని మంత్రివర్గంవారు ఆమోదించినతరువాత అవి భావి రాజ్యాంగశాసనాలకు పునాదులవుతూఉండేవి. వైస్రాయి అభిప్రాయాలను తనకౌన్సిలు ముందుపెట్టి పరిశీలనచేయించేవాడు. భారత రాజ్యాంగ కార్యదర్శి ఇండియాకౌన్సిలువారి ప్రత్యేక కమిటీలద్వారా ఇండియాప్రభుత్వంవారి ప్రతిపాదనలను పరీక్షింపచేయించేవాడు. ఈవిధంగా వారుభయులూ తమ అభిప్రాయాలకు బలంచేకూర్చుకొనేవారు. మింటో ప్రభువు భారత రాజ్యాంగ కార్యదర్శికి వ్రాసిన ఒకానొక

నివేదికనుబట్టి, రాజకీయ సంస్కరణలవిషయంలో భారత ప్రభుత్వము వారి ప్రతిపాదనలకుగల ప్రాముఖ్యతను గ్రహించవచ్చును. ఆ నివేదికలోని విషయాలివి: ''అయితే ఇండియా ప్రభుత్వ సభ్యులమైన మేము నేటి పరిస్థితులను గమనించకుండా కళ్లుమూసికొని ఉండజాలము. రాజకీయవాతావరణము పూర్తిగా మారిపోతూన్నది. అశ్రద్ధచేయడానికి వీలులేని సమస్యలు మనలను ఎదుర్కొంటూన్నవి. వాటిని మనం పరిష్కరించకుండా ఉండడానికి వీలులేదు. అయితే ఆపనిని మేమే ముందుగా ఉపక్రమించడం చాలా ముఖ్యమని మా అభిప్రాయం. ఈ దేశంలో జరిగే ఆందోళనకు లొంగిపోయిగాని, ఇంగ్లాండునుండి వచ్చే వత్తిడికి జడిసికాని మేమాపనిని ప్రారంభించినట్లు ఉండకూడదు. భారత దేశపు నిత్యజీవితంతో సన్నిహితసంబంధంగలిగిన మేము, మా స్వానుభవంతో మాకు చుట్టునూగల పరిస్థితులను గమనించి మా అభిప్రాయాలను చక్రవర్తిగారి ప్రభుత్వమునకు మేమేముందుగా నివేదించవలెను.''

1861 నాటి ఇండియన్ కౌన్సిలుచట్టం ఇండియా దేశపు మొదటి రాజప్రతినిధి క్యానింగుప్రభువు చేసిన సూచనలపైననే చాలావరకు ఆధారపడిఉన్నది. అదే 1919 వరకూకూడా భారదేశములోని రాజ్యాంగమునకు దాదాపు ప్రాతిపదికగా ఉంటూ వచ్చింది. నిజానికి 1892 నాటి ఇండియన్ కౌన్సిల్సు చట్టం, డఫ్రిన్ ప్రభువు తన కౌన్సిలులో సభ్యులుగానున్న సర్ జార్జి చెస్నీ,

సర్ ఛార్లెస్ అయిచ్సన్ (Aitchison), మిస్టర్ వెస్టులాండులతో కలిసి చర్చించిన పిమ్మటనే ప్రతిపాదింపబడినది. అందులోని సూచనలను తయారుచేయడానికి వారంతా ఒక కమిటీగా యేర్పాటు చేయబడ్డారు. 1909 నాటి మింటో మార్లే సంస్కరణలు, రాజప్రతినిధిని మింటో ప్రభువు తన కౌన్సిలు కమిటీతో సంప్రదించి, చేసిన సిఫారసులపైననే ఆధారపడిఉన్నవి. మార్లే ప్రభువు ఎంత ప్రజాస్వామిక లిబరల్ అయినప్పటికీ, సాంఘిక నియోజక వర్గములను ప్రవేశపెట్టడంవంటి ముఖ్యవిషయాలలోకూడా రాజప్రతినిధికి లొంగిపోవలసి వచ్చింది. మొట్టమొదట లార్డు హార్డింజి ప్రభుత్వమున్నూ, తరువాత లార్డు చెమ్సుఫర్డు ప్రభుత్వమున్నూ భారత రాజ్యాంగంలో ఇంకనూ జరుగవలసిన మార్పులనుగూర్చి, వాటి స్వభావమునుగూర్చి సూచనలు చేశాయి. తరువాత బ్రిటిష్ ప్రభుత్వమువారవలంబించే భారత భావి రాజ్యాంగవిధానమునుగూర్చి ప్రకటన చేయవలసిందని 1917 లో చెమ్సు ఫర్డు ప్రభువు పట్టుపట్టినాడు. ఆ ప్రకారం 1917 ఆగస్టు 20 వ తేదీని కామన్సుసభలో భారత రాజ్యాంగ కార్యదర్శి మాంటేగ్యు చేసిన ప్రకటన సంగతి అందరికీ తెలిసినదే. తుదకు 1919 నాటి చట్టంగా పరిణమించిన రాజ్యాంగ ప్రణాళికను తయారుచేయడంలో రాజప్రతినిధి చెమ్సుఫర్డు ప్రభువూ ఆయన ప్రభుత్వ సభ్యులున్నూ చాలా కృషిచేశారు. ఈ సందర్భంలో ఇండియా ప్రభుత్వంవారి ప్రాముఖ్యత మరింత ఎక్కువగా

తెలిసివచ్చింది. ఎలాగంటే వోటింగు అధికారములు నియోజక వర్గములు మొదలైన ముఖ్యాంశములన్నిటినీ నిర్ణయించే పని నియమావళిని తయారుచేసే అధికారంకింద ఇండియా ప్రభుత్వంవారికే వదలివేయబడినది.

**భారత ప్రజాభిప్రాయం వహించినపాత్ర :**

భారత రాజ్యాంగ సంస్కరణలను ప్రవేశపెట్టడంలో బ్రిటిష్ పార్లమెంటువారు, భారతజాతీయ మహాసభ వంటి అనేక సంస్థలద్వారా వెల్లడింపబడిన ప్రజాభిప్రాయమునుకూడా ఉపయోగించుకొంటూ ఉండిరి. 1880 కి తరువాతి కాలములో ఇట్టి ప్రజా సంస్థల అభిప్రాయం ప్రాముఖ్యస్థానం వహిస్తూవచ్చింది. కాలక్రమేణా అది అంత కంత కెక్కువ ప్రాబల్యం వహించి నేడు పార్లమెంటువారి అభిప్రాయాలకు తగిన స్వరూప నిర్ణయం చేయడానికి అది ఒక్కటే నిర్ణీత మార్గంగా ఏర్పడింది. 1917 వరకూ ఈ రాజకీయ సంస్థల అభిప్రాయాలను ఇండియా ప్రభుత్వంవారు పరోక్షంగానూ, ఇష్టా గోష్ఠిగానూ విచారిస్తూ ఉండేవారు. వారివారి అభిప్రాయాలను వినడానికి ఆయా రాజకీయ సంస్థలవారెన్నడూ ఆహ్వానింపబడి ఉండలేదు. కాని వారంతట వారే తమ వార్షికసభలలో తీర్మానాల రూపకంగా దేశంలోని రాజకీయ పరిస్థితులను అధికారులకు తెలియపరుస్తూ ఉండేవారు. అయినప్పటికీ ఈ తీర్మానాలను—ముఖ్యంగా భారతజాతీయ మహాసభా తీర్మానాలను—గమనించకుండా ఇండియాప్రభుత్వంవారు ఏ రాజకీయ ప్రతిపాదననూ చేయ

నీలవ్యేయవెకాను. దీనిని బట్టియే ఆ తీర్మానాల కెంత గౌర వమూ అధికారమూ ఉన్నదో తెలుసుకోవచ్చును. 1888 లో డఫ్‌రిన్ ప్రభువు బ్రిటిష్ ప్రభుత్వమునకు పంపిన ప్రతిపాద నలకూ, కాంగ్రెసు సూచించిన ప్రతిపాదనలకూ అంతగా భేదంలేకపోవడమే ఇందుకు నిదర్శనము. తరువాత 1906 లో మార్లే ప్రభువు వివరంగాచేసిన సూచనలుకూడా కాంగ్రెసు తీర్మానాలపైననే స్పష్టంగా ఆధారపడిఉన్నవి. "కాలంగడచిన కొద్దీ, 'స్వయం పరిపాలిత బ్రిటిష్ వలస రాజ్యాల ప్రభుత్వవిధానమునే ఇండియాకుకూడా వర్తింప చేయవలెనని" 1906 లో కాంగ్రెసు చేసిన తీర్మానాల వంటి తీర్మానాలను కానీ "సాధ్యమైనంత తొందరలో ఇండి యాకు స్వపరిపాలనమును ప్రసాదించడమే బ్రిటిష్ ప్రభు త్వమువారి ఆదర్శమూ, అభిప్రాయమూ అయినట్లుగా చక్ర వర్తిగారు ప్రకటించవలసిందని" 1915 లో కాంగ్రెసు ముస్లిం లీగులు చేసిన తీర్మానాలను కానీ పార్లమెంటువారు గమ నించకుండా ఉండడం కష్టమైపోయింది. ఇండియాలో ప్రవేశ పెట్టతగిన సంస్కరణల స్వరూపమునుగూర్చి పార్ల మెంటుకు తెలియపరచడంలో ప్రజాభిప్రాయముయొక్క ప్రాముఖ్యతను 1917 నాటికి బ్రిటిష్ అధికారులు బాగా గ్రహించారు. కనుకనే 1917 లో మాంటేగు మెమ్సు ఫర్డులు ఇండియాలో సంచారం చేసినప్పుడు, ప్రత్యక్షం గానూ సక్రమంగానూ కూడా ప్రజాభిప్రాయం కనుక్కొ న్నారు. వారు సందర్శించిన ప్రదేశములలో రాయబారా

లను స్వీకరించారు. ప్రజా ప్రతినిధులకు దర్శనమిచ్చి సంభాషించారు. ఉత్తర ప్రత్యుత్తరములద్వారానేగాక ముఖాముఖిని ప్రజా ప్రతినిధులతో చర్చించారు. వోటింగు హక్కులనుగూర్చి, కార్య నిర్వహణాధికార విభజనమునుగూర్చి విచారణచేసిన కమిటీవారుకూడా యిదే పద్ధతిని అవలంబించారు. తరువాత కొలది కాలానికి ఇండియా ప్రభుత్వ బిల్లు, జాయింటు పార్లమెంటరీ కమిటీ యెదుట విచారణకు వచ్చినప్పుడుకూడా భారతీయులు సాక్ష్య మిచ్చేటందుకు సీమకు ఆహ్వానింపబడ్డారు. ఇదంతా ఇండియా రాజ్యాంగ చట్టాన్ని తయారుచేయడంలో పార్లమెంటువారు భారతీయ ప్రజాభిప్రాయాన్ని 1919 నాటికి బాగా వినియోగించుకో గలిగినారన్న విషయాన్ని ఋజువుచేస్తూన్నది.

జాతీయ ఆందోళనఫలితము:

గాంధిమహాత్మునిచే నడపబడుతూన్న జాతీయాందోళనము తీవ్రతరమైనకొద్దీ, పరిస్థితులకు లొంగి పార్లమెంటువారు భారతరాజ్యాంగ ప్రణాళికలను తయారుచేయడంలో భారత రాజకీయసంస్థల సలహామాత్రం పొందడంకంటె వాటికే ఎక్కువసంబంధంకలిగించడం సముచితమని తలంచవలసి వచ్చింది. అసహాయోద్యమము, అందువలన ప్రజాసామాన్యంలోకలిగిన రాజకీయచైతన్యమూ, దేశంలో ఒక నూతన రాజ్యాంగనిర్మాణశక్తిని విజృంభింప చేయగలిగినవి. ఈ శక్తి 1927 లో సైమన్ కమిషన్ వచ్చినప్పుడు మొట్టమొదటిసారి ప్రత్యక్షంగా తెలియవచ్చింది. సైమన్ కమిం

మన్‌లో పూర్తిగా అందరూ బ్రిటిష్‌వారే. ఒక్క భారతీయ సభ్యుడుకూడా లేడు. ఈ దేశంలోని అన్ని రాజకీయసంస్థలూ కూడా ఆ కమిషన్ కుగల అధికారాన్ని ధిక్కరించినవి. అందువలన భారతీయప్రాతినిధ్యంలేని సంస్థయొక్క సిఫారసులపైన పార్లమెంటువారిచే నిర్మింపబడిన యే రాజ్యాంగ చట్టమూ కూడా సరిగా పనిచేయజాలదని అప్పుడు తెలిసివచ్చింది. ఈ లోపమును తొలగించడానికే తరువాత రెండు ముఖ్యమైన మార్పులు చేశారు. మొదటిది 'జాయింటు కాన్ఫరెన్సు' పద్ధతి. ఈ పద్ధతిప్రకారం సైమన్ కమిషన్‌లో ఉన్న ఏడుగురు బ్రిటిష్‌సభ్యులతోపాటు, కేంద్ర రాష్ట్రీయ శాసనసభలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులుకూడా, ఇండియాగవర్నమెంటువారున్నూ, రాజధానీ ప్రభుత్వాలున్నూ తయారుచేసిన సాక్ష్యాలనూ, సంజాయిషీలనూ, దస్తావేజులనూ, తదితర రికార్డులనూ పరీక్షించవచ్చును. అంతేకాక ఇండియన్ జాయింటుకమిటీవారు తయారుచేసే దస్తావేజులన్నీ సైమన్ కమిషన్ నివేదికకు అనుబంధాలుగా ఉండి చక్రవర్తిగారికి ఒకేసారి సమర్పింపబడి ప్రకటింపబడవలెనని కూడా అంగీకరింపబడెను. "ఈ జాయింటు కాన్ఫరెన్సు పద్ధతివలన భారతీయ ప్రతినిధులకు బ్రిటిష్‌కమిషన్‌తో సమాన ప్రతిపత్తి చేకూరడమేగాక, సాధ్యమైనంత యెక్కువ ఆమోదమును సంపాదించడానికితగినట్లు పరస్పరం నిష్కపటంగా చర్చించుకోవడానికి సావకాశం కలిగింది" అన్నాడు సర్ జాన్ సైమన్.

ఇక రెండవమార్పు రౌండుటేబిల్ సభావిధానం; ఈ సభలో బ్రిటన్‌లోని రాజకీయ కక్షుల ప్రతినిధులున్నూ, బ్రిటిష్ ఇండియాలోని ప్రధాన రాజకీయ పక్షాలయొక్కయు తదితర సంస్థలయొక్కయు ప్రతినిధులున్నూ, స్వదేశ సంస్థానాల ప్రతినిధులున్నూ ఉండి, సైమన్ కమీషన్ వారి నివేదిక ననుసరించి రాజకీయ సమస్యలనూ, రాజ్యాంగ నిర్మాణ సమస్యలనూ ఆలోచించవలెనని నిర్ణయించబడింది. ఇందువల్ల పార్లమెంటులో ప్రతిపాదించవలసిన రాజ్యాంగ సంస్కరణల విషయంలో, భారతీయుల వివిధ అభిప్రాయాలను బ్రిటిష్ ప్రభుత్వంవారు తెలుసుకోవడానికి వీలుకలిగింది. మొదటి రౌండు టేబిలు సభలో మొత్తం 89 మంది సభ్యులున్నారు. అందులో 18 మంది బ్రిటన్‌లోని మూడు రాజకీయ పక్షాలకూ చెందినవారు. బ్రిటిష్ ఇండియాకు సంబంధించి యాభై ఏడుగురున్నూ, స్వదేశ సంస్థానాల ప్రతినిధులు పదహారుగురున్నూ ఉన్నారు. రాజ్యాంగ నిర్మాణవిషయంలో కావలసిన ముడిసరుకును సప్లయిచేయడంలో భారతీయులకు ప్రత్యక్షంగా ప్రధాన భాగం ఉండవలెనని పార్లమెంటును మొట్ట మొదటిసారి గ్రహించేటట్టుగా చేయడమే ఈ మహాసభయొక్క ప్రాముఖ్యము.

**ముడిపదార్థాలూ — తయారీసరుకు :**

ముడిపదార్థాలను సప్లయిచేయడమునకూ, కావలసిన సరుకును తయారు చేయడమునకూగల ఈభేదం చాలా ముఖ్యమైనది. 1928 లో సర్ జాన్ సైమన్ జాయింటు

శ్రీ కాన్ఫరెన్సు విధానమును సూచించినప్పుడుగానీ, తరువాత 1930 లో బ్రిటిష్ ప్రభుత్వమువారు రౌండు టేబిలు సమావేశమును జరిపినప్పుడు కానీ, భారతీయ ప్రతినిధులకు రాజ్యాంగచట్టమును తయారుచేయుండలో-అనగా కావలసిన అసలు వస్తువును తయారు చేసుకోవడానికి—అధికారం కలదనే విషయం గుర్తింపబడలేదు. ఆ అధికారం అంతా కేవలం బ్రిటిష్ ప్రభుత్వంవారికే ఉండిపోయింది. ఇతరులెవ్వరూ అందులో భాగస్వాములుగా ఉండేటందుకు వీలు కలుగలేదు. భారతీయ ప్రతినిధులు సలహా యివ్వడానికీ సమాలోచనలు జరపడానికీ మాత్రమే ఆ సభలో పాల్గొనగలిగారు. తుది నిర్ణయాధికారం బ్రిటిష్ పార్లమెంటు చేతులలో ఉండవలసిందే!

1940 ఆగస్టు నెలవరకు బ్రిటిష్ అధికారుల నిశ్చితాభిప్రాయ మిదే. '1917 ఆగస్టు ప్రకటనలో ఈ అభిప్రాయమే స్పష్టీకరింపబడినది. 'భారతీయ ప్రజల క్షేమాభ్యుదయాలకు బాధ్యత వహించవలసిన బ్రిటిష్ ప్రభుత్వమూ, ఇండియా ప్రభుత్వములే వారి రాజకీయాభివృద్ధికి తగిన పరిమితిని కాలమును నిర్ణయించతగిన న్యాయమూర్తులు.' అని నాటి ప్రకటనలో చెప్పడమే ఇందుకు నిదర్శనము. 1919 నాటి ఇండియా బిల్లును గూర్చిన జాయింటు సెలెక్టు కమిటీ వారు ఈ విషయంలో ఇంకా ఎక్కువగా ఎలా నొక్కి చెప్పినారో చూడండి. "1917 ఆగస్టు 20 నాటి ప్రకటనలోని అన్ని భాగాలూ ఇమిడేటట్లుగా కమిటీవారు ఈ ఉపోద్ఘాత

మును పెంచి వ్రాశారు. ఆ ప్రకటనలోని వివిధ భాగాలకూ కొందఱు వారివారి అభిప్రాయాలకు అనుగుణంగా విలువ గట్టి, అయా భాగాలను వేరువేరుగా ఆలోచిస్తూండడం వలననే మేమీా పనిచేయవలసివచ్చింది. అందులోని మొదటి భాగము, అనుసరించి తీరవలసిన ప్రమాణ వచనమైనట్లున్నూ, తరువాతి భాగము ప్రాముఖ్యతలేని వట్టి అభిప్రాయ ప్రకటనమైనట్లున్నూ వ్యాఖ్యానం చేయబడుతూండడమే యిందుకు నిదర్శనం. అయితే భారత స్వపరిపాలనమును క్రమాభివృద్ధి కావించే బాధ్యత ఒక్క పార్లమెంటుపైననే ఉందనీ, ఈ బాధ్యతను కొత్తగా ఎన్నుకొనబడిన శాసనసభలకు ఒప్పగించడానికి గానీ, లేక పంచిపెట్టడానికిగానీ వీలులేదనీ ఈ రాజకీయ సంస్కరణల ప్రారంభదశలోనే పార్లమెంటువారు స్పష్టీకరించవలసియున్నది.” ఈ విధంగా 1919 చట్టంయొక్క ఉపోద్ఘాతంలో పార్లమెంటువారి ఈ బాధ్యతకు ఎక్కువ ప్రాముఖ్యత ఈయబడింది. అధినివేశ ప్రతిపత్తి లక్ష్యంగా గ్రహింపబడిన 1917 నాటి ప్రకటనలోని సందేహములనన్నిటినీ తొలగించేటందుకు 1930 లో ఇర్విను ప్రభువు రాజప్రతినిధిగా చేసిన ప్రకటనలోకూడా ఈ సంగతి విస్పష్టం చేయబడింది. భారతీయులతో సమాలోచనలు మాత్రం జటిపి పార్లమెంటువారు తుది నిర్ణయం చేస్తారనీ, ఆ తుది నిర్ణయాధికారం వారికే ఉందనీ, 1939 అక్టోబరునాటికి కూడా అధికారుల అభిప్రాయం. అక్టోబరు 17 వ తేదీని రాజప్రతినిధి ఇలా ప్రకటించాడు. “ఈ

యుద్ధానంతరం భారత రాజ్యాంగ శాసనంలో వాంఛనీయ ములైన మార్పులు చేసేటందుకు, హిందూ దేశంలోని వివిధ సంఘాలతోనూ, పక్షాలతోనూ, వివిధ ప్రయోజనాలు కల వారితోనూ, సంస్థానాధిపతులతోనూ సమాలోచనలు జరిపి వారి సహాయ సానుభూతులను సంపాదించుకొనే నిమిత్తం చక్రవర్తిగారి ప్రభుత్వం హృదయ పూర్వకంగా కోరుతూన్న దని ప్రకటించడానికి నాకు అధికార మీయబడినది.''

కాని రెండవ ప్రపంచయుద్ధంవలన ఈ దేశంలోనూ, ఈ దేశానికి వెలుపలనూ కలిగిన మార్పులమూల కంగా, యుద్ధానంతరం భారత దేశ రాజ్యాంగమును నిర్మించ వలసిన ప్రతినిధిసభా స్వరూపమును గూర్చి బ్రిటిష్ అధి కారుల అభిప్రాయంలోనే మార్పుకలిగింది. భారత దేశం పరాధీన దేశంగా పరిగణింపబడుతూన్నంతవరకూ తుదిలక్ష్య మేమైనప్పటికీ, బ్రిటిష్ పార్లమెంటువారు భారత దేశానికి రాజ్యాంగ చట్టాలను తయారుచేస్తూ ఉండడం ఏమీ తప్పు కాక పోవచ్చును. కాని హిందూ దేశం బ్రిటిష్ సమష్టి సౌభాగ్యంలోని (British Commonwealth) తదితర అధిని వేశ రాజ్యాలతో సమానప్రతిపత్తిగల అధినివేశ దేశం కావలెనని అంగీకరింపబడిన వెంటనే ఇండియాకు అధినివేశ రాజ్యాంగ చట్టమును తయారుచేసే అధికారం భారతీయులకే గాని తదితరులకు ఉండకూడదనే విషయం నిర్వివాదాంశం. (భారత దేశం అధినివేశ రాజ్యంకావలెననేసంగతి అధికారులు తాత్కాలికంగా అంగీకరించిన విషయమే.) 1940 ఆగస్టు

ప్రకటనలో వైనాయి ఈ విషయాన్నే సూచించాయి. చూడండి "బ్రిటిష్ కామన్ వెల్తుకులోబడిననూతన రాజ్యాంగ ప్రణాళికను తరుణంలో తయారుచేయడానికి తగిన సంస్థను గూర్చి తెలుసుకోవలెనని అందరికీ అభిలాషగా ఉంటుంది. ఆ ప్రణాళికను తయారుచేసే బాధ్యతి ప్రధానంగా భారతీయులకే ఉండవలెననీ, భారతీయ అర్థికరాజకీయ జీవిత నిర్మాణమునకు సంబంధించి వారిభావముల కనుగుణంగా అది ఉత్పన్నం కావలెనని చాలమంది పట్టుదలగా ఉన్నారు. చక్రవర్తి ప్రభుత్వంవారు ఆ కోరికలకు సానుభూతిచూపిస్తూ సంపూర్ణంగా దానిని ఆచరణలోకి తీసికొనిరావలెనని కోరుతున్నారు. అయితే భారతదేశంతో గ్రేటుబ్రిటనుకు కల చిరసంబంధంవలన తటస్థించిన బాధ్యతలను ఆ దేశం వదులుకోజాలదు గనుక వాటినిర్వహణమునకు లోబడియే ఈపని జరుగవలసి ఉంది..............యుద్ధానంతరం సాధ్యమైనంత తొందరలో నూతన రాజ్యాంగచట్ట నిర్మాణమునకై భారతజాతీయజీవితంలో ముఖ్యముతాలకు చెందిన (Principal elements) ప్రతినిధులుగల ఒకసంస్థను ఏర్పాటు చేసేటందుకు బ్రిటిష్ప్రభుత్వంవారు హృదయపూర్వకంగా సర్వసిద్ధంగా ఉన్నట్లు ప్రకటించవలెనని వారు నాకు అధికార మిచ్చారు." భారతరాజ్యాంగకార్యదర్శి అమెరీ ఇచ్చిన అనేక ఉపన్యాసాలలో కూడా, తమ రాజ్యాంగచట్టమును తయారుచేసుకొనే హక్కు భారతీయులకుకలదని స్పష్టీకరించి ఉన్నాడు. ఒకసారి ఆయన ఇలా అన్నాడు. " ఈ సభలో

తయారుచేసిపెట్టిన రాజ్యాంగచట్టంవలన, ఇక్కడ నిర్ణయింపబడినట్లు భారతదేశం క్రమక్రమంగా ముందుకుపోతూ పరిపూర్ణాధికారమును పొందవలెనని భావించడం ఇంక మంచిదికాదు. తాను నిర్మించుకొన్న రాజ్యాంగంకింద తాను స్వతంత్రముగా వ్యవహరించుకోవడానికి తగినహక్కు భారత దేశానికి కలదనే మనం భావించాలి.'' 1942 లో భారతీయ నాయకులతో కలిసి చర్చించడమునకు సర్ స్టాఫర్డ్‌క్రిప్సు తెచ్చిన ప్రతిపాదనలలో ఈ దిగువవిషయాలు కలవు.

(౧) ''యుద్ధంముగిసిన తక్షణం, భారతదేశపు నూతన రాజ్యాంగచట్టాన్ని తయారుచేసేనిమిత్తం ఈ దిగువ ఉదాహరింపబడిన ప్రకారం ఒక ఎన్నుకోబడిన సంస్థను ఏర్పాటు చేసేటందుకు తగినచర్య తీసికోబడును. (౨) ఆ రాజ్యాంగ నిర్మాణసంస్థలో సంస్థానాలుకూడా పాల్గొనేటందుకు వీలుగా ఈ కింద పేర్కొనబడినట్లు అవకాశం కలిగించబడును. (3) ఆ ప్రకారం తయారుచేయబడిన రాజ్యాంగప్రణాళికను ఈ కిందివిషయాలకు మాత్రం లోబడి, తక్షణం అంగీకరించి అమలు జరుపడానికి చక్రవర్తిగారి ప్రభుత్వం అంగీకరిస్తూన్నది.''

ఇందువలన భారత భావిరాజ్యాంగనిర్మాణమునుగూర్చి అధికారుల అభిప్రాయా లెంతగా పరివర్తనం పొందినవో భావించవచ్చును. ఒక విధంగా బ్రిటిష్ పార్లమెంటీవిషయం లో తనకుగలహక్కును వదులుకొన్నది. కాబట్టి తమ దేశపు రాజ్యాంగమును తయారుచేసేసభయొక్క, స్వభావ, నిర్మాణ

విధానములను గూర్చి భారతీయులు తామే నిర్ణయించుకో వలసి ఉన్నది. ఈ ఫలితం క్రమక్రమంగా పరిణమించినది. ప్రారంభదశలో ఇండియాప్రభుత్వంతో సంప్రతించి బ్రిటిష్ పార్లమెంటువారు భారత రాజ్యాంగశాసనాలను తయారు చేస్తూ వచ్చారు. తరువాత వారు రాజకీయచైతన్యంగల భారతీయవర్గాలయొక్కయు, సంస్థలయొక్కయు అభిప్రాయాలనూ, ఆలోచనలనూ తెలుసుకొని రాజ్యాంగచట్టాలను వ్రాశారు. జరిగిన కొలది సంవత్సరములలో ఇండియా రాజ్యాంగమును బ్రిటిష్‌పార్లమెంటువారు తయారుచేసే హక్కునుగూర్చి అనేకులుప్రశ్నిస్తూరాగా అంతకంతకు ఇంకా ఎక్కువగా తమ అధికారం నిరోధింపబడుతూండడం గ్రహించి బ్రిటిష్‌పార్లమెంటువారు తమకుకలదని వాదించే హక్కును ఒకవిధంగా వదులుకోవడమే మంచిదని భావించారు. కాబట్టి ఇంతవరకూ బ్రిటిష్‌పార్లమెంటు నిర్వర్తిస్తూ వచ్చిన రాజ్యాంగనిర్మాణమునకు పూనుకోతగిన సంస్థ యెలా ఉండవలెను అనేదే తక్షణసమస్య. తమ రాజ్యాంగ చట్టమును తాము తయారుచేసుకొనే భారతీయుల స్వతస్సిద్ధమైన ఈ హక్కును పార్లమెంటువారెన్నడో అంగీకరించి ఉండవలసినదని అనుకొనేవారు చాలామంది ఉన్నారు. కాని వారు రెండువిషయాలను గమనిస్తూన్నట్లు లేదు. కొన్ని కొన్ని క్రొత్త క్రొత్త ప్రత్యేక పరిస్థితులను బట్టి రాజకీయాభిప్రాయం మార్పుచెందుతూ ఉంటుంది. కొద్దిసంవత్సరాలనుండి మాత్రమే భారత జాతీయోద్యమం బాగా బల

వర్తరమై బ్రిటిషు అధికారుల దృక్పథంలో పరివర్తనం కలిగించగలిగింది. పార్లమెంటు వారి వైఖరిలో మార్పు రావడానికి కారణం భారతీయుల రాజకీయ శక్తియే కాని, హిందూదేశ ప్రజలకు స్వయం నిర్ణయాధికారము కలదని వారికి మఖ్యాక విధంగా తోచినందువలన కాదు. ఈ సందర్భంలో మరొకా సంగతిని కూడా మఱచిపోకూడదు. దాదాపు గడచిన పదేళ్లనుంచి మాత్రమే, భారత రాజ్యాంగమును నిర్మించే అధికారం పార్లమెంటుకెందుకు ఉండాలి అని రాజకీయజ్ఞులు ప్రశ్నించడం మొదలుపెట్టినారు. విద్యాధికులలో రాజకీయ చైతన్యం కలిగిన తరువాత చాలా సంవత్సరాల వరకూకూడా ప్రధాన రాజకీయ సంస్థలు, రాజ్యాంగ సంస్కరణల తుది నిర్ణయం పార్లమెంటుదే నని నిశ్చయించుకొని ఊరుకొనేవి.

జాతీయాభిప్రాయ పరివర్తనము :

ప్రారంభదశలో భారతదేశీయ మహాసభ, తీర్మానములనుచేసి బ్రిటిష్ అధికారులకు పంపిస్తూండడంతో సంతృప్తి పడుతూండేది. వాటిని అంగీకరించడానికి కాని, త్రోసివేయడానికి కాని పార్లమెంటుకే అధికారమున్నట్లు వేదాతురంవలె కాంగ్రెసు నమ్ముతూండేది. "ప్రధాన భారత రాజకీయ సంస్థలు కోరే హక్కుల సమగ్రమైన అధికార ప్రకటనమని" మాంటేగ్ షెమ్సుఫర్డులచే ఉద్ఘోషించబడి, దేశంలో బాగా బలపఱచబడిన 1916 నాటి కాంగ్రెసు, లీగు ప్రణాళిక కేవలం బ్రిటిష్ అధికారుల విచారణకోసం

తయారు చేయబడినదేకాని మరొకందుకు కాదు. భారతీయులచే తయారుచేయబడిన రాజ్యాంగచట్టమే భారతదేశమునకు వర్తింప చేయబడవలెనన్న అభిప్రాయం మొట్టమొదట 1919 ప్రాంతాలలో కలిగిందని చెప్పవచ్చును. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసి 'జాతీయ స్వయం నిర్ణయసూత్రం' అనే కేక ఆకాశం అంటుతూన్న రోజులవి. అప్పుడుకూడా ఆ అభిప్రాయం బాగా ఘనీభవించి ఉండలేదు. 1922 లో గాంధీగారు ఈ విషయాన్ని గూర్చి ఉదాహరిస్తూ, 'భారతీయులచే ఎన్నుకోబడిన ప్రతినిధులు వ్రాసిన రాజ్యాంగ చట్టమైనప్పటికీ దానిని బ్రిటిష్ పార్లమెంటువారు శాసన రూపంలో అంగీకరించాలి' అన్నారు. 1924 లో కేంద్ర శాసనసభలో పండిత మోతీలాలు నెహ్రూగారు 'ప్రధానములైన అల్ప సంఖ్యాక సంఘముల హక్కులకూ ప్రయోజనాలకూ తగిన రక్షణయిస్తూ భారత రాజ్యాంగ సంస్కరణ ప్రణాళికను సిఫారసుచేయడానికి త్వరలో ప్రాతినిధ్యంగల రౌండు టేబిలు సభను ఆహ్వానించవలె''నని ఒక తీర్మానం ప్రవేశపెట్టారు. ఆ సందర్భంలో మోతీలాలు నెహ్రూ, మాలవ్యాజీలు భారత రాజ్యాంగచట్టమును తయారుచేసుకొనే హక్కు భారతీయులకే ఉండవలెనని గట్టిగా నచ్చచెప్పగలిగారు. కాని వారుకూడా అది బ్రిటిష్ పార్లమెంటువారి అంగీకార ఆమోదములను పొందడం అవసరమని ఒప్పుకొన్నారు. పైగా వారు సూచించిన రౌండు టేబిలుసభలో ప్రభుత్వ పక్షానకూడా ప్రతినిధులు ఉండవలెనని అచ్చు

కొన్నారు. 1928-29 నాటి అఖిల పక్ష సమావేశం భారత దేశానికి సంపూర్ణ రాజ్యాంగచట్టాన్ని తయారు చేయడానికి యేర్పడిన ప్రథమ ప్రాతినిధ్య సంస్థ. అదికూడా పార్లమెంటువారి పై అధికారాన్ని కాదనలేదు.

కాని సరిగా ఈ సమయంలోనే స్వయం నిర్ణయ సిద్ధాంతం రాజకీయ ప్రపంచంలో చాలా సంచలనం కలిగిస్తూ ఉండెను. 1929 నాటి లాహోరు కాంగ్రెసులో ఇండియన్ నేషనల్ కాంగ్రెసు పూర్ణస్వరాజ్య తీర్మానమును అంగీకరించింది. 1930 లో ప్రారంభమైన శాసనోల్లంఘనోద్యమమున్నూ, తరువాతి సంఘటనలున్నూ ఈ సిద్ధాంతానికి మరింత బలమును చేకూర్చినవి. చిట్టచివరకు 1934లో, మూడు రౌండు టేబిలు సభలలోనూ జరిగిన చర్చలను ఆధారంగా చేసుకొని బ్రిటిష్ మంత్రివర్గము భారతరాజ్యాంగ ప్రణాళికకు సంబంధించిన ప్రతిపాదలను 'వైటు పేపరు' రూపంలో ప్రకటించారు. జాతీయవాదుల దృష్టిలో అవి చాలా అభివృద్ధి నిరోధకరములుగానూ, ఆశాభంగ కరములుగానూ కనుపించినవి. అందువలన కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంవారు పూర్తిగా భారతీయులచే తయారుచేయబడిన రాజ్యాంగచట్టమే భారతదేశమునకు కావలెనని తీర్మానించారు. అందులో యిలా ఉంది. ఈ 'వైటు పేపరు' భారత ప్రజాభిప్రాయాన్ని యేవిధంగాను ప్రకటించడంలేదు. దాదాపు అన్ని రాజకీయ కక్షులవారూ దీనిని నిరసిస్తూన్నారు. కాంగ్రెసు లక్ష్యమునుచేరే దేశాభివృద్ధి కిది ఆటం

కంగా ఉండకపోతే అధమం కాంగ్రెసు ఆదర్శానికి చాలా తక్కువగా ఉన్నదనైనా చెప్పాలి. వయస్సువచ్చిన దేశీయుల అందరిచేతనూ ఎన్నుకోబడిన రాజ్యాంగ నిర్మాణ సభ వారు తయారుచేసిన చట్టమే ఈ 'వైటు పేపరు'కు బదులుగా సూచించతగిన సంతృప్తికరమైన మార్గాంతరం.''

............1934 లో స్వరాజ్యపార్టీ సభవారుకూడా యిటువంటి తీర్మానమే చేశారు. ''ఇతర దేశాలతోపాటు ఇండియాకుకూడా స్వయం నిర్ణయపు హక్కు కలదని ఈ సభవారు వాదిస్తూన్నారు. ఆమోదకరమైన రాజ్యాంగచట్టమును తయారుచేసేటందుకు భారతీయులలోని అన్ని వర్గాల ప్రతినిధులునూగల ఒక రాజ్యాంగసభను సమావేశపరచడమే స్వయం నిర్ణయ సూత్రాన్ని అమలుపఱచడానికి తగిన పద్ధతి అని కూడా ఈ సభవారభిప్రాయపడుతూన్నారు.'' ఈ తీర్మానమునుగూర్చి మాట్లాడుతూ భూలాభాయి దేశాయిగారు 'వైటు పేపరు ప్రతిపాదనల రూపంలో తయారైన బ్రిటిష్ నిర్ణయ సిద్ధాంతానికి బదులుగా స్వయం నిర్ణయ సూత్రము ప్రవేశ పెట్టబడుతూన్నది.' అని అన్నారు. బ్రిటిష్ అధికారులు ప్రవేశపెట్టిన అసంతృప్తికరమైన రాజ్యాంగ ప్రణాళికకునూ భారతీయులు తయారుచేసుకొన్న రాజ్యాంగచట్టమే గావలెనన్న కోరికకునూగల శాస్త్రీయ సంబంధమును దేశాయిగారి ఈ ప్రకటన సరిగా వ్యక్తం చేస్తూన్నది.

భారతీయులచేతనే హిందూ దేశరాజ్యాంగం తయారు చేయబడవలెనని అధికారేతర ప్రజాభిప్రాయంలో కలిగిన పరివర్తనమును గూర్చి చేయబడిన ఈ సంగ్రహపరిశీలనము వలన, 1934 లో భారతజాతీయవాదులు కోరిన విధానాన్నే తరువాత ఆరేళ్ళకు 1940లో బ్రిటిష్ ప్రభుత్వమువారు అంగీకరించినారని విస్పష్టం కాగలదు. ఈ ప్రధానవిషయంలో భారతీయ అభిప్రాయానికి, బ్రిటిష్ అభిప్రాయానికీ కొద్దికాలములోనే పొత్తుకుదిరింది. ఇప్పుడు భారత రాజ్యాంగం స్వతంత్రంగానూ స్వపరిపాలన కలదిగానూ ఉండవలెననీ, అది భారతీయులచేతనే నిర్మింపబడవలెననీ అందరూ అంగీకరిస్తున్నారు. భారతీయ జీవితంలోని ఆర్థిక రాజకీయ సాంఘిక నిర్మాణములను గూర్చి భారతీయుల భావాలకు అనుగుణంగానే భారతరాజ్యాంగము ఉండగలదని ప్రొఫెసరు కూప్లాండు అన్నాడు. పైనుండి దిగుమతియైనసరుకుకంటె ఈ దేశంలోనే తయారైన ఈ చట్టం విమర్శకు నిల్వగలిగి ఉండడమేగాక, భారతీయుల దృష్టిలో పవిత్రవంతంగా కూడా భావింపబడుతుంది.



# 5. స్వతంత్ర భారత రాజ్యాంగ నిర్మాణము

ప్రధానావసరాలు :

స్వతంత్ర భారత రాజ్యాంగమును నిర్మించే సంస్థను గూర్చి రెండు ముఖ్య విషయాలను మనం గ్రహించాలి. (1) అది ప్రజాస్వామ్య పద్ధతులమీద నిర్మింప బడాలి. అందులోని సభ్యులు ప్రజాస్వామ్యమునందును, యావత్తు ప్రజకు బాధ్యత వహించడమే లక్ష్యంగాగల ప్రభుత్వ విధానమునందును, విశ్వాసం కలవారుగా ఉండాలి. ప్రజలు ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఎన్నుకొన్నప్పుడే అటువంటి సంస్థ యేర్పాటవుతుందని సిద్ధాంతంవలనా ఆచరణవలనా కూడా తెలుస్తున్నది. మఱొక విధంగా ప్రజాస్వామ్య రాజ్యాంగమును తయారుచేయ నిశ్చయించుకొన్న నిజమైన, ప్రజా ప్రాతినిధ్యంగల సంస్థను నిర్మించడం సాధ్యంకాదు. (2) రాజ్యాంగ నిర్మాణ సంస్థ తాను తయారుచేసిన రాజ్యాంగ చట్టాన్ని అమలుపఱచడానికి తగిన శక్తి సామర్థ్యములు కలదిగా ఉండాలి. అనగా ప్రభుత్వం నడవడానికి ప్రధానంగా కావలసిన నైతికబలం చేకూర్చగల ప్రజల సహకారం పూర్తిగా పొందగలిగి ఉండాలి. అంతేకాదు; సైనికబలమూ భౌతిక సంపదాకూడా ఉండాలి. ఇవి లేనిదీ

యేయువంటి ప్రజారాజ్యమైనా నడవదు. అది వట్టి కాగితపు రాజ్యాంగ మనిపించుకొంటుంది.

భారతదేశ రాజ్యాంగ నిర్మాణసభ యెలా ఉండాలి అనే విషయాన్ని గూర్చి చెలరేగిన వాద ప్రతివాదాలన్నిటికీ, ప్రస్తుత పరిస్థితులలో పై రెండు విషయాలను సంతృప్తి పరచగల సభను నిర్మించడం సాధ్యపడుతుందా అనే సందేహమే చాలావరకు కారణం. వయస్సు వచ్చినవా రందరి చేతనూ ఎన్నుకోబడిన రాజ్యాంగ నిర్మాణ సభను— అనగా నిజమైన ప్రజా ప్రాతినిధ్యంగల సభను సమావేశ పరచడం అసాధ్యం కాకపోవచ్చును. అయితే రాజకీయ చైతన్యముగాని, దేశభక్తిగానీ సరిగా వికాసంపొందని లక్షలాది ప్రజల సక్రమసహకారాన్ని ఆసభ పొందగలదా? ప్రస్తుత పరిస్థితులలో పనిచేస్తూన్న రక్షణసైన్యాల భక్తి విశ్వాసముల నది మార్చగొనగలదా? లేక కొలదికాలంలోనే తాను నిర్మింపబోయే నూతనరాజ్యాన్ని భక్తిపూర్వకంగా సేవించగల సమగ్రసాయుధ సైన్యమును తాను వెంటనే క్రొత్తగా యేర్పాటుచేసుకోగలదా? అనేప్రశ్నలు రాకపోవు. "భారతజాతీయ జీవితంలో అనేక ప్రత్యేకశక్తులు నేడు పనిచేస్తూన్నవి. ముఖ్యంగా సంస్థానాధిపతులు, ముసల్మానులు, షెడ్యూల్డు తరగతులవారున్నారు. వీరందరూ పైనపేర్కొనబడిన రాజ్యాంగ పరిషత్తువారు తయారుచేసిన రాజ్యాంగ చట్టమునకు సహకారంచేయకపోవచ్చును. అప్పుడు ప్రస్తుతం పనిచేస్తూన్న సైనికదళాల భక్తివిశ్వాసములలో మార్పు

కలుగవచ్చును " అని కొంతమంది వ్రాస్తున్నారు. ఇంకా యితర అభ్యంతరాలు కూడా అనేకమంది చెబుతున్నారు. కాని, దాని అధికారాన్ని గూర్చి చెప్పేదే ముఖ్యమైన వ్యాఖ్యాతరం.

అధికారం ప్రాముఖ్యత :

బ్రిటిష్ అధికారుల వాదంలోని అంతరార్థ మిది— " మేము అధికారాన్ని బదిలీచేయడానికి అంగీకరించినప్పటికీ, ఈ అధికారాన్ని పొందే ప్రభుత్వ స్వభావం ముందుగా మేము తెలుసుకోవాలి " అని భారత రాజ్యాంగ కార్యదర్శి ఒకప్పుడు అన్నాడు. " అధినివేశ ప్రతిపత్తి కానీయండి, మరొకటి కానీయండి, దానిని ఒక అలంకారంగా ప్రసాదించడానికి వీలులేదు. స్వంత అధికారంతో సంపాదించుకొని రక్షించుకోవలసిందది. నేటిప్రపంచకంలో ఈఅధికారం కలిగి బ్రతకవలసిన అవసరం పూర్వంకంటెకూడా ఎక్కువ ఉన్నది." దీనిని బట్టి అమెరీ, అధికారానికి ఎంత ప్రాముఖ్యత యిస్తున్నాడో తెలియగలదు. 1940 ఆగస్టు ప్రకటనలో వైస్రాయికూడా యిలానే అన్నాడు. 'భారత దేశ శాంతి సౌభాగ్యములనుగూర్చి నిర్వర్తించవలసిన ప్రస్తుత బాధ్యతలను, హిందూదేశ జాతీయ జీవితంలోని ప్రధాన వర్గాలు అంగీకరించని ప్రభుత్వానికి బదిలీ చేయడమనే సంగతి భావించరానిదని వేరుగా చెప్ప నక్కరలేదు. ఆ ప్రత్యేక వర్గాలను అట్టి ప్రభుత్వానికి లోబడి ఉండేటట్లు ఎవ్వరూ బలవంత పెట్టలేరుకూడా.' 'భారత ప్రజలు పరాయివారి జోక్యం లేకుండా తమ రాజ్యాంగ చట్టమును తాము

నిర్మించుకొనే హక్కు కలిగి ఉన్నారని ' కాంగ్రెసు చేసిన ప్రకటనకు ప్రత్యుత్తరంగా పైన ఉదాహరింపబడిన రాజ ప్రతినిధి ప్రకటన చేయబడింది. అనేకమంది అధికారేతర బ్రిటిష్ గ్రంథకర్తల అభిప్రాయం కూడా పై విధంగానే ఉన్నది. సర్ మారిస్ గయరు అన్న మాటలే అందు కుదాహరణం. 'ప్రస్తుతమున్న ప్రభుత్వ యంత్రం ఉన్న దున్నట్లుగా యెందుకు తీసికోకూడదు? అధికారాన్ని బదలీ చేయడమంటే ఇంతకన్న ఇంకా ఎక్కువ ఏమి కావాలి? అలా జరిగితే నడపడానికి బ్రిటిష్ వారుండరన్నమాటే కాని అన్ని పనులూ మునుపటివలెనే సక్రమంగానే జరుగుతూం టవి.........అని అనుకొనేవారుకూడా ఉన్నారు...... అయితే ప్రభుత్వ యంత్రం దానంతటది నడవదు. దానిని నడిపే మనుష్యులు ఉండాలి. వారంతా ఒక సమిష్టి కార్య నిర్వాహణమునకై ఒక సంస్థగా యేర్పడాలి. ప్రస్తుత సందర్భంలో తాము పరిపాలించబోతూన్నవారి విశ్వాస మును చూరగొనగలవారు మాత్రమే అటువంటి సంస్థగా యేర్పడాలి. బల ప్రయోగంవలన రాజ్యం చేస్తూన్న ప్రభు త్వానికి బదులు ప్రజల అంగీకారంపైన ఆధారపడిన ప్రభు త్వాన్ని ప్రవేశ పెట్టవలెననే ఉద్దేశమే అసలు ప్రభుత్వాల మార్పుకు ప్రధానకారణం. ప్రస్తుతం ఇండియాలో అటు వంటి ప్రభుత్వ స్థాపనకు తగిన పరిస్థితు లున్నవని ఎవరైనా వాదిస్తే అది కపటవాదమనిపించుకొంటుంది. ఆ పరిస్థితులు లేకపోవడం విషాదకరం కావచ్చును. మనకు ఇష్టంలేని విష యాలను గమనించనట్లు ఊరుకొన్నంతమాత్రాన అవి

లేకుండా పోవు..............' ఇవి సర్ మారిస్ గయర్ మాటలు.

ఇటువంటి శక్తిని సంపాదించడం అవసరమని బ్రిటిష్ వారొక్కరే చెప్పడంలేదు. భారత జాతీయనాయకుల అభిప్రాయంకూడా యిదే. భారతరాజ్యాంగ పరిషత్తు సమావేశమయ్యేలోగానే నిజమైన శక్తిని సంపాదించవలెనని చెప్పే సిద్ధాంతంలోని అంతరార్థమిదే, 'బ్రిటిష్ ప్రభుత్వం వారు తమ అధికారాన్ని వదులుకొని వారిచరిత్రలో నూతన అధ్యాయాన్ని ప్రారంభిస్తారా? అనేదే సంగ్రహంగా ఆలోచించవససిన సమస్య' అని గాంధీజీ ఒకప్పు డన్నారు. 'ప్రభుత్వయంత్రాన్ని స్వాధీనపరచుకోవడానికి తగినంత బలవత్తరంగా యేఒక్క రాజకీయ పక్షం ఉన్నప్పటికీ, మన అందరికీ ఒడంబడిక కుదరవలెననే మాట బ్రిటిష్ ప్రభుత్వం వారు అనరు. నేడు కాంగ్రెసుకాబలం లేదని మనం అంగీకరించి తీరాలి' అని వేరొక పర్యాయం అన్నారు. గాంధీజీ అన్న ఈ రెండు వాక్యాలకూ పైన ఉదాహరింపబడిన అర్థమే. రాజ్యాంగ పరిషన్నిర్మాణమనే అభిప్రాయానికి నిజంగా మూల పురుషుడని చెప్పతగిన పండిత జవహరలాలు నెహ్రూ యీ విషయంలో ఇంకా స్పష్టంగానూ, గట్టిగానూ ఇలా అన్నారు : "రాజ్యాంగ నిర్మాణసభ ఎన్నుకోబడి పని ప్రారంభించడానికి ఒక్కటే చిక్కు కనుపిస్తూన్నది. అది చాలా ముఖ్యమైన చిక్కు..........విదేశీయులైన బ్రిటిష్ ప్రభుత్వం దేశంలో ఉండి ఎక్కడలేని అధికారమూ చలా

యిస్తూండడమే అ చిక్కు. వీరి అధికారం దేశంలో ఉన్నంత వరకూ నిజమైన రాజ్యాంగ పరిషత్తు సహూ వేశమై పనిచేయ జాలదు. కాబట్టి భారత ప్రజానీకముయొక్క అభీష్టమును ఆచరణలోకి తీసికొని రావడానికి తగిన బలాన్ని సంపాదించు కోవడమే భారత జాతియొక్క ప్రధానాశయంగా ఉండాలి. ఒకే సమయంలో రెండు వ్యతిరేకాభి ప్రాయాలు వర్ధిల్ల జాలవు. అధికారం చలాయించవలె ననుకొనే వారికీ, స్వాతంత్ర్యం పొందవలె ననుకొనేవారికీ పోరాటం తప్పదనే సంగతి మనం నేటి ఇండియాలో గమనిస్తూనే ఉన్నాము.'' హిందూదేశంలో అసహాయోద్యమం చెలరేగేటంతవరకూ బ్రిటిషువారు అనుభవిస్తూ వచ్చిన యావత్తు అధికారమునూ ప్రజాస్వామ్య పద్ధతులమీద ఎన్నుకోబడిన రాజ్యాంగ పరి షత్తు పొందినప్పుడే, అది గట్టిగా ఆచరణలోకి తీసికొని రాగలిగిన రాజ్యాంగమును తయారుచేసే స్థితిలో ఉంటుంది.

**ఒడంబడికద్వారా యేర్పాటు చేయబడిన రాజ్యాంగము :**

పరిశీలించిన కొద్దీ స్వరాజ్య సంపాదనకు రెండు మార్గాలు కనుపిస్తున్నవి. బ్రిటనుతోనూ, ఇండియాలోని వారి మిత్రవర్గంతోనూ ఒడంబడిక చేసుకొని ప్రజా పాలనా స్వాతంత్ర్యమును సంపాదించే పద్ధతి ఒకటి. అహింసాయుత మైన దైనప్పటికీ విప్లవోద్యమంద్వారా స్వరాజ్యాన్ని సంపా దించడం రెండవ పద్ధతి. ఈ రెండింటికీకూడా బ్రిటిష్ సామ్రాజ్యంలోనే ఉదాహరణ లున్నవి. ఆస్ట్రేలియాలోనూ, కెనడా, దక్షిణ ఆఫ్రికాలలో కొంతవరకూ, రాయబారాల

ద్వారానే రాజ్యాంగ శాసనాలు తయారైనవి; అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఐర్లాండు దేశాలలో బ్రిటనుతో పోరాటం జరిగిన తరువాత రాజ్యాంగ చట్టాలు వ్రాయ బడ్డవి. బ్రిటనుతోనూ, వారి మిత్రులతోనూ రాయబారాలు నడపడం ద్వారానే హిందూదేశం స్వాతంత్ర్యమును పొందే యెడల, భారత రాజ్యాంగ సభా నిర్మాణం విషయంలో బ్రిటిష్ ప్రభుత్వంవారి మాట స్పష్టంగా సాగుతుంది. అంతే కాదు; ఏ సంస్థకు తమ అధికారమును స్వాధీనం చేసే టందుకు బ్రిటిష్ ప్రభుత్వం సంసిద్ధంగా ఉన్నదో ఆ సంస్థ ఒక్కటే భారత రాజ్యాంగ చట్టాన్ని తయారుచేయగలిగిన సంస్థ అవుతుంది. ఈ సందర్భంలో ఉదాహరించబడిన భారత దేశంలోని బ్రిటిష్ మిత్రమండలిని గూర్చిన విషయం చాలా ముఖ్యంగా ఆలోచించతగినది. అమెరీ చెప్పిన ఈ దిగువ విషయాలు ఆలోచించండి! ‘ఈ దేశం (బ్రిటను) ఇండియాపైన దండయాత్రచేసి జయించడంవలన మన సామ్రాజ్యం బలవంతంగా అక్కడ స్థాపించబడలేదు. భారత దేశపు శాంతి సంఘీభావములకు అవసరమైన దేశీయ పద్ధతులకు అనుగుణంగానే అక్కడి ప్రభుత్వం వ్యాపించింది. కాని అది బ్రిటిష్ నాయకత్వంక్రింద జరిగిన మాట నిజమే. అయితే ఆ దేశంలో మన ప్రభుత్వం వ్యాపిస్తూన్న ప్రతి దశలోనూకూడా భారతీయులు సైనికులుగానూ, పరిపాలనా దక్షులుగానూ, మిత్రులుగానూ మనకు తోడ్పడ్డారు.’ అన్నాడు అమెరీ. రాయబారమంటే ఎప్పుడూ రాజీ పద్ధతి మీాద జరిగే నిర్ణయమని అర్థం.

**ఆగస్టు వాగ్దానం :**

బ్రిటిష్ అధికారులు చేస్తూ వచ్చిన ప్రకటనలనుబట్టి భారత రాజ్యాంగ శాసన నిర్మాణమునకు ఎటువంటి సంస్థను స్థాపించవలెనని వారభిప్రాయ పడుతున్నారో తెలియగలదు. 1940 ఆగస్టులో వైస్రాయి చేసిన వాగ్దానమున్నూ, 1942 లో క్రిప్సు తెచ్చిన బ్రిటిష్ ప్రభుత్వంవారి ప్రకటనయున్నూ ఈ సందర్భంలో ముఖ్యంగా పరిశీలింప బడవలసి ఉన్నవి: "యుద్ధం ముగియగానే, ఎంతమాత్రమూ ఆలస్యం లేకుండా, నూతన రాజ్యాంగ నిర్మాణమునకు ప్రాతిపదికను తయారుచేయడానికి, భారత జాతీయ జీవితంలో ప్రాముఖ్యత వహించిన ప్రత్యేక వర్గాల ప్రాతినిధ్యంగల సంస్థను యేర్పాటు చేసేటందుకు, తాము సంసిద్ధంగా ఉన్నట్లు ప్రకటించవలసిందిగా చక్రవర్తిగారి ప్రభుత్వం నాకధికార మిచ్చింది" అని వైస్రాయి 1940 ఆగస్టులో చేసిన ప్రకటనలో ఉన్నది. వైస్రాయి పేర్కొన్నది నిజమైన ప్రాతినిధ్యంగల సంస్థయే అయిన యెడల అది భావి రాజ్యాంగాన్ని తయారు చేయడంలో ఎవరికీ యేవిధమైన అభ్యంతరమూ ఉండకూడదు. కాంగ్రెసు ప్రతిపాదించిన రాజ్యాంగ నిర్మాణ సభకూ దానికీ ఎక్కువ భేదంకూడా ఉండదు. కాని వైస్రాయి ప్రకటనలో అనేక ముఖ్యాంశములు అస్పష్టంగా ఉన్నవి. ఇంతకన్న ఇంకా ఎక్కువ వివరమైన అధికార ప్రకటన జరిగితేనేగాని ప్రభుత్వంవారుద్దేశించే ప్రాతినిధ్య సభ యేలాటిదో అర్థం కాదు.

అస్పష్టత :

భారత జాతీయ జీవితంలోని 'ప్రత్యేక వర్గాల,' స్వభావాన్నిగూర్చి, సంఖ్యనుగూర్చి ఉన్న అస్పష్టతే మొదటిది. 1939 నుండియే ఈ 'ప్రత్యేక వర్గాలు' (Elements) అనే మాట అధికారుల ప్రకటనలలోకీ,రికార్డులలోకీ రావడం ప్రారంభించింది. అంతకు పూర్వం రాజకీయ పక్షాలూ, సంఘాలూ, ప్రయోజనాలూ అంటూ ఉదాహరింపబడుతూండేవి. ఈ మాటలలో కూడా కొంత అస్పష్టత ఉన్నది. భారత రాజ్యాంగ ప్రణాళిక (1935) విషయంలో ఏర్పాటయిన జాయింటు పార్లమెంటరీ కమిటీకి, ఈ మాటలను—అధమం 'సంఘాలు, ప్రయోజనాలు'—అనే మాటలను స్పష్టంగా వివరించవలెనని జాయింటు మెమోరాండం పంపబడినమాట అందరికీ తెలిసిన సంగతే. అయితే వాటిని స్పష్టంగా వివరించేటందుకు కమిటీవారేమీ ప్రయత్నం చేయలేదు. 'ప్రత్యేక వర్గాలు' అనే మాట మరీ సందిగ్ధమైనమాట. ఈ మాటనుగూర్చి అమెరీ చెప్పిన ఈ దిగువ మాటలు పుంఖానుపుంఖంగా బరాచేసినవి. 'భారత జాతీయ జీవితంలోని ప్రధాన 'వర్గాలు' అంటే రాజకీయ సంస్థలు, మత విజ్ఞాన సంఘాలు (Cultural Communities) మాత్రమే గాక, ఆయా ప్రాదేశిక నివాసులు, పరిపాలనాధికారులు (Geographical & administration elements) బ్రిటిష్ ఇండియాలోని రాష్ట్రాలు—ముఖ్యంగా స్వపరిపాలనా బాధ్యతలను వహించి పెట్టని రాష్ట్రాలు-భారత సంస్థానాలూ కూడా

ఇమిడి ఉన్నవి' అని అమెరీ అన్నాడు. అనగా ప్రభుత్వం వారు అంగీకరిస్తే యేగుంపు అయినా సరే, యే సంస్థ అయినా సరే ఒక 'ప్రత్యేక వర్గం' కిందకు రావచ్చునని అమెరీ అభిప్రాయం. ఈ 'ప్రత్యేక వర్గం' అనే మాటకు ప్రభుత్వంవారి చిత్తానుసారం అర్థం చెప్పవచ్చును. ఇండియన్ క్రైస్తవులను ఆంగ్లో ఇండియన్ క్రైస్తవుల నుండీ, సవర్ణ హిందువులనుండి పెద్యూల్డు తరగతులనూ విడదీసినట్లుగానే, మహమ్మదీయులనందరినీ ఒకటిగా భావించే బదులు, షియ్యాలు, సున్నీలు, మోమినులు అని వేరు వేరుగా ప్రత్యేక వర్గాల కింద విడదీయవచ్చును. సైన్యంలోనుండి విడుదల చేయబడిన భారతీయ సైనికులను, భారత జాతీయ జీవితంలో ఒకప్రత్యేక వర్గంగా గమనించ వలెనని చేయబడుతూన్న సూచనను బట్టి యేగాలి ఎటు వైపు వీస్తూన్నదో తెలునకోవచ్చును.

సాంఘిక శాస్త్రజ్ఞులు వివిధ శాస్త్రములను బట్టి— అనగా మానవ శాస్త్రము, జాతుల శాస్త్రము, ఆర్థిక శాస్త్రము, భూగోళ శాస్త్రము మొదలయిన శాస్త్రము లు—మానవ జాతిని వివిధ తరగతులుగా విభజించారు. అనేక సందర్భాలలోని ఒక శాస్త్రానికి అనుగుణంగా చేయబడిన విభజన మరొక శాస్త్రాన్ని బట్టి సరిగా లేనట్లు స్పష్టపడుతూన్నది. ఆర్థిక సమూహములను జాతుల సమూహ ములను శాస్త్రీయంగా వివరించేటందుకు వీలున్నట్లే 'రాజ కీయ' సమూహములను గూడా శాస్త్రీయంగా వివరించ

వచ్చును. కాని వైస్రాయి ప్రకటించిన అభిప్రాయాన్నిబట్టి రాజ్యాంగ నిర్మాణమునకు ముందుగా అంగీకరించవలసిన 'ప్రత్యేక వర్గాలు' కేవలం ప్రముఖ రాజకీయ పక్షాలే కాదు—నివాసస్థలము, భాష, జాతి, మతము, సంఘము— వీటినేగాక ఇంకా అనేక విషయాలను ఆధారంగా చేసికొని ఏర్పరచబడిన అనేక వర్గాలూ, గుంపులూకూడా ఆ 'ప్రత్యేక వర్గాలలో' ఇమిడి ఉన్నవి. ఇందులో న్యాయంలేదు. ఈ విధంగా ఎక్కడా ఇదివరకు జరిగి ఉండలేదు.

**సందిగ్ధత:**

ఏదైనా ఒక 'ప్రత్యేకవర్గాన్ని' అంగీకరించినప్పటికీ, దానికి ప్రాతినిధ్యం వహిస్తున్నామనే సంస్థలు అనేకము లున్నవి. ఏ సంస్థ నిజంగా ఆ 'శక్తి'కి ప్రాతినిధ్యం వహిస్తున్నదో నిర్ణయించడం కష్టం. మహమ్మదీయు లందరికి సంబంధించిన సంస్థ ముస్లిం లీగు ఒక్కటేకాదు, అదే విధంగా అందరి హిందువులకూ సంబంధించిన సంస్థ హిందూ మహాసభ ఒక్కటే కాదు. షెడ్యూల్డు తరగతులు, ఇండియను క్రైస్తవులు సిక్కులు— ఈ అన్ని సంఘాలవారికీ ప్రత్యేకంగా ప్రాతినిధ్యం వహిస్తున్నామని చెప్పే పోటీ సంస్థలనేకములున్నవి. ఇటువంటి పరిస్థితులలో భారత జాతీయ జీవితంలో 'ఒక ప్రత్యేకవర్గాన్ని' చేర్చడంకానీతొలగించడం కానీ ప్రభుత్వంవారి యిష్టా యిష్టములనుబట్టి ఉంటుంది. ఇది రెండవచిక్కు, ప్రాతినిధ్యం (Weightage) 'ప్రత్యేక

వర్గాలకు' ఈయబడే రాజకీయ ప్రాతినిధ్యం (Political weight) విషయంలోకూడా సందిగ్ధంగా ఉండడం మూడవ చిక్కు. హిందువులకూ మహమ్మదీయులకూ సమాన ప్రాతినిధ్యం ఈయబడుతుందా? లేక వారివారి, జనసంఖ్యనుబట్టీ, ఐశ్వర్యాన్నిబట్టీ, రాజకీయ ప్రాముఖ్యాన్నిబట్టీ, ప్రాతినిధ్యం ఉంటుందా? ఇంతకు పూర్వం శాసన సభలలోగాని, ప్రభుత్వోద్యోగాలలోగాని వివిధ సంఘాలకు ఇచ్చిన ప్రాతినిధ్యం సహేతుకంగాలేదు. చాలావరకు ప్రభుత్వంవారి చిత్తానుసారమున్నూ, కొంతవరకాయా సంఘాలవారి బేరమాడే శక్తి సామర్థ్యాలనుబట్టీ ఆ ప్రాతినిధ్యం స్థిరపరుపబడినది. ఈ సందర్భంలో, స్వపరిపాలనా బాధ్యతలను తోసివేసిన రాష్ట్రాలకూ తోసివేయని రాష్ట్రాలకూ భేదం కల్పించిన పై ఆమెరీ ప్రకటనను గమనించవలసి ఉన్నది. ఆ ప్రకటనలోని అస్పష్టతవలన రాజ్యాంగ సభానిర్మాణమును నిర్ణయించడంలో ప్రభుత్వం వారికి అంతులేని అధికారం లభిస్తూన్నది. 'ఒకే మనిషికి ఒకే వోటు వుండాలి' అనే సాధారణ ప్రజాస్వామ్య సూత్రమును గమనించనంతవరకూ ఇటువంటి చిక్కులు రాక తప్పదు.

### ముఖ్య విషయాలలో మూకీ భావం:

'ప్రత్యేక వర్గాలు' ప్రతినిధులను ఎలా నిర్ణయించుకోవలెను అనే విషయంలో కూడా రాజప్రతినిధి ప్రతిపాదన స్పష్టంగాలేదు. ప్రతినిధి సంస్థ యేర్పాటు చేయబడవలెను అని మాత్రమే అందులో ఉన్నది. రౌండు టేబిలు సభలో

వలె ప్రతినిధులను ప్రభుత్వమే నిర్ణయిస్తుందని కూడా ఆ ప్రకటన స్పష్టపరచలేదు. రాజ్యాంగ నిర్మాణసభకు ప్రతినిధులను పంపించవలసిందని ప్రభుత్వమువారు ఆయా సంస్థలను కోరితే కోరవచ్చును కూడా. ఇందులో కొంత ప్రజాభీష్టం వెల్లడి కాదగి ఉన్నప్పటికీ, ప్రాథమిక వోటర్లు ప్రత్యక్షంగా గానీ పరోక్షంగా గానీ ఎన్నుకొనే పద్ధతికీ, దీనికీ నిజంగా చాలా భేదమున్నది. ప్రభుత్వంవారు ప్రతినిధులను పంపించవలసిందని కోరేసంస్థలు, తాము ప్రాతినిధ్యం వహిస్తున్నామని చెప్పే ప్రజలలో వయస్సువచ్చిన వారందరికీ నిజమైన ప్రతినిధులవునో కాదో తెలుసుకోవడానికి తగిన ఆధారాలు లేవు. సాధారణంగా ఆయా సంస్థల సభ్యత్వము, తాము ప్రాతినిధ్యం వహిస్తున్నామని చెప్పే ప్రత్యేక మతాలలో అల్ప సంఖ్యాకులకు మాత్రమే అందుబాటులో ఉంటవి. ఇండియన్ నేషనల్ కాంగ్రెసు, ముస్లిం లీగుల విషయంలో కూడా ఇంతే. తామెవరి పక్షాన మాట్లాడుతున్నామని ఆ సంస్థలు భావిస్తున్నవో ఆ ప్రజలలో చాలా తక్కువమంది మాత్రమే వాటిలో సభ్యులుగా ఉన్నారు ఇక తక్కిన సంస్థలలో ఇంతకంటెనూ తక్కువ మంది సభ్యులుగా ఉంటారనే సంగతి వేరుగా చెప్పనక్కర లేదు. ఒకే 'సమూహానికి' (Element) ప్రాతినిధ్యం వహిస్తున్నామని చెప్పుకొనే వివిధసంస్థలకు చెందిన ప్రతినిధులు పరస్పర విరుద్ధములైన అభిప్రాయాలను వెల్లడిస్తున్నప్పుడు ఆ సమూహము (Element) యొక్క అసలు అభిప్రాయమేమిటో తెలుసుకోవడానికి తగిన సావకాశం లేదు. అందు

వలన ఏ 'సమూహము' యొక్క అభిప్రాయం తెలుసుకో వలె ననుకొన్నప్పటికీ, ఆ 'సమూహం' లోని వయస్సు వచ్చిన వారందఱినీ పిలిచి వారి ప్రతినిధిని ఎన్నుకోవలసిం దని కోరడమే సాధారణంగా మామూలు బుద్ధికి తోచే పద్ధతి. అయితే వయిస్సువచ్చిన వారందఱినీ వోటర్లుగా చేర్చడంలో కానీ, వారిలోనుండి ఎన్నికలు జరపడంలోకానీ ఆచరణలో చిక్కులు ఉండవచ్చును. ఆ చిక్కులన్నీ కొన్నియేండ్ల కిందటనే లోథియన్ కమిటీ నివేదికలో చర్చించబడిఉన్నవి. కాని అవి గడువరాని చిక్కులు కావు. ప్రజాభిప్రాయాన్ని సరిగా తెలుసుకొనవలెనంటే ఇది ఒక్కటే క్షేమకరమైన ఋజుమార్గం.

వైస్రాయి ప్రతిపాదనలో ఉదాహరింపబడిన రాజ్యాంగనిర్మాణసభలో వోటింగుపద్ధతిని గూర్చి కూడా యేమీ వివరింపబడలేదు. 'ప్రతిసమూహానికీ' (Element) ఒక్కటే వోటువుంటుందా? ఆయా 'సమూహాలకు' చెందిన ప్రతినిధులు తదితర 'సమూహాల' ప్రతనిధులతో కలిసి వ్యక్తులుగా వోటుచేయడానికి తగిన స్వాతంత్ర్యం వారికి ఉందా? నిర్ణయాలు ఏకగ్రీవంగా ఉండాలా, లేక మామూలుగా అధికసంఖ్యాకులచేత అంగీకరింపబడితే చాలునా? కాక ప్రత్యేక మెజారిటీలచే అంగీకరింపబడవలెనా? వీ టన్నిటికీ సమాధానాలు వైస్రాయి ప్రతిపాదనలో కనిపించవు. అందువలన వైస్రాయి ప్రకటన రాజ్యాంగనిర్మాణ సభా స్వరూపాన్ని ప్రాతిపదికగానైనా మనకు తెలుపజాలక

పోతూన్నది. దాని అస్పష్టత మూకీభావములవలవ కలుగ బోయే ఫలితం ఒక్కటే. బ్రిటిష్‌ప్రభుత్వంవారి యొక్కయు వారి అనుయాయుల యొక్కయు పలుకుబడికి యెక్కువగా లోనయిన రాజ్యాంగనిర్మాణసభ యేర్పాటు అవుతుంది. దానికి 'స్వతంత్రభారత' రాజ్యాంగాన్ని నిర్మించగల అధికారం ఉండనే ఉండదు.

**భారతదేశపు బేరమాడుశక్తిని తగ్గిస్తూన్నది :**

ఈసందర్భంలో మరొకసంగతి విచారించాలి. భారత దేశరక్షణ, సివిలుఉద్యోగీయులపింఛనులు మొదలైన ముఖ్య విషయాలనుగూర్చి బ్రిటను స్వతంత్రభారతదేశములు సంధి చేసుకొనవలసియున్నది. ఆ సంధిరాయబారాలలో రాజ్యాంగ నిర్మాణసభ భారతదేశపక్షాన ప్రతినిధిగా వ్యవహరించ వలెను. రాజప్రతినిధి ప్రతిపాదన ననుసరించి ఎన్నుకోబడిన రాజ్యాంగనిర్మాణసభ భారతదేశముయొక్క నిజమైన క్షేమము ననుసరించి పోరాడేటందుకుగానీ, ఇంగ్లాండుతో లాభదాయకంగానూ, స్వతంత్రముగానూ రాయబారాలు జరిపేటందుకుగానీ తగిన శక్తిసామర్థ్యాలు కలదిగాఉండదు. అందువలన బ్రిటను ఇండియా మధ్యజరిగే సంధి నిజానికి బ్రిటనుదేశానికే ఎక్కువ క్షేమకరంగా ఉంటుంది. స్వతంత్ర భారతదేశము తనపైన బలవంతంగా మోపబడిన అనేక కష్టనష్టకరములకులోబడి రాజ్యాంగవ్యవహారములను నడుపుకోవలసిన అవసరపడుతుంది. పేరులో యేమీలేదు. 1935 ఇండియాచట్టంలో ఉదాహరింపబడి, దేశంలో ఎంతో వ్యతి

రేక భావాన్ని పుట్టించిన రక్షణలూ, ప్రత్యేక బాధ్యతలూ, ఆంగ్ల భారతదేశాల సంధిపత్రంలో చేర్చబడినా లేక రాజ్యాంగచట్టంలోనే చేర్చబడినా, (అవి) రాజ్యాంగనిర్మాణ సభకు వెలుపలనున్న బ్రిటిష్ ప్రతినిధులద్వారా చేర్చబడినా, లోపల ఉన్నవారి మూలకంగా చేర్చబడినా పర్యవసానం ఒకటే గనుక భేదమేమీ ఉండదు. కాని ఇంగ్లాండుతో బేర మాడటానికి తగిన శక్తిసామర్థ్యాలుగల సంస్థ మన పక్షాన వ్యవహరించడమే మనకు కావలసింది.

వారి ప్రతిపాదనను ఆచరణలో పెట్టడంలో చాలా చిక్కులు కలవని బ్రిటిష్ అధికారులు గుర్తించి ఉండడం సహజం. కాని ఈ చిక్కులన్నిటినీ విడదీసుకొనే బాధ్యత భారతీయులదని వారనుకొంటున్నారు. రాజ్యాంగ ప్రణాళికకు మొత్తంమీద ఒక ప్రాతిపదికను సూచించడమే వారి పని అనీ, తక్కిన వివరాలు భారతదేశ నాయకులచే తయారు చేయబడవలెననీ వారి అభిప్రాయం. భారతదేశ సమస్యలను పరిష్కరించేటందుకు తాము హృదయ పూర్వకంగా చేసిన ప్రయత్నాలను భారతీయులు సరిగా ఆదరించలేదనీ, కాబట్టి వాటిని గురించి తాము ఎక్కువగా బాధపడినందు వలన ప్రయోజనం లేదనీ బ్రిటిష్ వారు గట్టిగా అనుకొంటున్నట్లు తోస్తుంది. "ఇది ఎవ్వరూ సంతోషించే పని కాదు. ఇండియాకు నూతన రాజ్యాంగ చట్టాన్ని తయారు చేసే ప్రయత్నం ఇప్పుడేమీ లేదు. అది ఒక మనిషి శక్తికి మించినపని. 1935 చట్టం తయారుచేయడానికి చాలా

యేళ్లు పట్టింది. బ్రిటిష్, భారతీయ రాజకీయ ధురంధరు లెందరో ఎంతో కష్టపడి పనిచేస్తే అది తయారయింది. ఈ దేశంలో ఉన్న మాకు భారత రాజ్యాంగ చట్టమును తయారుచేయడంలో ఎంత అభిమానం ఉన్నప్పటికీ దానిని తయారుచేసే పనిమాత్రం మాదికాదు'' అన్నాడు ప్రొఫెసర్ కూప్లాండు. సర్ మారిస్ గయరుకూడా ఇదే ధోరణిలో మాట్లాడినాడు. 'భారత రాజకీయ పక్షాలవారు తెలిసో తెలియకో 1935 నాటి రాజ్యాంగ చట్టాన్ని తోసివేసిన నాటినుండీ పూర్తిగా క్రొత్త పరిస్థితి యేర్పడ్డది. భారతీయుల ఆ నిరాకరణను గ్రేటు బ్రిటను అంగీకరించింది. ఇంక ఆ దేశం ఇండియాకు నూతన రాజ్యాంగ చట్టాలను నిర్మించ దలచుకోలేదు. 1935 నాటి చట్టాన్ని తోసివేయడం వలన తన రాజ్యాంగ చట్టాన్ని తాను నిర్మించుకొనే బాధ్యతను భారత దేశం వహించింది......ఈ బాధ్యతలో బ్రిటను భాగస్వామిగా కూడా ఉండదు. అయితే గ్రేటు బ్రిటను అంగీకరించవలసిన కొన్ని రాజ్యాంగ నిర్ణయాలు యే రాజ్యాంగ చట్టంలోనైనా ఉండి తీరుతవి. కాని భారత ప్రజలు పరిపాలింపబడే ప్రధాన రాజ్యాంగ చట్టాన్ని నిర్మించుకోవలసిన పని భారతీయులదే' అని సర్ మారిస్ గయరు అన్నాడు.

ముగింపు :

ఇంగ్లాండు భారతదేశాల మధ్య సంధి కుదిరిన తరువాత, భారతీయుల అధికారంకిందకు వచ్చే వ్యవహా

రాలనైననూ చక్కబెట్టుకొనేటందుకు తగిన రాజ్యాంగ చట్టమును తయారుచేయడానికి ప్రజాస్వామ్య స్వభావం గల రాజ్యాంగ నిర్మాణ సభాస్థాపనము, రాజప్రతినిధి ప్రతిపాదనలో ఉద్దేశింపబడలేదని ఇంతవరకూ చేసిన సింహావలోకనము వలన గ్రహించగలిగినాము. కాని సందిగ్ధంగా ఉన్న విషయాలను చక్కగా వివరించి 'ప్రత్యేక వర్గాలు', (elements) అనే మాటకు రాజకీయ ప్రాముఖ్యత గల పక్షాలు మాత్రమే అని సరిగా వ్యాఖ్యానంచేసి, వాటికి ప్రాతినిధ్యం వహించేవారు వయోజన నియోజక వర్గముల ద్వారా ఎన్నుకోబడేటట్లు నిర్ణయించినట్లయితే ఆ ప్రతిపాదనకు కొంత విలువవస్తుంది. వయస్సువచ్చిన వారందఱిచేతను ఎన్నుకోబడిన రాజ్యాంగ నిర్మాణ సభ యేర్పాటు కావలెననీ, అందులో మహమ్మదీయుల వంటి అల్ప సంఖ్యాకులు ప్రత్యేక నియోజక వర్గముల ద్వారా ఎన్నుకోబడవలెననీ కాంగ్రెసుచేసిన ప్రతిపాదనకూ దానికీ అప్పుడంత భేదం కనిపించదు. వయోజనులందఱూ ఎన్నుకోవలెనన్నంత మాత్రాన ఎవ్వరూ భయపడ నక్కరలేదు. సర్ సయ్యద్ సుల్తాన్ అహమ్మదు వంటి లోకజ్ఞానం కలిగిన పెద్దమనిషి కూడా అక్షర జ్ఞానం కలట్టిగానీ, ఇల్లు కలట్టిగానీ, లేక యేదైనా పన్ను చెల్లిస్తూన్నట్టిగానీ హిందూ వయోజనుల యొక్కయు, మహమ్మదీయుల వయోజనుల యొక్కయు రిజిస్టరును తయారుచేయవలెనని తాను సూచించిన రాజ్యాంగ నిర్మాణసభ సందర్భంలో చెప్పిఉన్నాడు. అటు

వంటి సందర్భంలో ఇంకా కొంచెం ముందుకుపోయి వయస్సు వచ్చిన వారందరి జాబితాలను తయారుచేయడం అసాధ్యమైన విషయం కాదు.

క్రిప్సు ప్రతిపాదన :

1942 లో బ్రిటిష్ ప్రభుత్వంవారు ప్రకటించగా సర్ స్టాఫర్డు క్రిప్సు ఇండియాకు తీసికొనివచ్చిన ప్రతిపాదనలలో ఇండియన్ యూనియను రాజ్యాంగ సభా స్వభావం సంపూర్ణంగా వివరింపబడింది. అందులో ఇలాఉంది : 'యుద్ధం ముగియక పూర్వమే హిందూ దేశములోని ప్రముఖ సంఘాల నాయకులు తమ రాజ్యాంగ నిర్మాణసభా స్వరూపం మరొక విధముగా నుండవలెనని ఒడంబడిక కుదుర్చుకోక పోయినట్లయితే, అది యీకింది విధంగా యేర్పాటు చేయబడుతుంది. యుద్ధం ముగిసిన తరువాత రాష్ట్రీయ శాసనసభల ఎన్నికలు జరగడం అవసరం. ఆ ఎన్నికల ఫలితం తెలిసిన తక్షణం, రాష్ట్ర అసెంబ్లీల సభ్యులందఱు ఒకే నియోజక వర్గంగా యేర్పడి, దామాషా ప్రాతినిధ్యపద్ధతిని (Proportional Representation) రాజ్యాంగ పరిషత్తు సభ్యులను ఎన్నుకోవాలి. ఇందులోని సభ్యులు రాష్ట్ర అసెంబ్లీల సభ్యులలో పదవవంతు ఉండాలి. బ్రిటిష్ ఇండియా ప్రతినిధుల వలెనే, సంస్థానాల ప్రతినిధులుకూడా అక్కడి జనసంఖ్యను బట్టి దామాషాగా నియోగింపబడవలెను. సంస్థానాల ప్రతినిధులకుకూడా బ్రిటిష్ ఇండియా ప్రతినిధులతో సమాన ప్రతిపత్తి ఉండాలి.'

శుభలక్షణాలు :

ఈ విధానమును బ్రిటిష్ ప్రభుత్వంవారే సూచించినారు గనుక, ఈ ప్రకారం నిర్మింపబడిన సంస్థచే తయారు చేయబడిన రాజ్యాంగ చట్టమును వారు ఆమోదించగలరు. ఆ చట్టంకింద యేర్పాటయిన ప్రభుత్వానికి యే చిక్కులూ లేకుండా యావత్తు అధికారమూ సంక్రమిస్తుంది. ఈ రాజ్యాంగ పరిషత్తు 207 మంది సభ్యులతో చక్కగా కుదిమట్టంగా ఉంటుంది వారిలో 158 మంది బ్రిటిష్ ఇండియా నుండీ 49 మంది సంస్థానాలనుండీ యేర్పాటవుతారు. బ్రిటిష్ ఇండియాకు సంబంధించినంత వరకు ఈ సంస్థలోని ప్రతినిధులు పరోక్షపు ఎన్నికలద్వారా ఎన్నుకోబడతారు. ఈ పరోక్షపు ఎన్నికల పద్ధతి అనేక ఆధునిక రాజ్యాలలో అవలంబింపబడుతూన్న పద్ధతే దీనివలన దాని ప్రజాస్వామ్య స్వభావానికి భంగం రాదు. 1935 నాటి రాజ్యాంగ చట్టం అల్పసంఖ్యాక సంఘాలవారికీ, ప్రత్యేక ప్రయోజనాలు కల వారికీకూడా తగిన ప్రాతినిధ్యం యిస్తూన్న కారణాన, ఆ చట్టంకింద యేర్పడిన రాష్ట్ర అసెంబ్లీలద్వారా ఎన్నుకోబడిన రాజ్యాంగ పరిషత్తు కన్సర్వేటివులకు, తదితర ఆస్థిపరులకూ (Vested interests) కూడా సంతృప్తికరంగా ఉంటుంది. 1937 లో జరిగిన శాసనసభల జనరల్ ఎన్నికలనూ, తరువాత ఖాళీపడిన స్థానాలకు జరిగిన ఎన్నికలనూ ఉదాహరణంగా తీసికొన్నట్లయితే ప్రధాన రాజకీయ సంస్థలయిన కాంగ్రెసు ముస్లిం లీగులు, ఆయా రాష్ట్రాలలో తమ బలాలకు

అనుగుణముగా అధికసంఖ్యాక ప్రతినిధులను గెలిపించుకో గలవని నమ్మవచ్చును. తదితర పక్షాలలోని ప్రధాన నాయకు లకూ ప్రముఖ సభ్యులకూ చాలామందికి ఆ రాజ్యాంగ సభలో స్థానం లభిస్తుంది.' ఇదే 1942 లో క్రిప్సు తెచ్చిన బ్రిటిష్ ప్రతిపాదనలోగల సుగుణం.

లో పా లు :

కాని ఈ రాజ్యాంగ నిర్మాణ సంస్థలో అనేక ప్రమాదకరములైన లోపాలు కూడా ఉన్నవి. అది పూర్తిగా ప్రజా స్వామ్యసంస్థగాఉండదు. ఎందువల్లననగా 1935 నాటి ఇండియా చట్టంప్రకారం ముఖ్యంగా ఆ స్తిగలవారికి మాత్రమే వోటుంటుంది. అన్ని రాష్ట్రాలలోనూ కలసి మొత్తం వోటర్లు 3 కోట్ల మంది ఉంటారు అనగా బ్రిటిష్ ఇండియా జనసంఖ్యలో నూటికి 14 మందికి మాత్రమే వోటింగు అధికారం ఉన్నదన్నమాట. కాబట్టి రాజ్యాంగ నిర్మాణ సభకు సభ్యులను ఎన్నుకోవడంలో, ప్రజాసామా న్యంలో ఎక్కువ మందికి ఏమీ జోక్యం ఉండదు. దీనికి తోడు సంస్థానాల ప్రతినిధులలో అత్యధిక సంఖ్యాకులు సంస్థానాధిపతుల నియోజితులుగా మాత్రమే ఉంటారు. కొంతమంది సంస్థానాధిపతులూ వారి ప్రభుత్వ సభ్యులూ చాలా విజ్ఞానవంతులు అయితే కావచ్చును. కాని బాధ్యతా యుత ప్రభుత్వ పద్ధతిలో వారికి నమ్మకంలేదు. ఈ పరి స్థితిలో కొన్ని సంఘాలకూ కొన్ని మతాలకూ ఉండవలసిన దానికంటె ఎక్కువ ప్రాతినిధ్యం ఉన్నది. అటువంటి సంస్థచే

నిర్మింపబడిన రాజ్యాంగ చట్టంలో ప్రజాస్వామ్యం బహు తక్కువగా ఉంటుంది. అందువల్ల అది తుది పరిష్కారం పొందిన శాశ్వత రాజ్యాంగ శాసనంగా పరిగణింపబడదు. దీని ఫలితంగా విప్లవోద్యమానికి ఎక్కువ ప్రోత్సాహం కలిగి, అది యింకా ఎక్కువ తీవ్రతర మవుతుంది. అప్పుడు నూతన ప్రభుత్వం శాంతి భద్రతలను కాపాడడానికి మాత్రమే తన యావత్తు శక్తి సామర్థ్యాలనూ వినియోగించవలసి వస్తుంది. అందువల్ల ఆధునిక రాజ్యాలు నిర్వర్తించ వలసిన అసలు పని—అనగా ప్రజాసామాన్యము యొక్క భౌతిక నైతికాభివృద్ధి— అంతులేకుండా ఆలస్య మవుతుంది.

ప్రొఫెసరు కూప్‌లాండు ఈ ప్రణాళికలో రెండు మార్పులను సూచించాడు. వాటివలన ఈ సంస్థలో ఇంతకు పూర్వంలేని ప్రజాస్వామ్యలక్షణం కొత్తగా రాదు. ఒకటి: ఈ రాజ్యాంగ పరిషత్తులో సభ్యుల సంఖ్య ఇంకా తక్కువ కావలెనని. రెండవది రాష్ట్రాలలోని శాసనసభ్యులందఱూ ఒకే నియోజక వర్గంగా చేరి ఎన్నుకోవడంకాక ప్రతి రాష్ట్ర శాసన సభ్యులు వేఱువేఱుగా పరిషత్సభ్యులను ఎన్నుకోవలెనని. అందువల్ల రాజ్యాంగ పరిషత్తు కెన్నుకోబడిన వారు తాము బ్రిటిష్ ఇండియా ప్రతినిధుల మనుకోవడంకంటె ప్రధానంగా రాష్ట్రాల ప్రతినిధులమని భావిస్తారు. ఈ విధానం ఫెడరేషన్ పద్ధతికి ఎక్కువ అనుగుణంగా ఉంటుందని ఆయన అభిప్రాయం. అమెరికా సంయుక్త

రాజ్యాలు, ఆస్ట్రేలియా, కెనడా, దక్షిణ ఆఫ్రికాలలో ఇదే పద్ధతి అవలంబించబడినది.

సప్రూకమిటీ ప్రణాళిక :

జనాభా వ్యత్యాసములతో నిమిత్తం లేకుండా, సవర్ణ హిందువులకూ, మహమ్మదీయులకూ రాజ్యాంగపరిషత్తులో సమానప్రాతినిధ్యం ఉండవలెననే సిద్ధాంతంపైన సప్రూ కమిటీవారు మార్పుసూచించారు. ఇందువల్ల సాంఘిక ఐకమత్యం పెంపొందుతుందని వారి అభిప్రాయం. సర్ స్టాఫర్డు క్రిప్సు ప్రతిపాదనలో ప్రత్యేక నియోజకవర్గాలకు బదులుగా సమిష్టినియోజకవర్గములు సూచింపబడుటచేతనూ సమిష్టి నియోజకవర్గములు మహమ్మదీయులకు అనవసరంగా ఇచ్చిన అధిక ప్రాతినిధ్యమువలనకలిగే చెడుగులను రూపుమాపగల వనే ఉద్దేశంతోనూ కూడా ఈ మార్పును వారు సిఫారసు చేశారు. ఆ విధంగా మార్పుచేయబడిన రాజ్యాంగపరిషత్తులో బ్రిటిష్ఇండియా ప్రతినిధులు 160మంది ఈ కింది లెక్క ప్రకారం ఉంటారు. ప్రత్యేకప్రయోజనాలుకలవారు అనగా వర్తకులు, పారిశ్రామికులు, భూస్వాములు, విశ్వవిద్యాలయ పట్టభద్రులు, కూలీలు, స్త్రీలు, 16; సవర్ణహిందువులు 51; మహమ్మదీయులు 51; షెడ్యూల్డుతరగతులు 20; ఇండియన్ క్రైస్తవులు 7; సిక్కులు 3; అడవిజాతులవారు, వెనుకబడిఉన్న ప్రదేశాలలోనివారు 3; ఆంగ్లో—ఇండియనులు 2; యూరోపియనులు 1; తదితరులు 1.

## సమాన ప్రాతినిధ్య సిద్ధాంతం :

సవర్ణ హిందువులకూ, మహమ్మదీయులకూ సమాన ప్రాతినిధ్య ముండవలెననే విషయంలో అనేక ప్రధాన సమస్యలు బయలుదేరుతవి. వాటిని అన్నిటినీ ఇక్కడ చర్చించడానికి సావకాశంలేదు. కాని ఇందువలన భారతదేశంలోని ప్రధానసంఘములైన హిందువులూ, మహమ్మదీయులూ కలసి భారతస్వాతంత్ర్యంకోసం హృదయపూర్వకంగా పని చేసేటందుకు, ఎంతవరకు సావకాశం ఉంటుందో ఆలోచించవలసి ఉన్నది. ఒక సమష్టి ప్రయోజనంకోసం వివిధపక్షాలవారు పరస్పరం కలసిపనిచేయడమే ఐకమత్య మనిపించుకొంటుంది. అంతేకాక శాసనసభలకూ, కార్యనిర్వాహకవర్గములకూ, ఉద్యోగాలకూ, కాలక్రమేణా ప్రజాజీవితంలోని అన్ని వ్యవహారాలకూ, ఈ సమానప్రాతినిధ్య సిద్ధాంతాన్ని అనువర్తింప చేసేయెడల కలిగే ఫలితాలను సమగ్రంగా అర్థంచేసుకోవడం కూడా అవసరం. సప్రూకమిటీ వారి ప్రతిపాదనలో ఈ అన్నిటికీ సమానప్రాతినిధ్యం ఉండవలె ననే సూచింపబడింది. ఇందువల్ల ప్రత్యేక పాలకజాతి, ఒకటి తయారై, అధికసంఖ్యాక సంఘములయొక్కయు తదితర సంఘములయొక్కయు, అభివృద్ధికి అవకాశాలు చాలావరకు తగ్గిపోగలవు. సమిష్టినియోజకవర్గాలు ఈ చెడుగులను కొద్దిగా మాత్రమే తగ్గించగలవు. ఏ వ్యక్తియైనా సరే అతని తప్పు లేనంతవరకు అతడు అభివృద్ధిపొందడానికి సమానావకాశాలు లేకుండా చేయడంకంటె పాడుపని ఇంకొకటి లేదు.

సమానులను అసమానులుగానూ, అసమానులను సమానులుగాను చూడడం న్యాయం కాదు. సంఘాలకు వర్తింప చేయబడిన ఈ సమాన ప్రాతినిధ్య సిద్ధాంతంవలన వ్యక్తులకు పైన సూచింపబడినటువంటి అన్యాయం జరుగుతుంది. ఈ న్యాయాన్యాయాలు నిజంగా వ్యక్తులకు సంబంధించినవి కాని సంఘాలకు సంబంధించినవి కావు. ఇటీవలి వరకూ జరిగిన చరిత్ర అంతా—19వ శతాబ్దంలో ప్రజాస్వామ్యం ప్రతిష్ఠింపబడేవరకూ—అల్పసంఖ్యాకు లధికసంఖ్యాకుల పైన చలాయించిన నిరంకుశాధికార చరిత్రయే; ఈ సమాన ప్రాతినిధ్యసిద్ధాంతం తిరిగి, ఆ చెడుగును గూఢంగా ప్రవేశ పెట్టి కొనసాగిస్తుంది ఈసమస్యలను మనం వ్యక్తులను దృష్టిలో ఉంచుకొని ఆలోచించాలి. వీటివలనకలిగే కష్టనష్టాలను భరించేది చివరకు వ్యక్తులేకదా అనేసంగతి మనం మఱచిపోకూడదు. సంఘాలు వ్యక్తుల క్షేమంకోసమేర్పడిన పనిముట్లు మాత్రమేనని భావిస్తేగాని మనమీ సమస్యలను సరిగా పరిష్కరించజాలము. సమాన ప్రాతినిధ్య సిద్ధాంతం దీనిని గమనించడంలేదు. దానినిగుఱించి అనుకూలంగా చెప్పవలెనంటే 'చెడుగైనప్పటికీ ఇప్పటిపరిస్థితులలో అది తప్పని సరి; దానిని అంగీకరించకపోతే అంతకంటె కూడా ఎక్కువ కీడులు రావచ్చును. వాటిని రాకుండా చేసుకోవడానికీ పద్ధతి అవలంభించవలసి వచ్చింది' అని చెప్పాలి. కాని స్వాతిస్సిద్ధంగా అన్యాయమైన ఒక పద్ధతిని అధికసంఖ్యాక సంఘాలవారు చాలాకాలం సహించజాలక పోవచ్చుననే సంగతిని కూడా మనం మఱచిపోకూడదు.

చరిత్రలో సమాన ప్రాతినిధ్యం:

వైశాల్యంలోగాని జనసంఖ్యలోగాని పోలికలేక ఒకే ఫెడరేషన్‌లో చేరవలెనని ఆతురపడే భూఖండాల పరస్పర సంబంధ బాంధవ్యాలను సరిపుచ్చవలసిన సమస్య, రాజ్యాంగ నిర్మాతలను ఎదుర్కోవడం చరిత్రలో ఇది మొదటి సారికాదు. 1787లో అమెరికాలో ఒకే ఫెడరేషన్‌లో చేరిన 13 కామన్ వెల్తులూ సమానవైశాల్యం కలవికావు. 1900 లో ఒకే కామన్ వెల్తులో చేరిన ఆస్ట్రేలియన్ వలసరాజ్యాలు ఆరూ కూడా అటువంటివే. ఈ ఫెడరల్ రాజ్యాంగములను తయారుచేసిన పరిషత్తులు, (Conventions) పెద్ద రాజ్యాల వారు చిన్న రాజ్యాలపైన అధికారం చలాయిస్తారేమోనని భయపడి చాలా తర్జన భర్జన చేసినవి. కాని ఆ భయానికేమీ ఆస్కారంలేదని తేలింది. 'ఫెడరలిస్టు' అనే గ్రంథంలో హామిల్టన్ వ్రాసిన విషయాలు భారతదేశంలోని ప్రతి ప్రకటనకర్త పఠించతగినవి. పరిమాణంతో నిమిత్తంలేకుండా యూనిట్లన్నిటికీ సమానమైన వోటింగు హక్కు లీయడమును గూర్చి ఆ పుస్తకంలో వ్రాయబడిన విషయాలన్నిటినీ, భారతరాజ్యాంగ నిర్మాణ సమస్యను పరిష్కరించదలచుకొన్న ప్రతివ్యక్తీ హృదయస్థం చేసుకోవడం మంచిది. 'అన్ని రాజ్యాలకు సమానంగా వోటింగు అధికారముండవలెననేది కాన్ఫెడరేషన్‌లో మరొక ప్రత్యేక భాగం. రోడ్డు ద్వీపానికి, మాసాచూసెట్సు (Massa-chusetts) తోగాని, కనెక్టికట్ (Connect-cut) తోగాని, న్యూయార్కుతో

గాని సమాన ప్రాతినిధ్య ముండవలెననడమున్నా, రాజ్యాంగ సమాలోచనలలో పెన్సిల్వేనియా, వర్జీనియా, నార్తుకెరోలినాలతో, డెలవేర్ (Delaware) కు సమానాధి కారాలు ఉండవలెననడమున్నా న్యాయమైన ప్రాతినిధ్య సిద్ధాంతమునకూ పరిమాణానుగుణ భావమునకూ (Idea of proportion) కూడా వ్యతిరేకం. దీనిని ఆచరణలో పెట్ట డం, అధిక సంఖ్యాకుల అభిప్రాయం సాగిపోవలెననే ప్రజా స్వామ్య ప్రధాన సిద్ధాంతాన్ని ప్రతికూలించడమే అవు తుంది. అయితే అన్ని రాజ్యాలూ సమాన ప్రతిపత్తి గలవి గనుక రాజ్యాల మెజారిటీ వోట్లనే అమెరికన్ కాన్ఫెడ రేషన్ యొక్క మేజారిటీ అభిప్రాయంగా భావింపబడవలెనని యుక్తివాదం చేయవచ్చును. కాని ఈ రకపు తర్కవాదం, సామాన్య బుద్ధికితోచే న్యాయ్యమైన సూచనను కాదన జాలదు. ఈ అధిక సంఖ్యాక రాజ్యములు, అమెరికాలోని అల్పసంఖ్యాక ప్రజలు కలవి కావచ్చును. అమెరికాలోని 2/3 వంతు ప్రజలు, తక్కిన 1/3 ప్రజల యిష్టానుసారం జరిగే పరిపాలనకు చిరకాలం తలలొగ్గి ఉండవలసిందని ఇట్టి కృత్రిమవాదాలతోగానీ, కుహనా విభేదాలతోగానీ ఒప్పించ లేము......' అని హ్యామిల్టన్ వ్రాశాడు. చిన్న రాజ్యాల హృదయాందోళనను, నిజంగా శాంతింపచేసేది సమాన ప్రాతినిధ్యంకాదనీ, ఫెడరల్ ప్రభుత్వాధికారాలను నిస్సందే హంగా నిర్వచించి స్పష్టంగా తెలపడమేననీ కన్వెన్షన్‌లోని చర్చలు చక్కగా వెల్లడించినవి.. పెద్ద రాజ్యాలను

విభజించ వలెననీ, అనేక ఫెడరేషనులను నిర్మించ వలెననీ చేయబడిన యితర సూచనలన్నీ త్రోసివేయబడ్డవి. సప్రూ కమిటీచేసిన సూచనలలో మరొకవిషయం స్ఫురిస్తూన్నది. రాజ్యాంగ నిర్మాణ సభ్యులు రాష్ట్రీయ శాసన సభ్యులచే ఎన్నుకోబడవలెనని అనడంవలన, వయస్సు వచ్చిన వారందఱూ ప్రజాపరిషత్తును ఎన్నుకొనేటట్లు చేసి రాజ్యాంగ నిర్మాణంలో ప్రజలకు జోక్యం కలిగించడం వారొప్పుకోలేదని అర్థమవుతున్నది. సప్రూకమిటీవారు, ఈ సందర్భంలో వయోజన నియోజక వర్గముల కెందుకు వ్యతిరేకులో కారణాలను చెప్పలేదు. కాని వారే కొత్త రాజ్యాంగ శాసనం ప్రకారం అమలులోకి వచ్చే యూనియను శాసన సభకు వయోజన నియోజక వర్గాలను (Adult suffrage) ప్రతిపాదించారు. ఇది పరస్పర విరుద్ధంగా వున్నది. కొత్తగా రానున్న శాసన సభల ఎన్నికలకు వయోజన నియోజక వర్గములు ప్రమాద రహితములై ఆచరణ యోగ్యములైన యెడల, రాజ్యాంగ పరిత్తు సందర్భంలో కూడా వాటినే ఎందుకు ఉపయోగించుకో కూడదో కారణం కనుపించదు.

## గయరు ప్రతిపాదన :

1939లో కాశీ విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసంలో సర్ మారిస్ గయరు చేసిన సూచన న్యాయశాస్త్ర ప్రవీణుడుగా ఆయనకు గల ప్రఖ్యాతినిబట్టి కొంత వరకూ, ఆయన సిఫారసుచేసిన రాజ్యాంగ నిర్మాణ సంస్థలో స్వత

స్పిద్ధంగా ఉన్న శుభలక్షణాలనుబట్టి కొంతవరకూ, ప్రజల దృష్టిని సహజంగా అది ఆకర్షించగలిగింది. కొన్ని ఆధునిక రాజ్యాల రాజ్యాంగ శాసనములను రచించిన సంస్థలను గూర్చి సింహావలోకనం చేసిన పిమ్మట, చిన్నచిన్న ప్రజా పరిషత్తులచే తయారుచేయబడిన కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా, అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగముల వంటివి, రాజ్యాంగ శాసనములే ఇంతవరకూ జయప్రదంగా పనిచేస్తూన్నవనీ, పెద్దపెద్ద ప్రజాపరిషత్తులచే విప్లవయుగంలో తయారైన ఫ్రెంచి రాజ్యాంగ శాసనమువంటివి గానీ, 1848, 1919 లో తయారైన జర్మను రాజ్యాంగ శాసనములవంటివి గానీ కొద్దికాలం మాత్రమే సజీవంగా ఉన్నవనీ ఆయన అభిప్రాయ మిచ్చారు. దీనినిబట్టి భారత రాజ్యాంగచట్టం, కాంగ్రెసు సూచించిన పెద్ద రాజ్యాంగ నిర్మాణసభచేగాక చిన్న ప్రజా పరిషత్తుచే తయారుచేయబడవలెనని గుణ పాఠం నేర్చుకోవలెను. ఆయన కేవలం చరిత్రాత్మక విషయాలనుబట్టి మాత్రమే ఈ సిఫారసు చేయలేదు. ఇంకా కొన్ని సుగుణాలు కూడా దీనిలో ఉన్నవని ఆయన విశ్వాసం. రాజ్యాంగ సమస్యలు పెద్దపెద్ద సభలలోకంటె చిన్నచిన్న సభలలోనే ఎక్కువ సులభంగానూ, అందరికీ అనుకూలంగానూ పరిష్కారం కాగలవు. చిన్న పరిషత్తులో 'ఒకరినొకరు బాగా తెలుసుకొంటారు. ఇతరుల వాదనలోని బలమును తమ వాదంలోగల దౌర్బల్యమునూ గ్రహించ డానికి అందువలన వీలుకలుగుతుంది...ఒక విధమైన సమిష్టి

భావం ఉత్పన్నమవుతుంది. తద్వారా ఫలోత్పత్తికి పట్టుదల కాకపోయినా సమిష్టిగా కోరిక అయినా కలుగుతుంది.' అని సర్ మారిస్ గయరు అభిప్రాయం. పైగా రాజ్యాంగ నిర్మాణం చాలా కష్టమైనపని. అందుకు అంతులేని ఓర్పు కావాలి. ఎంతో కృషిచేయాలి. అలా అయితేనే శాశ్వత ఫలితాలు లభిస్తవి. కాబట్టి ఈపనికి చిన్న సంస్థయే బాగా తగి ఉంటుంది. సర్ మారిస్ గయరు ప్రత్యేకం చెప్పక పోయినప్పటికీ ఈ చిన్న పరిషత్తులో మరొక సుగుణం కూడా ఉన్నదనుకోవచ్చును. దీనిలో సమాలోచనలను రహస్యంగా జరుపుకోవచ్చును. తీవ్ర విభేదాలుకల సమస్యలనుగూర్చి జరిగే చర్చలు రహస్యంగా ఉండడం చాలా అవసరమని, అమెరికా దక్షిణ ఆఫ్రికాల రాజ్యాంగ నిర్మాణ సభల యొక్కయు, తదితర ప్రజా పరిషత్తులయొక్కయు అనుభవములనుబట్టి తెలుస్తూ న్నది. నేటి ఇండియాలో అట్టి తీవ్ర విభేదాలుకల సమస్యలనేకము లున్నవనే మాట ఎవ్వరూ కాదనజాలరు.

**పరిమాణం ప్రధాన విషయంకాదు :**

రాజ్యాంగ పరిషత్తు చిన్నదిగా ఉండవలె ననడానికి ఇవన్నీ బలిష్ఠములైన వాదములే. కాని సర్ మారిస్ గయరు అందులోని సభ్యు లేవిధంగా ఎన్నుకోబడవలెనో సూచించియుండలేదు. రాజ్యాంగ నిర్మాణసభ పెద్దదిగా ఉండవలెననడం ప్రధానంకాదు. పెద్దదీకావచ్చు, చిన్నదీ కావచ్చు ; కాని అది ప్రజలలో నుండి పుట్టినదా లేదా

అనేది ముఖ్యవిషయం. రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుకావలె ననే వారందఱూ, అందులోని సభ్యులు ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రజలలోనుండి ఎన్నుకోబడవలెనని ఉద్ఘాటిస్తూన్నవారే. అమెరికా సంయుక్త రాష్ట్రాలు, కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికాల రాజ్యాంగ శాసనములను తయారు చేసిన ప్రజాపరిషత్తులు కొన్ని ప్రత్యక్షంగానూ, మఱికొన్ని పరోక్షంగానూ ప్రజలలోనుండి ఎన్నుకోబడినవే నన్నసంగతి యిదివరకే నిరూపించి ఉన్నాము. ఆవిధంగా తయారైన రాజ్యాంగ శాసనములను ఆమోదించడంలో అధమం మూడు సందర్భాలలోనైనా సామాన్య ప్రజలకు సంబంధం కలిగింది. ప్రజా సామాన్యముయొక్క అధికారం పొందకుండానే, ప్రధానులున్నూ వారిచే పేర్కొనబడిన వారున్నూ నిర్మించిన కెనడా రాజ్యాంగ చట్టమునకు ప్రతికూలంగా చేయబడిన విమర్శనమును కూడా ఇదివరకే ఉదాహరించి ఉన్నాము. అదే కారణంగా మొదటి ఆస్ట్రేలియన్ కామన్ వెల్తుబిల్లు అపజయం పొందిన సంగతి కూడా చెప్పిఉన్నాము. రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు సమావేశ పఱుపబడినప్పుడు కూడా, నిజంగా రాజ్యాంగచట్టము వ్రాసే పని చిన్నచిన్న కమిటీలుగాని లేదా యేకొద్దిమంది వ్యక్తులోగాని చేస్తూఉంటారు. అంతేకాక నేడు ప్రజాస్వామ్య సంస్థ ప్రతిదీకూడా పక్ష సిద్ధాంతంపైన నడుస్తూన్నది. రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలుకూడా రాజకీయ పక్షాలచేతనే నడుపబడుతవి. అలా ఎన్నుకోబడిన సభ్యులు పార్టీనాయకుల సలహా యాజమాన్యములక్రింద పనిచేస్తూ

ఉంటారు. వివిధ ప్రయోజనాలూ, విభిన్నాభిప్రాయాలూ కల వారికి ప్రాతినిధ్యం వహించవలసిన శాసన సభలు సాధారణంగా పెద్దవిగా ఉంటవి. గనుక వాటి లోపాలను సాధ్యమయినంత వరకు తగ్గించడానికే ప్రజాస్వామ్యవాదు లీ విధానమును అవలంబించారు. ప్రజాస్వామ్య పరిషత్తు అనగా యేదో ఒకచోట చేరిన ప్రజల మూకగానీ, జనులగుంపుకానీ కాదు. అనుభవంవలన తయారుచేయబడిన నియమావళిని 'తు' 'చ' తప్పకుండా అనుసరిసూ సమాలోచనలు చేయడానికి సమావేశ మవుతుంది. వివిధ పక్షాల నాయకుల పరస్పర సమాలోచనల ఫలితంగానే అక్కడ నిర్ణయాలు చేయబడుతవి. కెనడా, సంయుక్త రాజ్యాల రాజ్యాంగ శాసనములు చిన్న చిన్న సభలచే నిర్మింపబడినవి కాబట్టి జయప్రదము లైనట్లున్నా జర్మను రాజ్యాంగ చట్టములు ఎక్కువమంది వోటర్ల చేత ఎన్నుకోబడిన పెద్ద పరిషత్తులచే వ్రాయబడి నందున అవి అపజయం పొందినట్లున్నా అనుకోవడానికి తగిన కారణాలు కనిపించవు ఈ అన్ని సందర్భాలలోనూ కూడా రాజ్యాంగ నిర్మాణ సభ పెద్దదైనా చిన్నదైనా, యెక్కువ భేదం కనిపించి ఉండేదికాదు. కాలానుగుణంగానే అన్ని నిర్ణయాలూ జరిగి ఉండేవి. దీనినే కారల్ బీకర్ ప్రతి యుగంలోనూ ఉండే 'వైజ్ఞానిక శీతోష్ణస్థితి' (Intelectual Climate) అన్నాడు. ప్రపంచక చరిత్రలో ఒక్కొక్క యుగంలో కొన్నికొన్ని రాజకీయాభిప్రాయాలు ప్రాముఖ్యం వహిస్తూ ఉంటవి. వాటి ప్రభావమునకు ప్రతి

రాజ్యాంగ నిర్మాతా లోబడవలసి వస్తుంది. పదునెన్మిదవ శతాబ్దములో తయారయిన యేరిపబ్లికను రాజ్యాంగములో నైననూ, (రాజ్యాంగ నిర్మాణ సభ పెద్దదైనప్పటికీ చిన్నదైనప్పటికీ) మానవుని ప్రాధమిక హక్కులనుగూర్చి, అధికార విభజనమును గూర్చి చెక్కులూ బ్యాలన్సులనుగూర్చి ఉదాహరింపబడి ఉండేది. ఈనాడు మన రాజకీయాభిప్రాయాలన్నీ దాదాపు ఒక అరడజను పద్ధతులను అనుసరించి ప్రదక్షిణం చేస్తూన్నవి.—ప్రజాస్వామ్య (Democrasy) అధికార కేంద్రీకరణ విధానములు, (Totalitarianism) పార్లమెంటరీ, నాన్ పార్లమెంటరీ, విధానములు, స్విట్జర్లాండు కార్యనిర్వాహక వర్గమునకు అను రూపములైన అనేక విధములగు కార్యవర్గములను నిర్మించే పద్ధతి, ప్రాంతీయప్రాతినిధ్యము (Territorial Representation) ప్రాంతీయేతర ప్రాతినిధ్యము (Non-territorial representation) రాజకీయ సంబంధంలేని చట్ట సమ్మతములైన సంస్థలచే ప్రభుత్వ పరిశ్రమల (State enterprises) బరిపాలనము, పక్షపాతములేని సివిల్ సర్వీసు, చట్టబద్ధమైన రాజ్యపాలనము—ఇవీ నేటి రాజకీయ భావాలు. ప్రతి రాజ్యాంగ నిర్మాణసభా—పెద్దదైనప్పటికీ చిన్నదైనప్పటికీ—ఈ భావాల హద్దులను అతిక్రమించకుండా తమ నిర్ణయాలను చేయాలి. అసలు సరికొత్త రాజ్యాంగమును సృజించడం సాధ్యమూకాదు, వాంఛనీయమూకాదు. ప్రజాస్వామ్యంలో విశ్వాసంలేనివారు అందులో విశ్వాసమున్నవారు నిర్మించే రాజ్యాంగానికి

విభిన్నమైన దానిని సృజిస్తా రనేమాట నిశ్చయమే. కాని, నిజమైన ప్రజాస్వామ్య వాదులతోకూడిన వివిధ పరిమాణ ములుగల సంస్థలచే నిర్మింపబడిన ప్రజాపాలిత రాజ్యాంగ విధానములలో ప్రధాన విషయములను సంబంధించి విశేష భేదం ఉండదు. అయితే రాజ్యాంగ పరిషత్తు చిన్నదిగా ఉండవలెననే వాదమును ఈ పై విషయాలు పూర్తిగా భగ్నం చేయజాలవు. రాజ్యాంగ పరిషత్తుకు పరిమాణము ప్రధానం కాదనడానికి మాత్రమే ఇదంతా చెప్పవలసి వచ్చింది. రాజ్యాంగ నిర్మాణ సంస్థ ప్రజా సమూహమునుండి అధికారముకు పొందవలెననేదే నిజంగా ప్రధాన విషయం. వయస్సువచ్చిన వారందరివోట్లతో ఎన్నుకోబడిన రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు కావలె ననడానికి ముఖ్య వాదంకూడా యిదే.

ఫ్రాన్సు, జర్మనీ దేశాల రాజ్యాంగ నిర్మాణ సభ లున్నూ— మొదటి ప్రపంచ యుద్ధానంతరం మధ్య యూరపు లోనూ, తూర్పు యూరపులోనూ కల దాదాపు అన్ని దేశాలలోనూ యేర్పాటైన రాజ్యాంగ నిర్మాణ సభలు తయారుచేసిన రాజ్యాంగ చట్టములు అపజయం పొందిన కారణములను ఇక్కడ చర్చించజాలము. వాటిని చర్చించి నందువలన కలిగే ప్రయోజన మొక్కటే. ప్రజాస్వామ్యము భగ్నమై నియంతృత్వము నెత్తికెక్కిన పరిస్థితులన్నీ చారిత్ర కంగా వివరింపబడడమే. కాని ఆ పరిస్థితులతోపాటు ఆయా రాజ్యాంగ నిర్మాణ సభలు విస్తీర్ణతనుకూడా ఒకానొక కారణంగా ఉదాహరించడానికి సావకాశం ఉంటుందనడం

సందేహం. జాత్యహంకారం, యూరోపియన్ సామ్రాజ్య తత్వం, కరడుగట్టిన జాతీయ స్వాతంత్ర్య సిద్ధాంతం, ఆధ్యాత్మిక ప్రమాణములను త్యజించడం—ఇవన్నీ ప్రజాస్వామ్యం భగ్నం కావడానికి కారణా లైనంతగా ప్రజా పాలిత ప్రభుత్వాల రాజ్యాంగ చట్టములలోని లోపములు కారణాలు కావు.

తక్కిన సూచనలు :

ప్రస్తుతం రాష్ట్రాలకు ప్రధానులుగా ఉన్నవారూ, వెనుక ప్రధానులుగా పనిచేసినవారూ కలసిఉన్న ఒక ప్రతినిధి సంస్థ, భావి రాజ్యాంగ శాసనముయొక్క ప్రాతి పదికలను చర్చించవలెనని పంజాబు ప్రధాని కీ॥ శే॥ సర్ సికందర్ హయత్ ఖాన్ చేసిన సూచనను ఇక్కడ విశేషంగా విమర్శించవలసిన పని లేదు. ప్రజాస్వామ్య విధానంలో అటువంటి సంస్థ యెన్నటూ రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుయొక్క స్థితిని పొందజాలదు. రాజ్యాంగ నిర్మాణమునకు ముందు జరుగవలసిన పరిశోధనా కార్యక్రమమునకున్నూ, అసలు రాజ్యాంగ చట్ట నిర్మాణమునకున్నూ కల భేదం హృద్గతం చేసికొని ఉండినట్లయితే ఇటువంటి సూచనలకు తావే ఉండేది కాదు. అనగా ఆయా గ్రంథకర్తలకీ భేదం తెలియనే తెలియదని కాదు. ఈ భేదముయొక్క ప్రాముఖ్యతను వారు పూర్తిగా గమనించలేదు. అంతే. పైన చెప్పబడిన పరిశోధనా కార్యక్రమమును సాగించేటందుకు భారతీయ ప్రతినిధుల అవసరమునుగూర్చి రాజప్రతినిధి 1940 ఆగస్టులో చేసిన ప్రకటనలో ఒకసారి ఉదహరించిఉన్నాడు. తరువాత

ప్రస్తుత వైస్రాయి 1944 లో మహాత్మా గాంధీకి వ్రాసిన ఉత్తరంలో దానినే ఈ విధంగా పునరుద్ఘాటించాడు. 'భారతీయ నాయకులు సహకారం చేయడానికి సంసిద్ధంగా ఉన్న తక్షణం, రాజ్యాంగ నిర్మాణమునకు కావలసిన ప్రాథమిక కార్యక్రమం ఎందుకు ప్రారంభం కాకూడదో నాకు తెలియకుండా ఉన్నది' అని వ్రాశాడు. నేటి వైస్రాయీ తరువాత కొద్ది కాలమునకు సర్ మారిస్ గయరూకూడా అటువంటి అభిప్రాయాన్నే వెల్లడించారు. 'రాజ్యాంగ పరిషత్తువంటి సంస్థను దేనినీ, నిర్మించడానికింకా తరుణం రాలేదు. సంగతి సందర్భాలను ముందుగా బాగా పరిశీలన చేయనియెడల, రాజ్యాంగ పరిషత్తుకూడా జయం పొందడం కష్టం; అందుకొఱకు కమిటీలను నియమించవలెను;' అన్నా రాయన. ఆ కమిటీలు ముందుగా విషయ పరిశీలనము మాత్రమే చేసి అసలు రాజ్యాంగ నిర్మాణ కార్యక్రమమును, రాజ్యాంగ పరిషత్తుకే వదలివేయవలెనని కూడా ఆయన స్పష్టీకరించారు. దేశంలో అటువంటి పరిశీలనా కార్యక్రమం కొనసాగుతూనే ఉన్నది. వివిధ రాజ్యాంగ ప్రణాళికలు తయారు కావడం దాని ఫలితమే. సప్రూ కమిటీవారీ సందర్భంలో చాలా ఉపకారం చేశారు. అటువంటి పనికి అంతులేని అవకాశం ఉంది.



# 6. భారతదేశపు రాజ్యాంగ నిర్మాణసభ

స్వతంత్ర భారత రాజ్యాంగ నిర్మాణమునకు సూచించబడిన తదితర పద్ధతులన్నీ యేదో ఒక విధంగా లోప భూయిష్ఠములని తేలిన తరువాత, ఇక వయోజన నియోజక వర్గములనుండి ఎన్నుకోబడిన ప్రజా పరిషత్తు ఒక్కటే ఆ కార్యమును కొనసాగించడానికి తగిన సంతృప్తికరమైన సంస్థ అని సహేతుకంగా తెలిసి వచ్చింది. 'భారతీయులే, భారతీయ ప్రజలకోసం, భారతీయాభిప్రాయాలకు అనుగుణంగా భారత రాజ్యాంగ శాసనమును నిర్మించుకో వలెనని బ్రిటిష్ వారూ హిందూ దేశస్థులూ కూడా అంగీకరించిన స్వయం నిర్ణయ సిద్ధాంతమునకు అనుగుణమైన సంస్థ ఈ ప్రజా పరిషత్తు ఒక్కటే. ఈ సిద్ధాంతప్రకారం రాజ్యాంగ చట్టమును తయారుచేసే పనికి భారతీయులందరూ పూనుకొనవలెనని అర్థం; కాని వారిలో యేదో ఒక భాగం పూనుకొంటే చాలునని కాదు. ఇది రాజ్యాంగ పరిషత్తుకు బలవత్తరమైన అనుకూలవాదం. 1934 నాటికే జవహర్ లాల్ నెహ్రూ దీనిని వెల్లడించాడు. 'రాజకీయంగానూ జాతీయంగానూ కూడా కేవలం భారతీయులే తమ భవితవ్యమును నిర్ణయించుకో వలసినవారని అంగీకరించవలెను. అలా అంగీకరించినప్పుడు తమ రాజ్యాంగ చట్టమును తయారు చేసుకోవడానికి భారతీయులకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండి తీరాలి. అత్యంత విశాలమైన వోటింగు పద్ధతిని ఎన్నుకో

బడిన ప్రజా పరిషత్తు మాత్రమే ఆపని చేయగలుగుతుం దనేమాట వేఱుగా చెప్ప నక్కర లేదు; స్వాతంత్ర్యంలో నమ్మక మున్నవారికి ఇంతకంటే గత్యంతరం లేదు. సరికదా, అధినివేశ ప్రతిపత్తి అంటూ ఏమేమో అస్పష్టంగా మాట్లాడే వారుకూడా భారత రాజ్యాంగ చట్టం భారతీయులచేత నే నిర్ణయింప బడవలెనని అంగీకరించి తీరాలి. అయితే ఈ నిర్ణయం ఎలా జరగాలి? తమంతట తాముగా ఏర్పడి, బహు జనాన్ని బయట విడిచిపెట్టి, కొద్దిమంది స్వార్థపరుల సమూహములకు మాత్రం ప్రతినిధులని చెప్పతగిన అఖిలపక్ష మహాసభలవంటి సంస్థలద్వారా ఈ నిర్ణయం జరగడానికి వీలు లేదు. విశాల ప్రాతినిధ్యంగల బలవత్తరమైన సంస్థ అయినప్పటికీ భారత జాతీయ మహాసభవల్లకూడా ఇది జరగకూడదని మన మంగీకరించితీరాలి.........భారత రాజకీయ లక్ష్యమునకు సంబంధించిన అంతిమ నిర్ణయం, ప్రజా సామాన్యముచే ఎన్నుకోబడిన రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుద్వారా ప్రజల చేతులలో ఉండాలి' అన్నాడు జవహర్‌లాలు నెహ్రూ.

## అనేక వాద ప్రతివాదాలను పరిష్కరిస్తుంది

ఎవరు ఎవరికి ప్రాతినిధ్యం వహిస్తున్నారు, అని చెలరేగుతూన్న అంతులేని తగాదాలనుబట్టి ఆలోచించినా ఇదే ఎక్కువ అవసర మని అనిపిస్తూన్నది. భారతీయులందఱికీ ప్రాతినిధ్యం వహిస్తూన్నానని కాంగ్రెసు అంటూన్న మాటను బ్రిటిష్ వారే కాక దేశంలోని కాంగ్రెసేతర పక్షాల వారందరూకూడా తీవ్రంగా కాదంటూన్నారు. అదేవిధంగా ముస్లిం ప్రజా

సామాన్యమునకు తా మొక్కరమే ప్రతినిధులమని .ముస్లిం లీగు వారు చెప్పే మాటలనుకూడా తదితర పక్షాలవా రందరూ ఆక్షేపిస్తూన్నారు. దేశంలోని ప్రతి సంఘం విషయ లోనూ పోటీ సంస్థలుండి ప్రతి సంస్థా సంఘమంతకూ తానే ప్రాతినిధ్యం వహిస్తూన్నా నంటూన్నది. రాండు టేబిలు సభకు పిలువబడిన యాభై ఏడుమంది సభ్యులూ భారత దేశంలోని 40 కోట్ల మంది ప్రజలకూ నిజమైన ప్రతినిధులని బ్రిటిష్ ప్రభుత్వం చాటుతూండగా, ప్రభుత్వంవారు తమ అనుకూలురను ఏరికోరి తెచ్చుకొన్నారనీ, వారు చెప్పే మాట భారత ప్రజాసామాన్యం చెప్పేమాట కాదనీ, కాంగ్రెసు చాటింది. భారతదేశ స్వాతంత్ర్యమును కోరే ప్రతిభావంతులందరూ ప్రజా సామాన్యమునకు ప్రతినిధులు కారని బ్రిటిషు ప్రభుత్వం నిరంతరం వాదిస్తూనే ఉన్నది. 1888 లో డఫరిన్ ప్రభువు అదే అభిప్రాయాన్ని వెల్ల డించాడు, 'దేవుని కళ్ల ఎదుట, సభ్యత సమక్షంలో, బ్రహ్మాండమైన బహువిధ సామ్రాజ్య సంరక్షణకు బాధ్యత వహించే బ్రిటిష్ ప్రభుత్వంవారు, అత్యంత కనిష్ఠసంఖ్యాకు లైనవారికి (కాంగ్రెసుకు) తమ పరిపాలనా వ్యవహారములను అప్పగించి ఊరుకొంటారని న్యాయ బుద్ధిగల మనిషి ఎవ రైనా అనుకోవడానికి వీలున్నదా? ఆ సంస్థ ప్రజలకు బాధ్యత వహిస్తూన్నదనేటందుకు నా కేమీ కారణాలు కని పించడం లేదు. తమంతట తాముగా ఏర్పడిన ఇటువంటి సంస్థలు, పూజనీయమైన ఇంగ్లీషువారి నిష్పాక్షిక పరిపాలన

మునకూ, తమకూ మధ్య అనవసరంగా జోక్యం కల్గించు కోవడం ఊహించుకొన్న మాత్రాన అసంఖ్యాకులైన ప్రజలు అప్పుడే ఎంతో భయపడుతూన్నారని తెలియడంలేదా" అన్నాడు డఫరిన్ ప్రభువు. తరువాత సుమారు ముప్పై సంవత్సరాలకు 'ఎక్కువ రాజకీయాధికారాలు కావలెనని ప్రజలలో నిజంగా ఎన్నోవంతు అడుగుతూన్నారు?' అని మాంటేగు, చెమ్సు ఫర్డులు ప్రశ్నించారు. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు వాటిని కోరడంలేదనికూడా వారు నిస్సందేహంగా చెప్పివేశారు. 1934-35 ల లోని సైమన్ కమిషనువారూ జాయింటు పార్లమెంటరీ కమిటీవారూకూడా దాదాపు అదే అభిప్రాయంలో ఉండిరి. అయితే వారు తేల్చిన పర్యవసానము 1888 లో డఫరిన్ ప్రభువు తేల్చిన పర్యవసానముకాదు. రాజకీయ చైతన్యంగల వర్గాలవారెంతవరకు ప్రజానీకమునకు నిజంగా ప్రాతినిధ్యం వహిస్తూన్నారు అనే విషయాన్నిగూర్చి నేడుకూడా వాద ప్రతివాదాలు చెలరేగుతూనే ఉన్నవి. ఈ వివాదానికి ఎప్పటికీ అంతు ఉన్నట్లు కనిపించదు. దేశముయొక్క రాజకీయాభివృద్ధికి ఆటంకంగా ఉండకపోయినట్లయితే ఇటువంటి చర్చను గూర్చి అంతగా పరిగణించవలసిన పని, ఉండేదికాదు. నిజానికిది చాలా అభ్యంతరంగా ఉన్నది. దేశం స్వతంత్ర ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని పొందకుండా ఇది అడ్డంకుగా ఉన్నది. కాబట్టి ఈ వివాదాన్ని అంతం చేయడానికి ఏదైనా ఒక మార్గాన్ని ఆలోచించాలి. వివిధ రాజకీయ సంస్థల

రొయొక్కయు, తరగతులయొక్కయు నాయకత్వంలో ప్రజా సామాన్యానికి విశ్వాసమున్నదో లేదో వారితో సంప్రతించి తెలుసుకోవడమే సహేతుకమైన న్యాయమార్గం.

భారతీయ మేధావు లెంతవరకీ దేశానికి ప్రాతినిధ్యం వహిస్తూన్నారనే విషయంలో బ్రిటిష్‌వారికీ జాతీయవాదులకూ మధ్య చర్చ జరుగుతూన్నట్లుగానే, జాతీయవాదులొక వంకనూ, కులతత్వవాదులూ, విభాగవాదులూ (Partitionists) మరొకవంకనూచేరి, చివర రెండు కక్షలవారూ – వివిధసంఘాలకు – ముఖ్యంగా అల్పసంఖ్యాక సంఘములని చెప్పబడేవారికి–యెంతవరకు ప్రాతినిధ్యం వహిస్తూన్నారనే విషయమునుగూర్చి వివాదపడుతూ ఉన్నారు. పాకిస్థాన్ ఉద్యమాన్ని యేకగ్రీవంగా మహమ్మదీయులంతా ప్రోత్సాహపరుస్తూన్నారని ముస్లింలీగు వారు బల్లగుద్ది చెబుతూన్నారు. కాంగ్రెసువారూ, జాతీయ మహమ్మదీయులూ అది సరికాదని అంతగట్టిగానూ అంటూన్నారు. ఈ ఉభయుల మధ్యనూ ఒడంబడిక కుదరడం అసంభవమయిపోయింది. అందువలన రాజకీయ ప్రతిష్టంభన మేర్పడింది ఈ వాక్కలహం అంతమయి రాజకీయ ప్రతిష్టంభన పరిష్కారం కావలెనంటే వివిధసంఘాల ప్రజకూ విజ్ఞాపనంచేసి వారి నిజమైన కోర్కెలను కనుక్కోవడ మొక్కటేమార్గం. ఈ సందర్భంలో గాంధీజీ ఇలా అన్నారు: "సాంఘిక సమస్యను న్యాయముగా పరిష్కరించడానికి ప్రజాపరిషత్తు అత్యంత సులభమైన పద్ధతిని చేకూరుస్తుంది. గణితశాస్త్రరీత్యా సరిగా యెవరు

యెవరికి ప్రాతినిధ్యం వహిస్తూన్నారనే సంగతి నేడు మనం చెప్పలేకుండా ఉన్నాము. విశాలతమ ప్రాతినిధ్యంగల అత్యంత పురాతనసంస్థ కాంగ్రెసు అనే సంగతి వాస్తవమైనప్పటికీ, పూర్ణ రాజకీయ సంస్థలు కొన్నీ అర్ధ రాజకీయ సంస్థలు (Semi political bodies) కొన్నీ కాంగ్రెసుయొక్క సార్వజనిక ప్రాతినిధ్యమునుగూర్చి ప్రశ్నించడానికి సావకాశమున్నది; అలా ప్రశ్నిస్తూన్నవి కూడాను. ముస్లింలీగు మహమ్మదీయులకు ప్రాతినిధ్యం వహిస్తూన్న అత్యంత విశాల సంస్థ అనడానికేమీ సందేహంలేదు. కాని అనేక ముస్లిం సంస్థలు - పేరూ ఊరూ లేనివి కావు-ముస్లింలీగువారు చెప్పే ఈ మాటను కాదంటూన్నవి. కనుక రాజ్యాంగ పరిషత్తు అన్ని సంఘాలవారికీ సరియైన దామాషాలో ప్రాతినిధ్యం వహించగలదు. పోటీ సంస్థలన్నింటికీ సంపూర్ణ న్యాయం చేయవలెనంటే ఇంతకంటె వేరొకమార్గంలేదు. ఇదికాకపోతే సాంఘికవాదులుగానీ తదితరులుగానీ చేసే పరస్పర వాదనలకు అంతు ఉండదు.”

## వయోజన నియోజకవర్గములు (Adult Suffrage)

రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు నిజంగా ప్రజలకు బాధ్యతవహించి అది ఎందుకుద్దేశింపబడినదో ఆ పనిని - అనగా ప్రాతినిధ్యమును గూర్చిన సందేహాలనన్నిటినీ పరిష్కరించే పనిని - నిర్వహింపవలెనన్న యెడల అందులోని సభ్యులు వయస్సు వచ్చినవారందఱి వోట్లతోనూ ఎన్నుకోబడవలెను. చదువుకొన్నవారికీ, పన్ను చెల్లించగలవారికీ,

ఆస్తిఉన్నవారికి మాత్రమే వోటింగు అధికారమిచ్చి ప్రజా పరిషత్తు ఎన్నికలు జరిపేయెడల కొద్దిమంది అభిప్రాయం మాత్రమే ప్రకటితమవుతుంది. ఆ విధంగా తయారుచేయ బడిన రాజ్యాంగ చట్టమును జాతీయసమాఖ్య (National Instrument) అనడానికి వీలులేదు. పైపెచ్చు నేను ముస్లిం లీగువారున్నూ, వారి రాజకీయాభిప్రాయాలతో ఏకీభవించే వారున్నూ అతితీవ్రంగా ఎదిరిస్తూన్న వర్గోజన నియోజక విధానమును, ముఖ్యంగా మహమ్మదీయ ప్రజాభిప్రాయ మును సంతృప్తిపరిచేటందుకే కాంగ్రెసు మొట్టమొదట ప్రతిపాదించింది. కాంగ్రెసు చరిత్రకారకుడు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు "మహమ్మదీయుల కోరికలను మన్నించి వారి ప్రయోజనాలను కాపాడేటందుకే వర్గోజన నియో జక విధాన మవలంబింపబడినది. చదువుకొన్నవారికిగానీ, ఆస్తికలవారికిగానీ మాత్రమే వోట్లుండవలెనన్నయెడల వారికి నష్టం కలుగక తప్పదు. వారింతవరకూ వర్గోజన నియోజక విధానముగానీ, లేదా, మహమ్మదీయ జనసంఖ్య హిందూ జనసంఖ్యకు ఏ దామాషాలో ఉన్నదో మహమ్మ దీయ వోటర్లకూడా హిందూ వోటర్లకు అదే దామాషాలో ఉండేటట్లు చూచే మరొక విధానముగానీ కావలెనని కోరు తూన్నారు. అటువంటి నియోజక విధానము అధిక ప్రాతి నిధ్యం (Weightage) వలనగానీ ప్రాతినిధ్యమును (Handi- cap) తగ్గించడం వలనగానీ సాధ్యపడుతుంది. కాని అది ప్రజాస్వామ్య విధానం కాజాలదు. అప్పటికీ అల్పసంఖ్యా

కులు స్వరాజ్యమును కోరనియెడల మనస్థితి ప్రపంచమునకు తెలుస్తుంది. వారు కోరేయెడల వారి స్థితిగతులను మనం తెలుసుకోగలము. ప్రజాపరిషత్తు సిద్ధాంతంగానీ, దానికి అనుబంధంగానో, అనుసరణీయంగానో ఉండే సాంఘిక సమస్యా పరిష్కార సిద్ధాంతంగానీ యిదే.''

ఇతర ప్రయోజనాలు :

స్వతంత్ర భారత భావిరాజ్యాంగ నిర్మాణమునకు తగిన సంస్థ ప్రజాపరిషత్తే అనడానికి, వీలుగా మఱిరెండు ప్రయోజనాలు అందులో కలవు. రాజకీయ స్వాతంత్ర్యమే పరమావధి కాదనీ, ఆస్తికలవారి యొక్కయు ప్రత్యేకహక్కులు కలవారి యొక్కయు చేతులలో తరతరాలనుండీ చిక్కుకొనిఉన్న ప్రజాసామాన్యముయొక్క ఆర్థిక సాంఘికాభివృద్ధికది మార్గము మాత్రమేననీ జవహరలాలు నెహ్రూవంటి సుప్రసిద్ధ భారతనాయకులు విశ్వసిస్తున్నారు. భారతదేశంలోని నేటి సాంఘికసమస్య, చాలావరకు రాజకీయోద్యోగాల కోసం ఆరాటపడే మధ్యతరగతులకు చెందిన విద్యావంతుల కృత్రిమ సృష్టి; ప్రతిసంఘంలోనూ నూటికి 99 మందికి వర్తించే సాంఘిక ఆర్థిక సమస్యయే నిజమైన అసలు సమస్య. ఏ రాజ్యాంగ నిర్మాణసభకైననూ ఈ సమస్యా పరిష్కారమే ప్రధానాశయంగా ఉండాలి. ప్రజాపరిషత్తు సిద్ధాంతానికి వ్యతిరేకియైన 'సర్ మారిస్ గ్వయరు కూడా భారతదేశంలో నేటి సాంఘిక ఆర్థికసమస్యకు ఎక్కువ

ప్రాముఖ్యత యిచ్చాడు; నేటి రాజకీయాలలో బహుప్రచారంలో ఉన్న పాకిస్థాన్ సమస్యకంటెకూడా అది చాలా ఎక్కువ ప్రధానసమస్య అని ఆయన అభిప్రాయం. కాబట్టి ఇండియాకు నిజమైన 20 వ శతాబ్దపు రాజ్యాంగచట్టము నిర్మించగలిగిన రాజ్యాంగ నిర్మాణసంస్థ యేదీ అనేదే ప్రశ్న. ప్రజాసామాన్యముచే ఎన్నుకోబడిన ప్రతినిధులతో నిండి ఉన్న ప్రజాపరిషత్తే అటువంటి రాజ్యాంగచట్టాన్ని తయారు చేయడానికి మిక్కిలి తగినసంస్థ. జవహర్‌లాలు నెహ్రూగా అన్నట్లుగా 'సాంఘికసమస్య అని పిలువబడే సమస్య అప్పుడు మూలబడిపోతుంది. ప్రజాసామాన్యమునకు వారి సంఘంలో నూటికి ఎన్ని ప్రభుత్వోద్యోగాలు వచ్చినవి అనే సంగతి పట్టనే పట్టదు. ఆకలిపొట్టలు నిండడమే వారికి కావలసింది. ఇంత వరకూ విదేశీపరిపాలకులున్నూ భారతీయ స్వప్రయోజనపరులున్నూ అణచిఉంచిన జీవశక్తులను ఈ పరిషత్తు విజృంభింపచేయగలదు.'

ప్రజాపరిషత్తుకు అనుకూలంగా చేయబడిన ప్రచారము, దాని ఎన్నికలూ,అందువలన కలిగిన అభిరుచీ–ఇవన్నీ–ప్రజాసామాన్యానికి మంచి రాజకీయ చైతన్యం కలిగించేటందుకు గొప్పవీల్లు. ఇందుమూలాన ప్రజల నిస్తబ్ధత అనేది నిర్మూలం అవుతుంది. ప్రజాపరిషత్తు అనగా ముందుకు సాగుతూన్న జాతి అనీ, ఎన్నుకోబడిన ప్రతినిధులద్వారా పని చేస్తూన్న ప్రజాసామాన్యమనీ నెహ్రూగా పండితుని భావం.

ప్రజల రాజకీయ చైతన్యమునకూ తదితర విద్యాభ్యాసము నకూ అది ఒక ఉపాధి అని గాంధీ మహాత్ముని అభిప్రాయం.

పరాధీనతనుండి స్వతంత్రం పొందిన దేశమునకు నూతన రాజ్యాంగమును తయారుచేసే ఈ విధానము చరిత్రాత్మకమైనదనీ, భారతజాతీయ జీవితంలోని ప్రత్యేక శక్తులు (elements) అనగా వైస్రాయిచేసిన ఆగష్టుప్రకటన ప్రకారం భావిరాజ్యాంగ నిర్మాణమునకు తమంతో తాము ఒడంబడిక కుదుర్చుకోవలసిన ప్రత్యేకశక్తులు, తమ ప్రతినిధులద్వారా తాము కోరే ప్రభుత్వ విధానమును ఏర్పరచుకునేటందుకు సావకాశం కలిగించే పద్ధతి యిది ఒక్కటేననీ ఇంతకు పూర్వమే నిరూపించి ఉన్నాము.

**అభ్యంతరాలు:**

స్వతంత్ర ప్రజాస్వామ్య భారత రాజ్యాంగ నిర్మాణం, ప్రజాపరిషత్తు ద్వారా జరుగవలెననే మాటకు అనేక అభ్యంతరాలు చెప్పబడుతూన్నవి. 'ఈ దేశంలోని సామాన్య ప్రజ అక్షరాలు కూడా రాని అజ్ఞానులు., చాలా మందిలో కులతత్వం గడ్డకట్టిపోయింది. పౌరోహితులకు దాసులు. మామూలు రాజకీయ విషయాలుకూడా వారికి అర్థంకావు. అటువంటప్పుడు వీరికి రాజ్యాంగ చట్టమును తయారుచేసే పని అపాయకరంకూడాను. వారు ఎన్నుకొనే ప్రతినిధులు కూడా చాలావరకు నిశ్శాసీదార్లుగానే ఉంటారు. అందువల్ల

రాజ్యాంగ శాసన పునర్నిర్మాణ సమస్యలను చర్చించడానికి కేవలం అనర్హులు; అని కొంతమంది వాదిస్తారు.

కాని యిది చాలా పాత అభ్యంతరం. ఇండియా లోనూ తదితర దేశాలల్లోనూ కూడా వయోజన నియోజక వర్గములుండవలెనని ప్రతిపాదించిన వారు అనేక పర్యాయములీ అభ్యంతరానికి ప్రత్యుత్తరమిచ్చియే ఉన్నారు. నిజానికి అక్షరాలు రాకపోవడానికిన్నీ తగిన ప్రతినిధులను ఎన్నుకొనే శక్తికలిగి ఉండడానికిన్నీ యేమీ సంబంధం లేదు. ఆ స్థితి కారణంగా నేడు వోటర్లయిన వారిలో అనేక మంది నిశానీదార్లే. పైగా ఈ దేశంలో ఎన్నికలను ప్రవేశ పెట్టడానికిదే మొదటిసారి కాదు. దాదాపు యాభై సంవత్సరాల నుండీ యేదో ఒక విధంగా ప్రజలకు యెన్నికలతో పరిచయం ఉండనే ఉంది దీనికి తోడు గాంధీ మహాత్ముడు రాజకీయ నాయకత్వం తీసుకొన్న నాటినుండీ ప్రజా సామాన్యంలో నిజమైన చైతన్యం కలిగి, ఎన్నికలపైన వోటింగుపైన ఆధారపడిన అనేక విధములగు స్వచ్ఛంద సంస్థలను స్థాపించి పనిచేసేటందుకు వారు అలవాటు పడ్డారు. కాబట్టి సరియైన ప్రతినిధులను ప్రజలు ఎన్నుకోగలరా అనే విషయాన్ని గురించి మన పాత అభిప్రాయాలను మార్చుకోవాలి. ముఖ్యంగా కొంతకాలమునుండీ, ఎన్నుకోబడిన ప్రతినిధులు గల శాసన సభలూ, గ్రామ పంచాయతీలు, సహకార సంఘాలు, ఇంకా యెన్నిక సభ్యులతో గూడిన యితర సంస్థలూ పనిచేస్తూన్న భారత సంస్థానాలలోనూ

బ్రిటిష్ ఇండియాలోమా నివసించే ప్రజల శక్తి సామర్థ్యము లను గూర్చి మతీ మార్చుకోవాలి. నిశ్శాస్వార్ల వోటు చేయడానికి రంగు పెట్టెల యేర్పాటు కూడా జరిగింది. గాంధీజీ అన్నట్లుగా "తెలివిగల నిర్ణయమే జరిగితీరవలెననే కోరిక అక్కరలేదు. ఎన్నుకోబడిన ప్రతినిధులు చేసిన నిర్ణయమైతే చాలును."

మైనారిటీ ప్రయోజనాల రక్షణ:

ప్రజాపరిషత్తును గూర్చి మరొక అభ్యంతర మున్నది. అందులో అత్యధికస్థానాలు హిందువులే సంపాదించుకోగలరనీ అల్ప సంఖ్యాక ప్రయోజనాలకు తగినంత ప్రాతినిధ్యం ఉండదనీ అభ్యంతరం చెబుతారు. ప్రజాపరిషత్తు ప్రతిపాదకు లిదివరకే ఈ అభ్యంతరాన్ని విచారించి వారి మొట్టమొదటి సూచనను ఈ విమర్శను బట్టి మార్పు చేశారు. 'అల్ప సంఖ్యాకుల అనుమానం తొలగించడానికి వారి యిష్టానుసారం ప్రత్యేక నియోజక వర్గాల ద్వారానే వారి ప్రతినిధులను ఎన్నుకొనేటట్లు చేయవచ్చును' అన్నాడు పండిత జవహరలాలు నెహ్రూ. అంతేకాకుండా యేదైనా ఒక ప్రత్యేక అల్ప సంఖ్యాక సంఘానికి సంబంధించిన సమస్య మాత్రమే అయినయెడల, అది ఆ అల్ప సంఖ్యాక సంఘ ప్రతినిధుల వారిచేతనే నిర్ణయింపబడవలెననీ, ఒక అల్ప సంఖ్యాక సంఘమునకున్నూ తక్కిన ప్రజానీకమునకున్నూ సంబంధించిన సమస్య విషయంలో ఉభయులకూ ఒడంబడిక కుదరని యెడల మధ్యవర్తి నిర్ణయమునకు వదలి వేయవలె

నని కూడా అంగీకరింపబడినది. ఈ సూచనలున్నూ, మార్పులున్నూ, ప్రజాపరిషత్తులో అల్ప సంఖ్యాక ప్రయోజనాలకు తగిన రక్షణలేదని చెప్పే అభ్యంతరాన్ని దుర్బల పరుస్తున్నవి.

'దేశమును పెద్దపెద్ద నియోజక వర్గములుగా విభజించక, పనిజరగడానికి తగినంత చిన్నచిన్న నియోజక వర్గములుగా విభజించేయెడల, వయస్సువచ్చిన వారందరి వోట్లతోనూ యెన్నుకోబడే ప్రజాపరిషత్తు అతి విస్తీర్ణమై సక్రమంగా చర్చజరిపేటందుకే సాధ్యంకాదు.' అని ఇంకో అభ్యంతరం వస్తున్నది. కాని ఆ సభ మరీ పెద్దదిగా ఉండవలసిన అవసంలేదు. పరోక్షపు ఎన్నికలపద్ధతి ప్రజాస్వామ్యమునకు విరుద్ధంకాదు కనుక ఆ ప్రకారం షుమారు 400 మంది సభ్యులతో ప్రజాపరిషత్తును ఏర్పాటు చేయవచ్చును. ఒకవేళ అది అంతకంటె కొంచెం పెద్దదైనప్పటికీ భయపడవలసిన పనిలేదు. సర్ మారిస్ గయరుచేసిన సూచనలను పరిశీలిస్తూ, సరియైన కార్యవిధానమునూ, నిర్మాణ పద్ధతినీ అవలంబించేయెడల పెద్దసభకూడా బాగా పనిచేయగలదని యిదివరకే నిరూపించి ఉన్నాము.

'సంపూర్ణంగా చర్చలూ సమాలోచనలూ జరిగిన తరువాత చిట్టచివరకు ప్రజాభిప్రాయం ప్రకారం నిర్ణయం జరుగవలెననేది, ప్రజాస్వామ్యముయొక్క నిగ్గు. ఈ ప్రజాభిప్రాయం తెలుసుకోవడానికి వోట్లు లెక్కపెట్టడంకంటె ఇప్పటికి ఇంకొక మంచి రాజకీయ మార్గం కనిపించలేదు. అందువల్ల ఈ పద్ధతి తప్పనిసరి అయింది. ప్రస్తుతం రాజకీయంగా

తప్పనిసరి అయిన ఈ పనిని బ్రహ్మాండమైన ఒక నైతిక సిద్ధాంతంగా శ్లాఘించవలసిన పనిలేదు. ఇటువంటి రాజకీయావసరాన్ని అవలంబించడానికి అల్పసంఖ్యాకు లిష్టపడని యెడల దానిని వదలివేసి, అంతకంటె తక్కువ ప్రజాస్వామ్యమైనప్పటికీ, అన్ని పక్షాలవారికీ అంగీకారమైన మతైక విధానాన్ని అవలంబించడం పరమోత్తమం' అని సర్ మారిస్ గయరువంటివారు కొందఱు వాదిస్తారు. కాని ఇదంతా వివాదగ్రస్తమైన విషయంలోని సత్యం నిర్ధారణ అయినట్లు భావించి చెప్పడమవుతుంది. ప్రజల ఎన్నికమీాద ఆధారపడనిసంస్థ ప్రజాస్వామ్య రాజ్యాంగమును తయారు చేయగలదా? పైగా ప్రజాస్వామ్య రాజ్యాంగమునకు సంబంధించని రాజ్యాంగములతో తనకు జోక్యంలేదని సర్ మారిస్ గయరే అంటూన్నాడు. అదీకాక భావిభారత రాజ్యాంగశాసనము ప్రజాపరిషత్తుచే తయారుచేయబడవలెనా అనే విషయంపైన వివిధసంఘాల వారికీ ఒడంబడిక ఉండాలేదా అనే సంగతి చెప్పవలసింది ఆయా సంఘాలే. కాని, యెంత గొప్పవారైనప్పటికీ కొలదిమంది నాయకులు మాత్రంకాదు అని ప్రజాపరిషత్తుకు అనుకూలంగా వాదించేవారు ఉద్ఘాటిస్తూన్నారు. కాబట్టి అటువంటి పరిషత్తుకు ఆయాసంఘాలవారు మొట్టమొదట ప్రతినిధులను ఎన్నుకొని తీరాలి; తరువాత ఆ సభలోని ప్రతినిధులు మతైకవిధంగా రాజ్యాంగ చట్టమును తయారుచేయవలెనని నిర్ణయించే యెడల్ల అప్పుడు వేఱే పద్ధతిని అవలంబించవలెను. కనుక

ఎప్పుడో ఒకప్పుడు ప్రజాపరిషత్తును సమావేశపఱచి తీర వలసిందే.

భారతజాతీయ మహాసభయొక్క పలుకుబడి నేడు చాలా ఎక్కువగా ఉన్నదనీ, దేశమంతటా వలవలె వ్యాపించి దానిశాఖోపశాఖలయొక్క ప్రచారశక్తి అసమానమనీ, అందువల్ల వయోజన నియోజక వర్గములద్వారా జరిగే యే ఎన్నికలోనైనను ప్రజాపరిషత్తుకు అత్యధిక సంఖ్యాకులనుపంపి వారిలో బలవత్తమమైన పక్షంగా అది ఏర్పడుతుందనీ, తత్ఫలితంగా 'కాంగ్రెసు సిద్ధాంతాలకు' అనుగుణమైన రాజ్యాంగ చట్టమే నిర్మింపబడుతుందనీ సంతి కొంతమంది విమర్శకులు భావిస్తూన్నారు. కాని నిజంగా ఇల్లాగే తప్పకుండా జరుగుతుందని చెప్పడానికి వీలులేదు. ఒకవేళ జరిగినప్పటికీ ఎందుకు దీనికి అభ్యంతరం ఉండాలో అర్థంకావడంలేదు. వోటర్లలో ఎక్కువ మందికి ఏ పక్షమంటే యిష్టమో, యే కార్యక్రమానికి వారనుకూలురో తెలుసుకోవడమేగదా ఎన్నికల ఉద్దేశం; ఇంతా అయితే కాంగ్రెసు సిద్ధాంతాలేమిటి? స్వతంత్ర ప్రజాస్వామ్య భారత దేశపు ఉనికికి ప్రతికూలమైనవా? ఈ దేశంలో నిర్మింపబడవలసిన ప్రభుత్వ విధానమును గూర్చి కాంగ్రెసు కున్న అభిప్రాయాలు మారనివికావు. అవి మారడానికి వీలున్నవే. దేశంలో తదితర రాజకీయసంస్థల ఉద్దేశాలకూ కార్యవిధానములకూ అనుగుణంగా సమన్వయం చేసుకొనేటందుకు కాంగ్రెసు అభిప్రాయాలలో చాలా పెద్దమార్పులు

కలిగినవి. భారతదేశానికి ఐక్యప్రభుత్వము (Unitarism) కావలెననే సిద్ధాంతాన్ని వదలి సమాఖ్య ప్రభుత్వము (Federalism) కావలెననే సిద్ధాంతాన్ని కాంగ్రెసు అంగీకరించింది; కేంద్రంలో శేషాధికారాలు (Residuary powers) ఉండవలెననే సిద్ధాంతాన్ని వదలి రాష్ట్రాలలో ఉండడానికి అంగీకరించింది. ఇంకా యిటువంటివే అనేక మార్పులను అంగీకరించింది. కాబట్టి మారడానికి వీలుకల కాంగ్రెసు సిద్ధాంతాలకు అనుగుణమైన ప్రభుత్వ విధానము నిర్మింపబడేయెడల యెవ్వరూ భయపడవలసిన అవసరంలేదు.

కష్టము - ఖర్చు :

"ప్రజాపరిషత్తులో కూడా ఆయా రాజకీయ సంస్థల యొక్కయు సంఘాలయొక్కయు నాయకుల మాట ఎక్కువగా చలామణీ అవుతుంది కాని అనుచరుల మాటకాదు. ఆయా నాయకులు తమలో తాము సంప్రతించుకొని యిచ్చి పుచ్చుకోవడం ద్వారానే చిట్టచివరకు రాజ్యాంగ చట్టం నిర్మింపబడుతుంది. కాబట్టి ఈ వోటర్ల జాబితాలను తయారుచేసి, ఎన్నికలను ఏర్పాటుచేసి, ఎన్నికలకు సంబంధించిన ఉద్రేకాలను ఎదుర్కొని నానాఅవస్థలూ పడేదానికంటె మొట్టమొదటినుండీ కూడా ఈ రాజ్యాంగ చట్టమును తయారుచేసే పనిని ఆనాయకుల చేతులలోనే వదిలిపెట్టినట్లయితే, ఆఖర్చు, ఆకష్టమూ, ఆ ఉద్రేకము-అన్నీ లేకుండా తప్పించుకోవచ్చు. పైపెచ్చు ప్రజాపరిషత్తు ద్వారా కలిగే ఫలితానికీ ఈ సూచించబడిన పద్ధతివలన కలిగే ఫలితానికీ ఎక్కువ భేద

ముండదు” అని కొందరు వాదిస్తారు. కాని ఈ వాదంలో అంత పటుత్వం లేదు. ప్రస్తుత నాయకులు చాలా మంది తమంతట తాము నాయకులయినవారే. కాని ఎవరి చేతనూ ఎన్నుకోబడ్డవారు కారు. వారు ప్రాతినిధ్యం వహిస్తున్నామనే సంఘాలకు ఎంతవరకు నిజంగా వారు ప్రతినిధులో ఎవ్వరూ నిశ్చయించి చెప్పలేరు ; ఒకే సంఘానికి, పక్షానికీ ప్రతినిధులమని చెప్పుకొనే పోటీ నాయకులు కూడా అనేకమంది ఉన్నారు. పైగా ఈ నాయకుల మధ్య ఒడంబడిక కుదర్చడానికి ఇంతవరకూ చేయబడిన ప్రయత్నాలన్నీ భగ్నమైనవి. కాబట్టి సరాసరి ప్రజలకు విజ్ఞాపనము చేయవలసిన అవసరం కలిగింది. నిజమైన నాయకులెవరో, వారే కార్యక్రమమును అవలంబించవలెనని ప్రజలు కోరుతున్నారో రాజ్యాంగ పరిషత్తు ఎన్నికల వలన తేలుతుంది. ఇదే నాయకుల సభ కంటె ప్రజాపరిషత్తుకు గల ఉత్కృష్టత.

ప్రజా స్వామ్యంలో నమ్మకంలేనివారు గానీ లేక భారతదేశానికి ప్రజా స్వామ్యం పనికిరాదని గానీ వాదించే వారు చెప్పే అభ్యంతరాలను గురించి యిక్కడ చర్చించ దలచుకోలేదు. ప్రజల ఎన్నిక మీద ఆధారపడి బాధ్యత వహించే ప్రభుత్వము భారతదేశంలో జయప్రదంగా నడవడానికి మంచి సావకాశమున్నదనే భావంతో ప్రారంభించినప్పుడే రాజ్యాంగ పరిషత్సిద్ధాంతం చెల్లుబడి అవుతుంది. ఎందువలననగా అది ప్రధానంగా ప్రజాస్వామ్య సిద్ధాంతమునకు సంబంధించింది. ఈ సిద్ధాంతముయొక్క శాస్త్రీచర

ణముల యోగ్యతను బట్టియే దాని నిలకడగానీ పతనం గానీ ఉంటుంది. బ్రిటిష్ ప్రభుత్వానికి ప్రజాస్వామ్యములో నమ్మకమున్నది. జిన్నాను, ముస్లిం లీగును, ప్రజాసామ్య వ్యతిరేకులని వేలుపెట్టి చూపడానికి హేతువు హిందూ మహమ్మదీయులు రెండు ప్రత్యేక జాతులవారనే ఒక సిద్ధాంతానికి వారు కారకులు కావడమే. వారుకూడా ఈ రెండింటిలో ప్రతి ఒక్క జాతికీ ప్రజాస్వామ్యం ఉండవలెననే అంటున్నారు. హిందువులూ మహమ్మదీయులూ ప్రత్యేక జాతులనే సిద్ధాంతాన్ని వదులుకొనేటట్లుగా వారిని మంచి మాట చేసుకోగలిగిన యెడల వారు సైతం ప్రజాస్వామ్య ప్రభుత్వ విధానమునకు అంగీరిస్తారనే అనుకోవచ్చును. చాలా ఎక్కువ మంది . సంస్థానాధిపతుల వైఖరి ప్రజాస్వామ్యమునకు వ్యతిరేకంగా ఉంటుంది. అది సహజమే. కాని నిరంకుశాధికారమునందు వారికిగల మమకారమును విడిచిపెట్టుకొని చట్ట సమ్మతమైన (constitutional monarchs) ప్రభువులుగా మాత్రమే వారునడుచుకోవలసిన తరుణం ఆసన్నమైనది. సంస్థానాధిపతుల ప్రస్తుత సర్వాధికారమును అంగీకరిస్తూ బ్రిటిష్ రాజు సంతృప్తిపడి ఉండలేదా! ప్రపంచమంతా ప్రజాస్వామ్యం వైపునకు నడుస్తూన్నది. అయితే ఈ నడక ఒడుదుడుకులు లేకుండా, మార్దవంగా సాగుతూందనే మాటనిజము. కాకపోవచ్చును. అయినప్పటికీ మానవాభ్యుదయమునందు నమ్మకమున్న వారిలోఅత్యధిక సంఖ్యాకులీ ప్రభుత్వ విధానమునే ఉద్ఘాటిస్తూన్నారు. తదితర

దేశాలకీ విధానమెంత అవసరమో హిందూదేశమునకుకూడా అంత అవసరమే. మామూలు మనిషిని కష్టాలనుండి గట్టెక్కించగలది యదేనని తెలిసి రావడమే ఇందుకుకారణం.

ఒక ప్రణాళికకు ప్రాతిపదిక :

ప్రజా పరిషత్తును ఎన్నుకొనే పద్ధతిని దాని సభ్యత్వము, నిర్మాణము, అది పరిష్కరించవలసిన ప్రధాన సమస్యలు – వీటినిగూర్చి వివరంగా వ్రాయడానికి యిక్కడ సావకాశంలేదు. ఈ అన్నివిషయాలకూ అనుభవమే మార్గదర్శి. కిందటి అధ్యాయాలలో ఆ అనుభవములనుగూర్చి వివరించి ఉన్నాము. కాబట్టి ఇక్కడ ప్రజాపరిషత్తునుగూర్చి ప్రాతిపదికగా మాత్రమే వ్రాయడానికి సాధ్యపడుతుంది.

సభ్యత్వ సంఖ్య :

ప్రజా పరిషత్తుయొక్క సభ్యత్వ సంఖ్య నాలుగు వందలని నిర్ణయించవచ్చును. ప్రాముఖ్యమైన భిన్నదృక్పథాలుకల వారందరికీ తగిన ప్రాతినిధ్యం ఈయడానికి వీలైన సంఖ్య అది. ఈ ప్రకారం పదిలక్షలమంది ప్రజలకొక సభ్యుడు ఉండవచ్చును. సభ్యులను పరోక్షపు ఎన్నికల ద్వారా ఎన్నుకోవడం పరమోత్తమం. ప్రత్యక్షపు ఎన్నికలకు నియోజక వర్గాలు చాలా పెద్దవిగా ఉండవలసి వస్తుంది. అందువలన అనేక చిక్కులు రావచ్చును. పరోక్షపు ఎన్నికకూడా ప్రత్యక్షపు ఎన్నికవలెనే ప్రజా ప్రాతినిధ్యం వహిస్తుంది.

**పరోక్షపు ఎన్నిక :**

ప్రజా పరిషత్తు ఎన్నికలకు నియోజక వర్గమును (Electoral College) నిర్ణయించడంలో, గ్రామముల యొక్కయు, గ్రామపంచాయతీలయొక్కయు ప్రాముఖ్యతను మనస్సులో పెట్టుకోవాలి. ఈ దేశంలో గ్రామం అతి ప్రాచీనమైన కేంద్రప్రదేశం. యుగయుగాలనుండీ చారిత్రకంగా అది అలాగే నిలచిఉంది. సమిష్టిభావంతో ఉండే జనసంఖ్యకు అదే కేంద్రస్థలం. తాలూకాలు, జిల్లాలు రాష్ట్రాలు రాజకీయావసరములకు పరిపాలనావసరములకూ తగినట్లు కృత్రిమంగా యేర్పాటుచేయబడి మారుతూ వస్తూన్నవి. గ్రామం అలాకాక స్వతస్సిద్ధమైన కేంద్రంగా ఉన్నది.

గ్రామపంచాయతీ గ్రామంలో ఉండే ఒక విశిష్టమైన సంస్థ. దాని స్వభావలక్షణాలు పూర్తిగా ప్రజలకు తెలుసు. దేశంలోని మారుమూలప్రదేశాలలోకూడా పంచాయతీ అంటే ప్రాణప్రదంగా చూస్తారు.

**పంచాయతీలద్వారా :**

ప్రతిగ్రామము జనసంఖ్యనుబట్టి పంచాయతీలను ఎన్నుకోవలెనని కోరవలెను. ప్రతి నూరుమంది జనులకు ఒక్కొక్క పంచాయతీసభ్యుడిని ఎన్నుకొనేటట్లు నియామకం చేయాలి. అప్పుడు 500 మంది ప్రజలుగల గ్రామం ఐదుగురుగల పంచాయతీని ఎన్నుకొంటుంది. వేయిమందిగల గ్రామం పదిమంది పంచాయతీ దార్లను ఎన్నుకొంటుంది.

ప్రత్యేక నియోజక వర్గము లంగీకరింపబడే సూచనలు కనుపిస్తూన్నవి గనుక, ఆ నియోజకవర్గముల సందర్భంలో కూడా ఈ సిద్ధాంతమునే వర్తింపచేయవలెను. ఆమోదింపబడిన ప్రతి అల్ప సంఖ్యాకసంఘము తన జనసంఖ్యలో నూటికి ఒక సభ్యుడు వంతున పంచాయతీలను ఎన్నుకోవలెను. ఈ అల్ప సంఖ్యాక సంఘములలో దేనికైనను సంబంధించిన 500 జన సంఖ్యగల ప్రతి ప్రదేశమును ఒక నియోజకవర్గముగా యేర్పాటుచేసి అయిదుగురు గల పంచాయితీని యెన్నుకొనే యేర్పాటు చేయవలెను.

భూస్వాములు, వర్తకులు, కార్మికులు మొదలగు ప్రత్యేక ప్రయోజనాలు కలవారికి ప్రాతినిధ్యం అవసరం లేదు. ఈ ముతాలకు సంబంధించిన మనుష్యులు, కొంతవరకు వారి సంఖ్యా ప్రాబల్యమునుబట్టి, మరి కొంతవరకు వారి పలుకుబడీ, నాయకత్వ లక్షణాలనుబట్టీ, సామాన్య నియోజక వర్గములలోనుండి గానీ, సాంఘిక నియోజక వర్గములలోనుండి గానీ ఎన్నుకోబడే మాట నిశ్చయం.

ఈ దేశపు జనసంఖ్య సుమారు 40 కోట్లు ఉంటుంది. కాబట్టి అన్ని పంచాయితీలలోనూ ఉండే మొత్తం సభ్యుల సంఖ్య 40 లక్షలు ఉంటుంది. ఈ 40 లక్షల మంది పంచాయితీదార్లే రాజ్యాంగ పరిషత్తు సభ్యులను ఎన్నుకో వలసినవారు వీరందరు 400 నియోజకవర్గాలుగా ఏర్పాటు చేయబడితే,ఒక్కొక్క నియోజకవర్గంలో 10,000 మంది పంచాయితీదార్లు ఉంటారు. ఒక్కొక్క నియోజకవర్గం ఒక్కొక్క

పరిషత్సభ్యుడిని ఎన్నుకోవాలి. ఈ దశలోనే సామాన్య నియోజకవర్గములు, ప్రత్యేక నియోజకవర్గములు అనే విభజన ఆచరణలోకి వస్తుంది. అందువలన ఆమోదిత అల్ప సంఖ్యాక సంఘాల జనసంఖ్యల కనుగుణంగా ప్రజా పరిషత్తులోకి సభ్యులు ఎన్నుకోబడుతారు. 'ఆమోదిత అల్ప సంఖ్యాక సంఘాల'నగా మహమ్మదీయులు, షెడ్యూల్డు తరగతులు, భారతీయ క్రైస్తవులు, సిక్కులు, ఆంగ్లో ఇండియనులు అని ఈ సందర్భంలో అర్థం చెప్పుకోవాలి. ఈ జాబితాలో ఇంకొక సంఘం చేరకూడదు.

**విధానము :**

ఈ విధంగా నిర్మింపబడిన రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడిని,కొందఱు అగ్రాసనాధిపతులను (Panel of Chairmen) ఎన్నుకోవలెను. ప్రజాస్వామ్య ప్రభుత్వాలుగల ప్రతి దేశంలోనూ ఉన్న మంత్రివర్గములతో సమానంగా ఉండే ఒక కార్యనిర్వాహక వర్గమునుకూడా ఆపరిషత్తు ఎన్నుకోవలెను. మంత్రివర్గంలో ప్రధాన మంత్రికి దాదాపుగా సమాన హోదాగల సభానాయకునితోనూ, పరిషత్తులోని తక్కిన ప్రధాన నాయకులతోనూ ఆ కార్యనిర్వాహక వర్గం నిర్మింపబడుతుంది. ఈ పరిషత్తులో ప్రవేశ పెట్టేటందుకు చిత్తు తీర్మానాలను వ్రాసేపని ఈ కార్యనిర్వాహకవర్గం వారిదే. అవలంబింపవలసిన కార్యక్రమాన్నిగూర్చి నిర్మించవలసిన కమిటీలనుగూర్చి కూడా ఈ కార్యవర్గమే ముందుగా ఆలోచించి నిర్ణయం చేస్తుంది. పరిషత్తు సమాలోచనల కన్నిటికీ

యిదే మార్గదర్శకంగా ఉంటుంది. పరిషత్తుయొక్క జయాప జయములు చాలావరకు సభానాయకునియొక్కయు, ఆయన కార్యవర్గముయొక్కయు విశిష్టతపైన ఆధారపడి ఉంటవి.

పరిషత్తు సమాలోచనలు కొన్ని, కమిటీల సమాలోచనలలో దాదాపు అన్నీకూడా రహస్యంగానే జరగాలి. పరిషత్తుకూ, పరిషత్తుకు సంబంధించిన అన్ని కమిటీలకూ కూడా, తమ వ్యవహారాలు ప్రజల సమక్షంలో జరగవలెనా అక్కరలేదా అనే విషయం నిర్ణయించుకోవడానికి తగిన స్వాతంత్ర్యం ఉండాలి. ఈ సందర్భంలో వారుచేసే నిర్ణయమును కాదనడానికి ఎవరికీ హక్కుండకూడదు.

**అధిక సంఖ్యాకుల వోట్లవలన నిర్ణయం జరగాలి :**

పరిషత్తులో చర్చించబడే అన్ని విషయాలు షూమూలు అధిక సంఖ్యాక వోట్లతో నిర్ణయింపబడవలెను. అయితే ప్రత్యేక సంఘాలవారి హక్కులకు విశేషాధికారాలకు (Rights and Privileges) సంబంధించిన విషయాలలో మాత్రం మినహాయింపు ఉండాలి. ఈ సందర్భంలో వారు చెప్పిందే తుది నిర్ణయంకావాలి. సమస్యలు ఒక ప్రత్యేక సంఘానికి సంబంధించినవా లేక ప్రజ అంతకూ సంబంధించినవా అనే విషయాన్ని గురించి అభిప్రాయభేదం ఉన్నప్పుడు ఒక ప్రత్యేక మెజారిటీ వల్ల అనగా హాజరైన వారిలో 2/3 వంతు సభ్యుల వోట్లతో నిర్ణయం కావాలి. ఎటువంటి ముఖ్యవిషయంగా కనుపించినప్పటికీ ఏకగ్రీవంగా నిర్ణయింప బడవలెననే నియమం ఎంత

మాత్రమూ పనికిరాదు. సంయుక్త రాజ్యాల ఫెడరల్ రాజ్యాంగ సభలలో ఆ నియమంలేదు. దక్షిణ ఆఫ్రికా లోని వివిధ వలస రాజ్యాలమధ్య తీవ్ర విభేదాలు ఉన్నప్ప టికీ, వివిధ వలసరాజ్యాలకు ఆ రాజ్యాంగ సభలలో సమాన ప్రాతినిధ్యం లేకపోయినప్పటికీ ఏకగ్రీవంగా నిర్ణయాలు జరగవలెననే నిర్బంధం ఉండలేదు. పరిషత్తులోని సభ్యు లందరూ వ్యక్తి పరంగా గానీ, లేదా అన్ని సంఘాలవారూ (జాతీయ జీవితంలోని ప్రత్యేక మతాలు) మతాల వారిగా గానీ ప్రతి తీర్మానమునూ ఏకగ్రీవంగా ఆమోదిస్తేనేగాని పరిషత్తు నిర్ణయం కాజాలదనడం రాజ్యాంగ శాసన నిర్మా ణాన్ని సాధ్యంకాకుండా చేయడమే అవుతుంది. అల్ప సంఖ్యాకులకు కాని హక్కులనేవి ఉన్నవి. న్యాయంగా ఉండవలసిన హక్కులలో, శాశ్వతంగా రాజ్యాంగ నిర్మాణ మును అరికట్టే హక్కుకు యెక్కడా స్థానంలేదు. ఒక సంఘానికి చెందిన ప్రతినిధుల నిర్ణయమే ఏకగ్రీవంగా కాక మెజారిటీ వోట్లతో జరుగుతూన్నప్పుడు పరిషత్తు యావత్తు కూ సంబంధించిన నిర్ణయాలు ఏకగ్రీవంగా జరగవలెననడం సందర్భం లేని మాట; ఒక సందర్భంలో న్యాయమనీ ఆచరణయోగ్యమనీ భావింపబడిన విధానమును తదితర సందర్భంలో కూడా అలాగే భావించాలి.

**ఏకగ్రీవంగా కాదు :**

భారత జాతీయ జీవితంలోని అన్ని మతాల వారికీ ఒడంబడిక కుదిరితేనేగాని యే రాజ్యాంగ చట్టం

నిర్మింప బడినప్పటికీ బ్రిటిష్ వారికి అంగీకారం కాదనే వాదం, ప్రతిష్టంభనములనూ అంతర్యుద్ధములనూ సృజించడానికి మాత్రమే వినియోగ పడుతుందని చరిత్రానుభవం వలన ఋజువవుతూన్నది. ఈ సందర్భంలో సుప్రసిద్ధ అమెరికన్ రాజ్యాంగ వేత్త కాల్ హేన్ (Cal houn) చేసిన వాదం జ్ఞాపకం వస్తూన్నది. అది సరిగా భారతదేశంలోని సాంఘిక వాదులు (Communalists) చేస్తూన్న వాదనను పోలిఉన్నది. ఆయన వ్రాస్తూన్న కాలం నాడు గాని, అంతకు పూర్వంగాని యెప్పుడూ అమెరికాలో రాజకీయంగాడికే ప్రజ లేనేలేదనీ, వారెన్నడూ ఒకే జాతిగా ఒక్క రాజకీయ కార్యమునైనా నిర్వహించలేదనీ, అమెరికన్ యూనియన్ (ఎనభై సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా సాగిన తరువాతకూడా) సంఘాలుగా ఉన్న రాజ్యాల సమ్మేళనము కాని, వ్యక్తుల సమ్మేళనము కాదనీ ఆయన వాదం. ఈ వాదానికి అనుగుణంగా సంఖ్యా బలమునకు (Numerical majority) విభిన్నమైన అంగీకార బలము (Concurrent majority) అనే సిద్ధాంతాన్ని క్రమంగా లేవదీశాడు. దాని ప్రకారం యూనియన్ నిర్ణయం తన ప్రయోజనాలకు విరుద్ధంగా ఉన్నదని తోచినప్పుడు దానికీ వ్యతిరేకంగా వోటిచ్చి రద్దుచేయించడానికి ప్రతిరాజ్యానికి హక్కు కలుగుతుంది. ఈ సిద్ధాంతాన్ని గురించి ఎక్కువ పట్టుదల వహించడమే యూనియన్ నుండి విడివడ వలెనన్న ఉద్యమమునకూ అమెరికా అంతర్యుద్ధమునకూ కారణ

మయింది. ఒక సిద్ధాంతమునుగూర్చి గానీ, ఒక విధానమును గూర్చి గానీ ఒడంబడిక కుదిరినంత మాత్రాన అది చలా మణీ కాజాలదు. ఆ సిద్ధాంతమూ ఆ విధానమూ న్యాయం మీాద ఆధారపడి ఉండాలి. దొంగలందఱూ కలసి ఒడం బడిక కుదుర్చుకొన్నంత మాత్రాన వారిచర్య న్యాయం కాదు. కాబట్టి సంఘ జీవితంలో ఏకాభిప్రాయం అనే సిద్ధాంతాన్ని కొండకెత్తి వేయడం దానిపునాదులనే భగ్నం చేయడం. ప్రజాపరిషత్తులో అవలంబించ వలసిన వోటింగు పద్ధతిని గూర్చి యింత చెప్పవలసి వచ్చింది.

**పరిషత్తు కార్యక్రమము – సంధి :**

ఈ దేశానికి రాజ్యాంగనిర్మాణచట్టం వ్రాయడం ప్రజాపరిషత్తు నిర్వహించవలసినపని. కాని ఈ కార్యనిర్వ హణమునకు ముందుగా అది ఒకటి రెండు ముఖ్యసమస్యలను పరిష్కారం చేయాలి. బ్రిటన్‌తో సంధిచేసుకోవడం ప్రధాన సమస్య. ఆ సంధి స్వభావముపైననే, అది తయారుచేసే రాజ్యాంగచట్టముయొక్క ప్రభావలక్షణములు, రాజ్యాంగ చట్టములో చేర్చబడవలసిన తాత్కాలిక, శాశ్వత, నిబంధ నలూ, చాలావరకు ఆధారపడి ఉంటవి. ఈ సంధిపత్రము వ్రాసుకొనేటందుకు గొప్ప రాజకీయచతురత, దూరదృష్టి, సూక్ష్మబుద్ధి, ధైర్యం, మంచి రాజ్యాంగవివేకమూ–యివన్నీ ఉండాలి. రాజ్యాధికారమును భారతీయుల చేతులలో పెట్ట డానికి బ్రిటిష్‌వారుచేసిన అధికారప్రకటన లన్నిటిలోనూ, భావిరాజ్యాంగవిధానమును గూర్చి భారతీయులలో భార

తీయులకు ఒడంబడిక కుదరడమేగాక, ఇంతవరకూ బ్రిటిష్ ప్రభుత్వమువారిచే నిర్వహింపబడుతూన్న కొన్ని బాధ్యతలను స్వతంత్రభారత దేశం నిర్వర్తించవలసిన విధానమును గూర్చి కూడా రాజ్యాంగ శాసనకర్తలకున్నూ బ్రిటిష్ ప్రభుత్వమునకున్నూ ఒడంబడిక కుదరవలెననేవరతు ప్రతిపాదింపబడుతూ వచ్చింది. భారత దేశంతో బ్రిటిష్ ప్రభుత్వానికిగల చిర సంబంధమునుబట్టి వచ్చినవే ఈ బాధ్యతలు. దేశరక్షణ, సంస్థానాధిపతులను కాపాడడం, జాతులకూ, మతములకూ సంబంధించిన అల్పసంఖ్యాకుల ప్రయోజనాలకు భంగం కలుగకుండా చూడడం– ఇవన్నీ బ్రిటిష్ ప్రభుత్వంపై నపడిన బాధ్యతలుగా పరిగణింపబడుతూన్నవి. బ్రిటిష్ సైన్యాలను ఇండియానుండి ఉపసంహరించినయెడల అది తనను తాను రక్షించుకొనజాలదని బ్రిటిష్‌వారు అంటారు. హిందూ దేశానికి ఆత్మరక్షణ చేసుకోగలిగినస్థితి చాలకాలమువరకు కలుగదనికూడా వారి అభిప్రాయం. అందువల్లనే 'భారత దేశ రక్షణకోసమై బ్రిటిష్ సైన్యాలు శాశ్వతంగా (అత్యవసర సందర్భాలలో సహాయంకోసం రావడంకాదు) ఇండియాలో ఉండవలసిన అవసరంఉన్నంతవరకూ, ఆసైన్యాలను సప్లయి చేసే ప్రభుత్వం శాంతిసమయంలో వారి నియామకమును గూర్చి కొంత అధికారం కలిగిఉండాలి. అంతేకాక యుద్ధ సమయంలో వాటి వినియోగమునకు అవసరమైన విదేశ రాజనీతిపైనకూడా (బ్రిటిష్ ప్రభుత్వానికి) వారికి కొంత అధికారం ఉండాలి' అన్నాడు అమెరీ. ఇందుకొఱకు ఒకసంధి

అవసరం. బ్రిటిష్‌వారు భారత సంస్థానాధిపతుల రక్షణను గూర్చి హామీలు యిచ్చియున్నారు. కాబట్టి భారత భావి ప్రభుత్వం సంస్థానాధిపతుల హక్కులకూ, అధికారాలకూ భంగం కలిగించదని వారు సంతృప్తిపడాలి. బ్రిటనుకూ, ప్రజాపరిషత్తుకూ జరిగేసంధిలో ఈ విషయంకూడా చేర్చబడాలి. అల్పసంఖ్యాక జాతులకూ, మతములకూ చెందిన వారిని అధికసంఖ్యాకులు నిర్బంధించి బాధిస్తారని బ్రిటిష్ వారు భీతి వెల్లడిస్తూన్నారు. ఈ దేశంలో అనేకసంఘాలు అల్పసంఖ్యాకసంఘాలుగా పరిగణింపబడుతూన్నవి. హిందూ మెజారిటీసంఘం వివిధకులాలతోనూ, శాఖలతోనూ వేరు వేరుగా విభజింపబడియున్నది. అటువంటి సందర్భంలో నిజంగా అధికసంఖ్యాకసంఘమని చెప్పుకోదగి, అల్పసంఖ్యాక సంఘములను అణచిపెట్టగలదిఒకటి ఉన్నదాఅని సందేహం కలుగుతూంటూంది. ఐనప్పటికీ అల్పసంఖ్యాకుల రక్షణకు తగిన ప్రతిపాదన లా సంధిలో ఉండవలెనని బ్రిటిష్‌వారు కోరుతున్నారు. ఈ విషయాలన్నీ చేర్చబడిన సంధిని ఆధారంగా చేసుకొనియే ప్రజాపరిషత్తు రాజ్యాంగనిర్మాణమునకు పూనుకోవాలి.

## సామ్రాజ్యతత్వము - మార్క్సు సిద్ధాంతము

బ్రిటనుతో పైన చెప్పబడిన సంధిని చేసుకోవడంలో చాలా శ్రద్ధ జాగరూకత ఉండాలి. ఎందువల్లననగా బ్రిటిష్ సమిష్టిసౌభాగ్యంగా (British Commonwelth) గాక బ్రిటిష్

సామ్రాజ్యంగా నిర్మితమైన స్వాధీన వలసరాజ్యాలయెడలను ఇండియాయెడలను బ్రిటిష్ ప్రభుత్వం అవలంబించవలసిన రాజనీతిని గూర్చి యిప్పటికి (ఈ గ్రంథ మూలం వ్రాసిన నాటికి) యింకా బ్రిటిష్ కన్సర్వేటివ్ పక్షంవారి అభిప్రాయాలే చలామణీ అవుతూన్నవి గనుక, ఇటువంటి రాజకీయభావాలు గలవారు ప్రాతినిధ్యం వహిస్తూన్న సామ్రాజ్యవాదమునకూ, మార్క్సు సిద్ధాంతమునకూ, అధికార రాజకీయాలకు (Power Politics) సంబంధించి నంతవరకు చాలా సన్నిహిత బాంధవ్యమున్నది. కన్సర్వేటివుల అభిప్రాయమే కొనసాగేయెడల పైన ఉదాహరింపబడిన బాధ్యతలను అవసరాలను నిర్వహించేటందుకు భారతదేశం శాశ్వతంగా బ్రిటిష్‌వారి రక్షణక్రింద ఉండవలసి వస్తుంది. ఈ సామ్రాజ్యవాదుల దృష్టిలో భారతదేశ చరిత్రకు మూలం, వివిధ జాతులకు, మతాలకూ, సంఘాలకూ జరిగే నిరంతర పోరాటమేనని; మార్క్సిస్టులువర్గ పోరాటానికి చరిత్రలో ఎంత ప్రాముఖ్యత యిస్తారో సామ్రాజ్యవాదులీ కలహాలకు అంత ప్రాముఖ్యత యిస్తారు. వర్గపోరాటం నశించి వర్గరాహిత్య సంఘ మేర్పడేముందు శ్రామిక నియంతృత్వముగానీ, కమ్యూనిస్టు ప్రభుత్వముగానీ ఉండడం తప్పని సరి అని మార్క్సిస్టులు నమ్ముతూన్నట్లుగానే, సామ్రాజ్యవాదులు కూడా ఇండియాలో సాంఘికకలహాలు పోయి చివరకు నిజమైన ఐకమత్యం చేకూరేవరకూ సామ్రాజ్య ప్రభుత్వం అవసరమని నమ్ముతూన్నారు. ఒక సంఘానికి మఱొకసంఘానికి

మధ్యను ఉన్నస్పర్థ నశించి, వెనుకబడి ఉన్నసంఘాలు అభ్యుదయ సంఘాలతోపాటు అభివృద్ధిపొంది, వాటి అన్నిటి మధ్యనూ సంపూర్ణ శాంతీ, ఐకమత్యమూ యేర్పడినప్పుడు, సామ్రాజ్యవాదులు తమ ధర్మమును నిర్వహించినవారు కాగలరు. వర్గపోరాటం నశించి వర్గ రాహిత్యసంఘ మేర్పడగానే శ్రామిక నియంతృత్వంతో కూడిన ప్రభుత్వం 'ఎండి రాలిపోతుం'దని మార్క్సిస్టులు వాదిస్తూన్నట్లుగానే అప్పుడు సామ్రాజ్యవాదంకూడా తనంతట తాను 'ఎండి రాలిపోతుంది.' అటువంటి పర్యవసానం ఎప్పుడు కలుగ వచ్చునో చెప్పడానికి సావకాశంలేదని భావించడంలోకూడా ఉభయ వాదాలవారూ సమానంగానే ఉన్నారు. అది తట స్థించడానికి దశాబ్దములు పట్టవచ్చును, లేక కొన్ని శతాబ్ద ములు కావచ్చును. ఈ పరివర్తన కాలంలో అంతా ఒక సందర్భంలో సామ్రాజ్య ప్రభుత్వమున్నా మరొక సంద ర్భంలో కమ్యూనిస్టు ప్రభుత్వమున్నా కొనసాగుతూ ఉండ వలసిందే. సుదీర్ఘకాలంలో సామ్రాజ్య నాశనం తప్పని సరి అయినప్పటికీ అందు కెంతకాలమో వేచి ఉండవలెను.

ప్రజాపరిషత్తిటువంటి యుక్తి సిద్ధాంతాలకు లోబడి పోకుండా మెలకువతో ఉండాలి. బ్రిటనుతో తాను చేసు కొనబోయే సంధివల్ల, బ్రిటిష్ అధికారం క్రొత్త రూపంలో నిరంతరాయంగా కొనసాగకుండా చూచుకోవాలి అది.

## ఐక్య భారతదేశమా విచ్ఛిన్న భారతదేశమా?

రాజ్యాంగ చట్టమును తయారు చేయవలసినది ఐక్య భారత దేశమునకా లేక హిందూస్థానము, పాకిస్థానముల వంటి వివిధ స్థానములుగా విభజింపబడిన భారతదేశమునకా? అనే సమస్యకూడా ప్రజాపరిషత్తును ఎదుర్కొనవచ్చును. భారతదేశ విభజనను గూర్చిన వివిధ ప్రణాళికలయొక్కయు, లేక సర్ స్టాఫర్డు క్రిప్సుచే ప్రతిపాదింపబడిన వివిధ యూనియనుల నిర్మాణముయొక్కయు గుణాగుణములను చర్చించ దగిన చోటు కాదిది. భారతదేశమును ఒకే రాజకీయ కేంద్రంగా భావించి వ్రాసే రాజ్యాంగ చట్టమునకూ, దానిని అనేక స్వతంత్ర రాజ్యాలుగా విభజించి వ్రాసే రాజ్యాంగ చట్టమునకూ చాలా సందర్భాలలో భేదం ఉంటుందని నిరూపించడానికే ఈ విషయ మిక్కడ ఉదాహరింపబడినది. విభజన నిర్ణయమైనయెడల దేశమునుండి విడి పోదలచుకొన్న వారికి ప్రజా పరిషత్తులో స్థానముండదు.

పరిషత్తు నిజంగా రాజ్యాంగ చట్టమును తయారు చేస్తూన్నప్పుడు అనేక ముఖ్య సమస్యలను పరిష్కరించవలసి వస్తుంది. పౌరుల ప్రధాన హక్కుల నిర్ణయం, కేంద్ర ప్రభుత్వాధికారాలను రాష్ట్రీయ ప్రభుత్వాధికారాలనూ వేరు వేరుగా నిర్ణయించడం; కేంద్ర శాసనసభా నిర్మాణం, కార్యనిర్వాహక వర్గముయొక్కయు, న్యాయస్థానముల యొక్కయు, ఆర్థిక వ్యవస్థలయొక్కయు నిర్మాణము, వోటింగు అధికారాలనూ, నియోజక వర్గాలనూ నిర్ణ

యించడం మొదలుగాగల అనేక ఇతర విషయాలనుగూడా అది పరిష్కరింపవలసి యున్నది. కాని యిది కొందఱు భయపెడుతూన్నంత కష్టమైన పనికాదు. ఆధునిక రాజ్యాంగ విధానాలు అనేకం మన కీ విషయంలో మార్గదర్శకములుగా నుండగలవు. రాష్ట్రీయ (Units) రాజ్యాంగములనుకూడా ప్రాతిపదికగా తయారుచేయుటకు పరిషత్తు కోరబడవచ్చును. అందువలన కేంద్ర ప్రభుత్వమునకున్నూ రాష్ట్రప్రభుత్వాల కున్నూ మూల సిద్ధాంతాలలో సమన్వయం కుదర్చడానికి సాధ్యమవుతుంది. ఆయా రాష్ట్రాల రాజ్యాంగములలో ముందుముందు మార్పులు చేసుకొనే అధికారము వాటికే వదలివేయబడవలెను. పరిషత్తు చేయవలసినపని సంగ్రహంగా ఇదే.

రాయబారాలద్వారా మార్పు :

ఈ విధంగా మన భావిరాజ్యాంగమును నిర్మించడం లోని న్యాయము, అన్నిపక్షాలవారికీ, అనగా బ్రిటిష్ వారికి, అధిక సంఖ్యాకులకు, అల్ప సంఖ్యాకులకూ కూడా సంతృప్తికరంగా ఉంటుందనీ, వారందరూ రాజ్యాంగ శాసన నిర్మాణంలో ప్రజాపరిషత్తుకు సహకారం చేస్తారనీ ఊహించి ఈ అధ్యాయమూ క్రిందటి అధ్యాయమూ వ్రాయబడినవి. ఇంతవరకూ, ప్రస్తుత పరిపాలనమునుండి నూతన పరిపాలనమునకు శాంతంగా పరిణామం పొందే విధానమే ఆలోచించబడినది.

పో రా టం ద్వా రా:

ప్రజాస్వామ్య, స్వాతంత్ర్యములకోసం నిలబడే ప్రజా పరిషత్తు కావలెనని కోరే పక్షాలవారు, రాయబారాల ద్వారా తమకోరికను నెరవేర్చుకోజాలని యెడల కొత్త పరిస్థితులూ కొత్త సమస్యలూ తటస్థించగలవు. అప్పుడీ పార్టీలన్నీ తగిన బలం సంపాదించి అధికారాన్ని లాక్కోవలసి వస్తుంది. ఈ దేశపు వింటి పరిస్థితులను బట్టి అహింసా పూర్వక నూతనోపాయము వల్లనే అది సాధ్యంకావచ్చును గాక! అటువంటి ఉపాయాలను అవలంబించవలసి రావడం వలన ప్రజా పరిషన్నిర్మాణమున కింకా సరియైన తరుణం రాలేదనీ, రాజ్యాంగ నిర్మాణ సమస్యా పరిష్కారమునకు ముందుగా పరిష్కరింపబడవలసిన రాజకీయ సమస్య ఇంకా, అలాగే ఉన్నదనీ ఋజువవుతుంది. అటువంటి పరిస్థితులలో దేశముయొక్క దృష్టి రాజకీయ సమస్యా పరిష్కారమునకున్నూ ప్రజాపరిషత్తు సమావేశమై పనిచేయడానికి తగిన వాతావరణమును సృజించేటందుకున్నూ కేంద్రీకరింపబడడం సహజం.

కాబట్టి ప్రజాపరిషత్తు ద్వారా రాజ్యాంగ చట్టమును నిర్మించ తగిన తరుణం వచ్చిందా అనే ప్రశ్నకు స్పష్టంగా జవాబు చెప్పడం కష్టం. హేతువాదమే జయం పొందగలిగిన యెడల ''వచ్చింది''అని చెప్పాలి. రాగద్వేషాలు చెలరేగేయెడల ''ఇంకారాలేదు'' అని చెప్పాలి. కాని సరియైన తరుణంలో నిజమైన ప్రజాస్వామ్య రాజ్యాంగమును తయారు

చేయవలసి వచ్చినప్పుడు అందుకు తగిన తిన్నని సంస్థ ప్రజా పరిషత్తు ఒక్కటే.

నేడు నిర్మింపబడుతూన్న భారత రాజ్యాంగ పరిషత్తు:

ఈ అనువాదం పూర్తి అయ్యేసరికి, హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి సర్ పెతిక్ లారెన్సు, సర్ స్టాఫర్డు క్రిప్సు, ఎ.వి. అలెగ్జాండరుగార్లతో కూడిన బ్రిటిష్ మంత్రి త్రయం వారు, బ్రిటిష్ ప్రభుత్వంవారి సంపూర్ణామోదముతో భావిభారత రేజ్యాంగ పరిష న్నిర్మాణమునుగూర్చి 16-5-46 న క్రొత్త ఢిల్లీలో ఒక ప్రకటన చేశారు. అందులో, ప్రజాపరిషత్తు వయస్సువచ్చిన వారందఱిచేతనూ ఎన్నుకో బడడమే అత్యుత్తమమైన పద్ధతి అయినప్పటికీ, యిప్పుడా పద్ధతిని అవలంబించేయెడల నూతన రాజ్యాంగ నిర్మాణమునకు సహించరానంత ఆలస్యమవుతుంది గనుక, వయోజన నియోజక వర్గములచే ఎన్నుకోబడిన ప్రాతినిధ్యమునకు బదులుగా దానికి అత్యంత సన్నిహితంగా ఉండే ప్రాతినిధ్యమును ఈ దిగువపద్ధతి ప్రకారం యేర్పాటుచేయబడినదని వారు వివరించారు. "ఈ రాజ్యాంగ పరిషత్తును" ఎన్నుకొనే వోటర్లు నేటి రాష్ట్ర అసెంబ్లీల సభ్యులు.

౧. "ప్రతి రాష్ట్రము యొక్క జనసంఖ్యనుబట్టీ దామాషాగా ప్రతినిధులు ఉండాలి. షుమారు 10 లక్షల కొక ప్రతినిధి వంతున ఉండాలి,

(2) అయారాష్ట్రాల ప్రతినిధుల మొత్తం సంఖ్యలో ముఖ్యసంఘాల జనసంఖ్యనుబట్టి దామాషాగా ఆయా సంఘాల ప్రాతినిధ్యం కూడా ఉండాలి.

(3) ప్రతిరాష్ట్రంలోనూ, ఒక్కొక్కసంఘానికి నిర్ణయింపబడిన ప్రతినిధులందరూ, ఆ యా రాష్ట్ర అసెంబ్లీల లోని ఆ యా సంఘాల సభ్యులచేతనే ఎన్నుకోబడవలెను.

ఈ సందర్భంలో భారతదేశము నందలి మూడు ముఖ్యసంఘాలను అంగీకరిస్తేచాలును. సాధారణసంఘము (General) మహమ్మదీయులు, సిక్కులు. 'సాధారణసంఘము' అనగా మహమ్మదీయులూ, సిక్కులూ కాని వారందరూను.''

ప్రజాపరిషత్తు ప్రతినిధుల ఎన్నికలనుగూర్చి బ్రిటిష్ మంత్రిత్రయంవారు తమ ప్రకటనలోని 19 వ సూత్రంలో యిలా ఉదాహరించారు. ''రాష్ట్రాలన్నీ 'ఎ' 'బి' 'సి' అని మూడు కూటములుగా విభజించబడినవి. అయారాష్ట్రాలకూ రాష్ట్రాలలోని సంఘాలకూ యేర్పాటు చేయబడిన ప్రాతినిధ్య మీా దిగువవిధంగా ఉంటుంది. రాష్ట్ర అసెంబ్లీలలోని ఆయాసంఘాల కేర్పాటుచేయబడిన ప్రతినిధులను ఆయా సంఘాలవారే దామాషా ఎన్నికల పద్ధతిని (Proportional representation with the single transferable vote) ఎన్నుకోవలెను.

## 'ఎ' కూటము

| రాష్ట్రం | సాధారణులు | మహమ్మదీయులు | మొత్తం. |
|---|---|---|---|
| మద్రాసు | 45 | 4 | 49 |
| బొంబాయి | 19 | 2 | 21 |
| సంయుక్తరాష్ట్రాలు | 47 | 8 | 55 |
| బీహారు | 31 | 5 | 36 |
| మధ్యరాష్ట్రాలు | 16 | 1 | 17 |
| ఒరిస్సా | 9 | 0 | 9 |
| | 167 | 20 | 187 |

## 'బి' కూటము

| రాష్ట్రం | సాధారణులు | మహమ్మదీయులు | సిక్కు | మొత్తం. |
|---|---|---|---|---|
| పంజాబు | 8 | 16 | 4 | 28 |
| వాయవ్య సరిహద్దు రాష్ట్రం | 0 | 3 | 0 | 3 |
| సింధు | 1 | 3 | 0 | 4 |
| మొత్తం. | 9 | 22 | 4 | 35 |

## 'సి' కూటము

| రాష్ట్రం | సాధారణ | ముస్లిం | మొత్తం. |
|---|---|---|---|
| బెంగాల్ | 27 | 33 | 60 |
| అస్సాం | 7 | 3 | 10 |
| మొత్తం. | 34 | 36 | 70 |

షరా:— వీరుగాక చీఫ్‌కమీషనరు రాష్ట్రాల ప్రతినిధులుగా, కేంద్రశాసనసభలోకి ఢిల్లీనుండి ఎన్నుకోబడినట్టి ప్రతినిధియున్నూ, అజ్మీరు మీర్వారానుండి కేంద్రశాసనసభకు ఎన్నుకోబడిన ప్రతినిధియున్నూ, కూర్గు లెజిస్లేటివ్ కౌన్సిలునుండి రాజ్యాంగపరిషత్తుకు ఎన్నుకోబడే ప్రతినిధియున్నూ 'ఏ' కూటములో సభ్యులుగా ఉంటారు. కూర్గు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులందరికీ రాజ్యాంగ పరిషత్తు ప్రతినిధికి వోటిచ్చే అధికారం ఉన్నది. కాని అందులోని అధికారసభ్యులు వోటింగులో పాల్గొనకుండునట్లు ఉత్తరువులు పంపబడును.

"బ్రిటిష్ బెలూచిస్థానమునుండి పంపబడే ప్రతినిధి 'బి' కూటములో చేరుతాడు. క్వెట్టా మున్సిపాలిటీలోని అధికారేతర సభ్యులున్నూ షాహీజిర్గాయున్నూ జాయింటుగా సమావేశమై బ్రిటిష్ బెలూచిస్థానపు ప్రతినిధిని యెన్నుకొంటారు."

సంస్థానాలు:

బ్రిటిష్ ఇండియాలో జనసంఖ్యను బట్టి ప్రాతినిధ్యమిచ్చినట్లుగానే సంస్థానాలకు గూడా తుది రాజ్యాంగ నిర్మాణ పరిషత్తులో ప్రాతినిధ్యమీయవలెనని మంత్రిత్రయం వారి అభిప్రాయం. అలా అయితే సంస్థానాల ప్రతినిధులు 93కు మించి ఉండరు. ఎన్నిక విధానము సంస్థానాధిపతులతో రాయబారాల ద్వారా నిర్ణయింపబడును. ఈలోగా

ప్రాథమిక దశలో సంస్థానాలు 'రాయబార సంఘం' (Negotiating committee) ద్వారా ప్రాతినిధ్యం కలిగి ఉంటవి.

ఈ పైవిధంగా ఎన్నుకోబడిన ప్రతినిధులు సాధ్యమైనంత త్వరలో క్రొత్త ఢిల్లీలో సమావేశమై సాధారణ కార్యక్రమాన్ని నిర్ణయించుకొంటారు. రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుణ్ణి, తదితర ఉద్యోగులనూ ఒక సలహా సంఘాన్ని (Advisory committee) ఎన్నుకొంటారు. ఈ సలహా సంఘమే పౌరుల ప్రాథమిక హక్కులను, అల్ప సంఖ్యాకుల యొక్కయు అడవి జాతులయొక్కయు, వెలి భూములలోని (Excluded Areas) వారియొక్కయు హక్కులను గూర్చి విచారించి రాజ్యాంగ పరిషత్తుకు నివేదించగలదు.

తరువాత రాష్ట్ర ప్రతినిధు లందరూ పైన చూపబడిన 'ఎ' 'బి' 'సి' కూటములుగా విడిపోయి ప్రతి కూటములోనూ గల రాష్ట్రముల రాజ్యాంగ శాసనములను తయారుచేయ ప్రారంభిస్తారు; పిమ్మట ఆ యా కూటములకు కూడా ఒక రాజ్యాంగ చట్టము అవసరమా అనే విషయాన్ని నిర్ణయించి అవసరమైతే ఏ రాష్ట్రీయ వ్యవహారాలు ఆ కూటముల అధీనంలో ఉండవలెనో స్థిరపరుస్తారు. ఇది జరిగిన తరువాత 'ఎ' 'బి' 'సి' కూటములలోని ప్రతినిధు లందరున్నూ, సంస్థానాల ప్రతినిధులున్నూ తిరిగి సమావేశమై యూనియన్ రాజ్యాంగమును నిర్ణయిస్తారు.

ముఖ్యసాంఘికసమస్య యేదైనా చర్చకు వచ్చినప్పుడు యూనియన్ రాజ్యాంగ నిర్మాణపరిషత్తులో హాజరై ఉన్న

రెండు ప్రధానసంఘాల ప్రతినిధులలో ప్రతిఒక సంఘానికి చెందిన అధికసంఖ్యాక ప్రతినిధులు వోటుచేస్తేనేగాని ఆ సమస్య పరిష్కారమైనట్లుగా భావించబడదు.

ముఖ్యసాంఘికసమస్యలకు ఏ తీర్మానాలు సావకాశం కలిగిస్తున్నవి అనే విషయాన్ని నిర్ణయించి చెప్పవలసింది యూనియన్ రాజ్యాంగ నిర్మాణపరిషత్తు అధ్యక్షుడు. ఐతే ప్రధానసంఘాలలో యేఒక్కసంఘానికి చెందిన మెజారిటీ ప్రతినిధులు కోరినప్పటికీ తాను నిర్ణయంచేసే ముందు ఫెడరల్ కోర్టును యూనియన్ రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడు సంప్రతించాలి.

బ్రిటిష్ ప్రభుత్వమునుండి అధికారము భారతీయులకు బదిలీఅయిన కారణాన తటస్థించే నూతనసమస్యలను గూర్చి యునైటెడ్ కింగ్డంతో యూనియన్ రాజ్యాంగపరిషత్తు సంధిచేసికోవాలి. బ్రిటిష్ మంత్రిత్రయంవారు భావిభారత రాజ్యాంగవిధానమునకు ఈక్రిందిప్రాతిపదికను సూచించారు.

(౧) బ్రిటిష్ ఇండియాయున్నూ, సంస్థానాలున్నూ కలసి భావిభారత రాజ్యాంగంలో ఒకే యూనియన్‌గా ఉండాలి. విదేశవ్యవహారాలు, దేశరక్షణ, రాదారీలు, ఆ యూనియన్ పరిపాలనక్రిందనే ఉండాలి. యూనియనుకు యిందుకు కావలసిన ద్రవ్యమును సమకూర్చుకొనే అధికారం ఉండాలి.

(౨) బ్రిటిష్ ఇండియా నుండీ, సంస్థాల నుండీ వచ్చిన ప్రతినిధులతో యూనియనుకు ఒక శాసనసభా, ఒక కార్య నిర్వాహకవర్గమూ ఉండాలి.

(3) యూనియనులో చేర్చబడని అన్నివిషయాలూ, అన్ని శేషాధికారాలూ (Residuary powers) రాష్ట్రాలకు ఉండాలి.

(౪) యూనియనుకు ప్రత్యేకింపబడని అన్ని వ్యవహారాలూ, అన్నిఅధికారాలూ సంస్థానాలకు ఉండాలి.

(౫) రాష్ట్రాలు శాసనసభా కార్యనిర్వాహవర్గములు కలిగి, గుంపులుగా చేరడానికి వాటికి స్వాతంత్ర్యం ఉండాలి. తాము సమిష్టిగా వ్యవహరించుకోతగిన రాష్ట్రీయ విషయాలను ఆ యా కూటములు నిర్ణయించుకోవాలి.

(౬) రాష్ట్రీయ అసెంబ్లీసభ్యుల మెజారిటీ వోట్లతో యేరాష్ట్రమైనను సరే, నూతన రాజ్యాంగచట్టము అమలులోకి వచ్చిన పదియేండ్ల తరువాతగానీ, తరువాత ప్రతి పది యేండ్లకుగానీ, రాజ్యాంగచట్టపు షరతులను పునర్విచారణ చేయకోరడానికి హక్కుగలిగి ఉండి, ఆహక్కు యూనియను రాజ్యాంగములోనూ, కూటముల రాజ్యాంగములలోనూ సూత్రీకరింపబడి ఉండాలి.

# అనుబంధము

మంత్రిప్రభుత్వ ప్రకటన ననుసరించి ప్రజాపరిషత్తునకు జూలై నెలలో రాష్ట్రీయములన్నిటియందున్న ఎన్నికలు జరిగెను. వాటికి ఫలితంగా కాంగ్రెసు పక్షానికి చెందినవారు 207 సభ్యులు, ముస్లింలీగుకు చెందినవారు 78, స్వతంత్రులు 12 గురు పరిషత్సభ్యులయ్యారు. సిక్కులకుగాను కేటాయించబడ్డ నాలుగుస్థానాలకు ఎన్నికలు జరుగలేదు. సంస్థానాలనుంచి రావలసిన 93 సభ్యుల విషయమై ఇంకాను ఆలోచనలు జరుగుచున్నవి. పరిషత్తులో ఉండవలసిన సభ్యుల మొత్తం 389. సంస్థానాలనుంచి వచ్చేవారు ఏపక్షానికిచెందినవారైన, మొత్తంమీద కాంగ్రెసు సభ్యులు 207 అగుటచేత పరిషత్తులో కాంగ్రెసుపక్షానికే మెజారిటీ ఏర్పడ్డది. ఇది ఒక గమనించతగ్గవిషయం. కూటాలలో "ఏ" కూటాన కాంగ్రెసుకు, "బి", "సి" కూటాలలో ముస్లింలీగుకు మెజారిటీలు ఉన్నవి. ఈ పరిషత్తునకు దేశంలో ప్రముఖులని పేరుగాంచిన వారిలో అనేకులు సభ్యులయ్యారు. మద్రాసు రాష్ట్రంనుంచి ఈ క్రింద పేర్కొనబడ్డవారు పరిషత్తులో సభ్యులు.

కాంగ్రెసుపక్షంవారు 45.

1. శ్రీయుత సి. రాజగోపాలాచారి
2. ,, ఎన్. గోపాలస్వామి అయ్యంగారు
3. ,, అల్లాడి క్రిష్ణస్వామి అయ్యరు
4. డాక్టరు పట్టాభి సీతారామయ్య
5. శ్రీయుత కె. సంతానం
6. ,, బి. శివరావు
7. ,, శ్రీనివాసమల్లయ్య

8. శ్రీమతి అమ్ముస్వామినాదన్
9. శ్రీయుత ఎస్. హెచ్. ప్రేటరు
10. ,, ఒ. వి. అలగేశన్
11. ,, కె. చంద్రమౌళి
12. ,, జెరోమ్ డిసూజా
13. ,, బి. గోపాలరెడ్డి
14. ,, డి. గోవిందదాసు
15. ,, పి. కక్కన్
16. ,, కె. కామరాజ నాడారు
17. ,, ఎల్. క్రిష్ణస్వామి భారతి
18. ,, పి. కుంజిహిరామన్
19. ,, కె. మాధవమీనన్
20. ,, వి. ఐ. మునుస్వామి పిళ్ళై
21. ,, కుమారరాజా సర్ ముత్తయ్య చెట్టియార్
22. ,, వి. నాడిముత్తుపిళ్ళె
23. ,, ఎస్. నాగప్ప
24. ,, పి. ఎల్. నరసింహరాజు
25. ,, సి. పెరుమలస్వామిరెడ్డి
26. ,, టి. ప్రకాశం
27. ,, టి. ఎ. రామలింగ చెట్టియార్
28. ,, రామనాథ్ గోయింకా
29. ,, ఒ. పి. రామస్వామిరెడ్డి
30. ,, ఎన్. జి. రంగా
31. ,, ఎన్. సంజీవరెడ్డి
32. ,, హెచ్. సీతారామరెడ్డి
33. ,, ఎమ్. సి. వీరబాహు

34. శ్రీయుత కళా వెంకటరావు
35. ,, టి. టి. క్రిష్ణమాచారి
36. ,, ఎమ్. అనంతశయనం అయ్యంగారు
37. శ్రీమతి జి. దుర్గాబాయి
38. డాక్టరు పి. సుబ్బరాయన్
39. శ్రీయుత బొబ్బిలిరాజా
40. ,, వి. సుబ్రహ్మణ్యం
41. ,, సి. సుబ్రహ్మణ్యం
42. ,, పి. ఎమ్. వేలాయుధపాణి
43. ,, వి. సి. కేశవరావు
44. ,, టి. జె. ఎమ్. విల్సను
45. ,, దాక్షాయిని వేలాయుదమ్

ముస్లింలీగు పక్షంవారు 4.

1. శ్రీ ఓ. పోకర్
2. ,, కె. టి. యమ్. అహమద్ ఇబ్రహీం
3. ,, మహబూబ్ ఆలీ బేగ్
4. ,, హాజిఅబ్దుల్ సత్తార్ హాజిఎషాక్ సేటు